# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

**స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా
వెలారిస్తున్న శాంతాగ్రూప్
రథసారథులు
తెలుగువారే...!**

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మునుపెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరపున టీకాల ఉత్పత్తి

అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరపున పరిశోధన

హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సిన్‌లను అభివృద్ధి చేస్తూ...

కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!
శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

Pioneers in r-DNA Based Human Healthcare Products in India

Customised Monoclonal & Polyclonal Antibodies

Recombinant Protein Development, Manufacturing & Formulation

Vaccines, Therapeutic Products & Diagnostics

cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals

Nutraceuticals

**W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine**



**SHANTHA BIOTECHNICS PVT. LTD.**
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com



# హాసం

హాస్య-సంగీత పత్రిక

## ఇవీ సంగతులు

70

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**

చిరంజీవి
(స్పెషల్ ఫోటో)
ఫోటో కర్టెసీ :
అల్లు తాతాజీ



## హాస్యం

















## సంగీతం



**'సెంటర్ స్ప్రెడ్' లో**




సినిమా పాటల ప్రత్యేకం

స్థలాభావం వల్ల 'పెళ్ళి పుస్తకం', 'చౌచౌ చౌరస్తా', 'సరిగపదమని ఫలితాలు' ఈ సంచికలో వేయలేక పోయాం. వచ్చే సంచిక నుండీ యధావిధిగా ఉంటాయి.




పాత పాటల ప్రత్యేకం
45 వ పేజీ నుండి 56 వ పేజీ వరకూ



**16-31** జులై హాసం సంచికలో మహ్మద్ రఫీ వర్ధంతిని పురస్కరించుకొని మృణాళినిగారు అందించిన వ్యాసం నూవర్బ్. 'భక్త రామదాసు'లోని 'రామ్‌నామ్‌కా జ్యాదా భాయి' పాటను, 'లోఫర్' చిత్రంలోని 'ఆజ్ మౌసం బడా బేఇమాన్ హై' లాంటి పాటలను పూర్తిగా ఇస్తే ఇంకా బాగుండేది. హ్యామరథంలో ఎన్.టి.ఆర్.గారితో తమ అనుభవాలను రావి కొండలరావుగారు మా కళ్ళకు కట్టినట్లుగా వివరించారు. **-ఎ.విజయలక్ష్మి,గుర్రంపోడ్.**

"నభూతో నభవిష్యతి"... రఫీ వ్యక్తిత్వం... అతని జీవితం అన్నీ అతని పాటల్లాటివే! ఆ మహానుభావుని పేరు పెట్టుకున్న నేను 16-31 జూలై సంచిక జీవితాంతం భద్రపరుచు కుంటాను. **-యస్.మహ్మద్‌రఫీ, కాశీబుగ్గ.**

1-15 ఆగస్టు 'హాసం' సంచికలో 'సినీగీతం-సినారే మనోగతం' శీర్షికలో సి. నారాయణరెడ్డి గారు తెలిపిన అభిప్రాయాలను సువర్ణాక్షరాలతో లిఖింపవచ్చు. మహానుభావులైన ఆనాటి తరం కవులకు సమకాలికులైన సి.నా.రె. తమ పాటలలో ప్రతి భావాన్ని ఎంత సుందరంగా చెప్పి, అటు పండితుల్ని, ఇటు పామరుల్ని మెప్పించారు! కుండ బద్దలు కొట్టినట్టు తమ అమూల్యమైన అభిప్రాయాలని తెలియచేసిన తీరు ఎంతైనా అభినందనీయం. వారికివే శతకోటి వందనాలు.

**-రాచర్ల రాధాకృష్ణ, గోదావరిఖని.**

'హాసం' క్లబ్ కాన్సెప్ట్‌కి బీజావాపన చేసినవారికి నా హృదయపూర్వక ప్రణతులు. 'ఆంధ్రబాలానంద సంఘం'లో ఎంతమంది చిన్నారులు తమ విలక్షణ గళాలతో చక్కని పాటలు పాడి, మిమిక్రీ చేశారో! ఈ రోజుల్లో నలుగురు కలిస్తే ఏదో ఓ పాట ప్రసక్తి వచ్చేది. పాడటమూ, పాడించుకోవడమూ వుండేది. పేరంటం అంటే అదొక సాంస్కృతిక వేదిక. కళాభినివేశానికీ దర్పణం. ప్రస్తుతం ఆ సంబరాలు లేవు. 'హాసం' క్లబ్ వాతావరణం చూశాక ఆ సంబరాలు గుర్తుకు వచ్చి, నాబాల్యం కళ్ళముందు నిలిచింది.

**-యన్. జ్యోతిర్మయి, మల్కాజ్‌గిరి.**

1-15 అగస్టు 'హాసం' చాలా బాగుంది. ముఖ్యంగా అఖిలాంధ్రుల అభిమాన నటి జమునగారి పాటలు చాలా బాగున్నాయి. అట్లాగే మాకు ఇష్టమైన మయూరి సిన్మా పాటలు ఇవ్వడం మాకెంతో ఆనందాన్ని ఇచ్చింది.

**-కోటా. శ్రీదేవి, శృంగారపుకోట.**

'వులగం' వారి జంధ్యామారుతం' సమపాళ్ళలో ఉడికి నెయ్యి, బెల్లం ముక్క కలిపి తిన్నంత మధురంగా ఉంటోంది. పుట్టిన రోజునాడ మా బొమ్మ 'పులగం' వండి పెట్టేది. అందులో నెయ్యి, బెల్లం ముక్క కలిపి 'తినరాభడవా కానా' అని ఆశ్వీర్వదించేది. ఇప్పుడు కేకులొచ్చాక పులగం కనుమరుగై పోయింది.

**-కె.వి.యల్.నరసింహమూర్తి, హైదరాబాద్.**

మృణాళినిగారు వ్రాస్తే, రచనలో గాయనీ గాయకులు మన కళ్ళెదుట మైకు ముందు పాడుతూ కనిపిస్తారు. వారిది సజీవ రచన- సజీవ చిత్రణ. **-కె.వసంత్‌కుమార్, దేవరకొండ.**

'హాసం' యాదృచ్ఛికంగా చూచి, పాత సంచికలు అన్ని తెప్పించుకుని, రెగ్యులర్‌గా కొనుక్కుని చదువుతున్న పాఠకుడిని నేను. ఒక్కొక్క సంచిక చూడగానే మీకు నా అనుభూతులు తెలియపరచాలని ఎంతగానో అనిపించికూడా నేను వ్రాయలేదు. 1-15ఆగస్టు సంచిక చూచి (చదివి) ఈ వాక్యాలు వ్రాయకుండా వుండలేక వ్రాస్తున్నాను. 'మేరే మెహబూబ్ తుఝే' పాటలోని హిందీ అర్థం అయ్యింది గాని ఉర్దూ పదాలు అర్థం కాలేదు. నాకు అప్పటికీ ఇప్పటికీ కూడా, మృణాళిని గారు, షకీల్ బదయూనీని స్మరిస్తూ. ఈ పాటను వ్యాఖ్యానించడం, నాలాంటి వాళ్ళకి మహోపకారం.

**-టి.కె.వి. అయ్యంగార్, వరంగల్.**

శ్రీ ఆచార్య తిరుమలగారి మరణవార్త ఎంతో ఆవేదనను కలిగించింది. శ్రీ అచార్య తిరుమల గారి 'నవ్వుటద్దాలు' వ్యాసాలు, చాలా బాగుండేవి. భాషలోని చమత్కారాల ఆధారంగా భావాలతో ఆడుకోవడం, సున్నిత హాస్యంతో జోడించిన వారి వ్యాసాల ద్వారా (కవుల ఆవేదన, చమత్కార వ్యవహారాలు, అల్లుడే....అల్లుడు... వంటివి) సాహితీ ప్రియులకు అందించడం వారి సాహితీ పిపాసుకు తార్కాణం

**-పి. వేణుగోపాల్ రావు, అచ్చంపేట.**

పోయినోళ్ళ జ్ఞాపకాలను (స్మృతినివాళి) గా తెలిపే మీ బృహత్ప్రయత్నం- నిజంగా మాలాంటివారికి తీపిగుర్తుల మౌక్తికం.

**-తుంబళం ప్రేమ్‌కుమార్, కర్నూలు.**

స్వర్ణోత్సవాన్ని చవిచూస్తున్న శ్రీమతి జమునగారి జ్ఞాపకాల ధారావాహిక 'నేనూ-నాపాటలు' శీర్షిక చాలా ఆకర్షణీయంగా ఉంది. సమయోచితంగా 'హాసం' ప్రచురించే ఈ వ్యాసానికి ప్రత్యేకంగా 'హాసాన్ని' అభినందిస్తున్నాను.

**-డి.వి.వి.ఎస్.నారాయణ,వనపర్తి.**

నా అభిప్రాయం ప్రకారం 'హాసం' 'మనసున్న' పత్రిక మన'సు' పత్రిక. అందుకే అందరి మనసుల్ని తట్టిలేపుతోంది. అలాగే మీ 'ఆ పాత-మధురం' లోపాత పాటలు -కొత్తగా అర్థమౌతున్నాయి.

**-బాలవెంకట ఆదిలక్ష్మి,జార్ఖండ్.**

మీరు వేసే పాటలన్నిటిలోను అక్షర దోషాలు ఏ మాత్రం ఉండవు. అందుకే నాకు 'హాసం'అంటే మరీఇష్టం. 'జంధ్యామారుతం' శీర్షికన ప్రచురించిన 'అహనాపెళ్ళంట' కథనం మమ్మల్ని మరోసారి ఆనందడోలికల్లో ముంచెత్తింది. కొత్త కొత్త శీర్షికలతో 'హాసం'మమ్మల్ని మరింత ఆకట్టుకుంటుంది. కవర్ పేజి చాలా బావుంది.

**-సి.విజయసారథి,కర్నూలు.**

రేండేళ్ళ క్రితం,ఢిల్లీ.ఎ.పి.భవన్‌లో ఏదో ప్రోగ్రాంకి అటెండయి,కొత్తవుస్తకవేందో బావుందని చేతిలోకి తీసుకుని,అడ్రస్ రాసిచ్చిన వుణ్యానికి ప్రతి 15రోజులకూ హాసాన్ని చేతికందిస్తున్న మీకు అభినందనలు. అయితే మొదటిసారి మీ పుస్తకాన్ని ఏ క్షణాన నా చేతిలోకి తీసుకున్నానో యీ 'హాసం' ఎందరి మనసుల్లో సుస్థిర స్థానం సంపాదించుకున్నదో, మీరు ఉహించలేరు. ఢిల్లీ లోని,నాసర్కిల్‌లో ఎందరో 'హాసం' అభిమానులుగా మారారు. 'హాసం'లో మీరు ప్రచురించే పాటలు ఒక్కొక్కటి ఒక్కొక్క జ్ఞాపకాలపుట. అటు హిందీ, యిటు తెలుగు చలన చిత్రాల్లోని రత్నాలు, ఆణిముత్యాలు గుదిగుచ్చి మాలలందిస్తూ వుంటే, భద్రపరచుకోవటం కష్టంగా వుందండీ. ఢిల్లీలో వున్నంత కాలం, కొత్త సంచిక చేతికి రావటం,మిత్రులందరితో కలిసి జోక్స్, పాటలు గురించి చర్చించుకోవటం, ఏయే సందర్భాల్లో ఆ చిత్రాలు చూసింది, ఆ నాటి అనుభవాలు కలిసి పంచుకోవటం, ఎంతో బావుండేది. ఇప్పుడు ఏర్పడిన హాసం క్లబ్‌కు పునాది దాదాపు రెండేళ్ళ క్రితమే ఢిల్లీలో ఏర్పండిందని చెప్పుకోవాలి.

**-జి. విజయలక్ష్మి,సికింద్రాబాద్.**

'హాసం' పత్రిక అభిమానిని,మా చిన్నతమ్ముడు చూపిస్తే దీని గురించి తెలిసింది. వృత్తి రీత్యా నేను డాక్టర్ని. నాకు చిన్నప్పటినుండి పాటలు పాడటం అలవాటు. ఇష్టం. హాస్యం అంటే మాకిష్టం. "జంధ్యాల" అంటే అభిమానం. 'జంధ్యామారుతం' లో ఆయన సినిమాలన్నీ వివరించండి. 'హాసం' పత్రిక గురించి ఇతరులకు తెలుపుతున్నాను. 'సంపాదకీయంలో' చక్కగా విశ్లేషిస్తున్నారు. సినిమా క్యాసెట్లు విడుదలైనప్పుడు దాని గురించి మీరు వివరిస్తున్న తీరు ఆకట్టుకుంది.

**-డా॥యస్.రాజశేఖర్ రెడ్డి,మహబూబ్‌నగర్.**

ఆచార్య తిరుమల గారికి మీరు ఘటించిన అక్షరాంజలి ఎంతో ఔచిత్యవంతంగా ఉన్నది. ఈ ప్రపంచంలో నాకున్న ఒకే ఒక అప్తుడు ఆచార్య తిరుమల. 'కథలను ఆపేసి సీరియల్స్ ప్రయత్నించు' అని నాకు మొదట సలహా ఇచ్చింది ఆయనే. జంట నగరాలలోని సుప్రసిద్ధ కవుల పరిచయ భాగ్యం నాకు ఆయన ద్వారానే కలిగింది. ఒక సభలో డా॥ సి.నా.రె. 'హాసం'లో వస్తున్న నవ్వుటద్దాలు శీర్షికను ప్రస్తావించి ఆచార్య తిరుమలను ప్రశంసలలో ముంచెత్తారు. ఇంత చిన్న వయసులోనే ఆయన పరలోక గతులు కావడం సాహితీ ప్రపంచానికి, నాబోంట్లకు పెను విషాదం. **-ఇలపావులూరి మురళీమోహనరావు, హైదరాబాద్**

సంపుటి: 3 సంచిక:22

**16-31 ఆగస్టు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి

చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

70

గత పదిహేనేళ్లలో సమాజం తక్కిన విషయాలలో పురోగమించినా పురోగమించకపోయినా అశ్లీలతను, దేహప్రదర్శనను సహించడంలోను, స్పందనా రాహిత్యంలోనూ మాత్రం చాలా 'ముందంజ' వేసింది.

ఈ మార్పుకు సినిమాలు కొంతమేరకే సహకరించాయి. ఎక్కువ మార్కులు కొట్టేసినది మాత్రం కేబుల్ టీవీ ద్వారా విస్తరించిన పాశ్చాత్యసంస్కృతి! అత్యంత దురదృష్టకరమైన విషయం ఏమిటంటే ఈ అసభ్యతను, అశ్లీలతను, నగ్నత్వాన్ని సరఫరా జేయడానికి వారుపయోగిస్తున్న వాహనం- సంగీతం కావడం! తరచిచూస్తే 'ఫేషన్ టీవీ' వాటి వల్ల జరిగే చెఱుపు తక్కువ. ఓ పావుగంట చూసేసరికి మొనాటనీవల్ల అది బోరు కొట్టవచ్చు. కానీ సంగీతంలో ఉండే ఆకర్షక గుణాన్ని అడ్డుగా పెట్టుకుని విశృంఖలతను మార్కెట్ చేస్తున్న మ్యూజిక్ ఛానెల్స్ వల్లనే ఉంది అసలైన ముప్పు!

నిజానికి అంతర్జాతీయ సంగీతరంగంలోనే గత రెండు దశాబ్దాలుగా పెనుమార్పులు సంభవించాయి. పూర్వపు గాయనీమణులకు అంగాంగ ప్రదర్శన చేసే అవసరం ఉండేది కాదు. కానీ మ్యూజిక్ ఆల్బమ్స్ ధర్మమాని ఈతరం గాయనులు రసజ్ఞులను మైమరిపించడానికి ఓ గాత్రం (కంఠం) పైన కంటే మరో గాత్రం (శరీరం) పైనే శ్రద్ధ పెడుతున్నారు. ఈ క్రమంలో వారు 'పాటగత్తెలకు తక్కువ, ఆటగత్తెలకు ఎక్కువ' గా తయారయ్యారు. మడోనా, బ్రిట్నీస్పియర్, క్రిస్టీనా.. ఏ గాయనీమణిని తలచుకున్నా విన్నదానికంటే కన్నదే ఎక్కువ గుర్తుకు వచ్చేలా వారిని వారు మలచుకున్నారు. మగవాళ్ల విషయానికి వస్తే చుట్టూ అరడజను మంది అర్ధనగ్న సుందరులు ఆడకపోతే పాడలేని స్థితికి వచ్చారు వారు. ఈ మ్యూజిక్ వీడియోలను పదేసి డాలర్లకు అమ్మకానికి పెడితే ఎక్కువమంది కొనేవారు కారేమో! కానీ టీవీల ద్వారా ఇంట్లోకి దూరి నట్టింట్లో నాట్యమాడుతుంటే చూడక చస్తారా? ఒకసారి అలవాటు పడ్డాక మానతారా?

సినిమాలకు సెన్సార్ ఉంది. మరి మ్యూజిక్ ఆల్బమ్స్‌కు లేదేం? ఈ ప్రశ్న వేసింది వేరెవరో కాదు సాక్షాత్తూ సెన్సార్ బోర్డు ఛైర్మన్ అనుపమ్ ఖేర్! 'సినిమాకు వెళ్లే వ్యక్తికి ఎటువంటి రకం సినిమా చూపిస్తారో ముందే తెలుసు. నచ్చకపోతే హాల్లోంచి మహరాజులా బయటకు వచ్చేయచ్చు. కానీ టీవీ పేరిట ఈ మ్యూజిక్ వీడియోలను జనాలపై రుద్దుతున్నారు. ఇండియాలో 'పేరెంటల్ లాకింగ్' సిస్టమ్ లేదు. నిరక్ష్యరాస్యత ప్రబలంగా ఉన్న ఈ దేశంలో 'సెల్ఫ్-సెన్సార్' అన్నమాటకు అర్థం లేదు. మ్యూజిక్ ఆల్బమ్స్‌ను కూడా సెన్సార్ పరిధిలోకి తీసురావలసినదే'! అని గతనెల 'విమెన్, మీడియా అండ్ ది లా' అనే సదస్సులో పాల్గొంటూ ఆయన విజ్ఞప్తి చేశారు.

పరిస్థితి తీవ్రంగా ఉందని అంగీకరిస్తూనే ఈ ఛానెల్స్ విదేశాల నుండి ప్రసారం అవుతాయి కాబట్టి నియంత్రించడంలో సాంకేతికమైన ఇబ్బందులు ఉంటాయని అంటారు చాలామంది. ఎమర్జన్సీ కాలంలో బిబిసి రేడియో తరంగాలను అడ్డుకోగలిగింది ఆనాటి ప్రభుత్వం. భారతీయ సినిమాలు తమ టీవీలలో కనబడకుండా జాగ్రత్తపడుతోంది పాకిస్తాన్. గట్టిగా తలచుకోవాలే గానీ ఏదీ అసాధ్యం కాదు! వీటి వల్ల సమాజానికి జరుగుతున్న హానిని దృష్టిలో పెట్టుకుని, ఈ దిశలో సాంకేతిక పరిశోధనకు నిధులు వెచ్చించాల్సిన సమయం ఆసన్నమైందనిపిస్తోంది. ఆలస్యం అనర్థహేతువు అని గ్రహించి జాగ్రత్తపడకపోతే మన నీడ కూడా మనల్ని వక్రదృష్టితో చూసే ప్రమాదముంది.



ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## క రాజు కథలు 19

# మర్కట సూత్రాలు





**క** రాజు దగ్గర్నుంచి వెంటనే రావల్సిందిగా మంత్రికి కబురొచ్చింది. ఇలా కబురొచ్చినప్పుడెల్లా మహారాజు తను లేకుండా ఏ పనీ చెయ్యడనే ఆనందంతో మంత్రికి కొత్త ఉత్సాహం పుట్టుకొస్తుంటుంది. కానీ ఇప్పుడు ఏ పని మీద రాజు గారు అతన్ని రమ్మన్నారో తెలీదు. అయినా ఎటూ ఒక ముఖ్యమైన పని మీద ఈరోజే కలుసుకోవాలనుకున్నాడు మంత్రి. అది నీతి నాటకాల నీలకంఠయ్యను గురించి కరాజుకు చెప్పడం. నీలకంఠయ్య అంటే అందరికీ ఎంతో గౌరవం. దీనికి కారణం ఒక చిన్న మచ్చ కూడా లేని అతని సన్మార్గ జీవనం. "నన్ను గురించి ఏ ఒక్కరూ చిన్న వేలెత్తి కూడా చూపకూడదు" అని ఎప్పుడూ అంటుంటాడు. ఊళ్లో వాళ్ళెవరైనా అతన్ని చులకనగా చూస్తే అతను సహించలేడు. విపరీతంగా బాధపడిపోతాడు. ఆ పరిస్థితి రాకుండా ఉండటానికి ప్రతిక్షణం ప్రయత్నిస్తుంటాడు. ఆ యత్నంలో భాగంగానే పెక్కు నీతి నాటకాలను రాసి, మిత్రుల చేత ప్రదర్శనలిప్పించాడు. అతని కృషిని అందరూ మెచ్చుకునే వారే గాని అవి చూడ్డానికి ఎవరూ వచ్చేవారు కారు. అయినా, నీలకంఠయ్య తన నీతి నాటకాలతో సమాజానికి ఎనలేని సేవ చేస్తున్నాడని పెద్దలంతా పొగిడేవారు. చివరకు ఒక బ్రహ్మాండమయిన సన్మాన సభ కూడా ఏర్పాటు చేసారు. దానికి అధ్యక్షత వహించిన నరసింహశాస్త్రి చేతుల మీదుగా నీలకంఠయ్యకు "నీతి సామ్రాట్" అనే బిరుదు ప్రసాదింపబడింది.

సామాన్యంగా ఇలాంటి పరిస్థితుల్లో ఎవరైనా సంతోషిస్తారు. కాని నీలకంఠయ్య పరిస్థితి అలా లేదు. పేరుకు తగ్గట్టు బయటికి చెప్పలేని చేదు నిజాన్ని కంఠంలోనే దాచుకున్నాడు. అది అతని ఆర్థిక పరిస్థితి. ఇంట్లో గడవడం ఎంత కష్టంగా

వున్నా 'ఎవరైనా అప్పుడిగితే తనను తక్కువగా చూస్తారేమోనన్న భయంతో ఎవర్నీ అడిగేవాడు కాదు. ఒకసారి నరసింహశాస్త్రి నీలకంఠయ్య నుద్దేశించి "ఊళ్ళోకెల్లా ఒక్క రూక కూడా అడిగి తీసుకోని ఒకే ఒక ఉత్తమ వ్యక్తి" అని పొగడడంతో ఉన్న పేరుకు ఆ కీర్తి కూడా తోడై అతన్ని ఇంకా ఇబ్బంది పెట్టింది. ఇలా పొగడడంతో తనను అప్పడగకుండా నరసింహశాస్త్రి జాగ్రత్త పడ్డాడని పాపం నీలకంఠయ్యకు స్ఫురించలేదు.

ఈ సమయంలోనే అతనికి ఇంద్రసేనుడితో పరిచయమైంది. ఇంద్రసేనుడు ఊరూరా తిరిగి నాటకాలను ప్రదర్శిస్తుంటాడు. ఆ నాటకాలన్నీ శృంగార పరమైనటు వంటివి. వాటి సంభాషణలు యువతను ఉత్తేజపరిచేలా వుంటాయి. అందుకని వాటికి జనాదరణ బాగా వున్నది. కొందరు పెద్దలు అవన్నీ బూతు నాటకాలని నిందిస్తున్నా, సమయం దొరికినపుడు వాళ్ళే వాటిని రహస్యంగా చూసేవారు. కాని రానురాను ఆ నాటకాలకు ఆదరణ బాగా తగ్గుతూ వచ్చింది. "విన్న బూతులే వింటున్నాం. కొత్తదనం ఏమీలేదు" అన్నది జనాభిప్రాయం. ఈ పరిస్థితిలో ఇంద్రసేనుడికేం చెయ్యాలో తోచక ఒక ఆలోచన వచ్చి ఒక రాత్రి రహస్యంగా నీలకంఠయ్య ఇంటికి వచ్చాడు. వచ్చీ రాగానే నీలకంఠయ్య కాళ్ళకు నమస్కరించి దక్షిణగా వెయ్యిన్నూటపదహార్లు ఇచ్చుకున్నాడు. ఎన్నడూ చూడని ఇంత డబ్బు చూడగానే నీలకంఠయ్యకు మతిపోయినంత పని అయింది. మగతలో ఉన్నవాడిలా చూస్తూ ఇంద్రసేనుణ్ణి సాదరంగా ఇంట్లోకి ఆహ్వానించాడు.

ఇంద్రసేనుడు ఎదుటి వానిలో నిగూఢంగా దాగున్న ప్రతిభను గ్రహించగలిగిన నేర్పరి. ప్రపంచం దృష్టిలో నీలకంఠయ్య నీతి నాటకాలలో ప్రతిభావంతుడనుకుంటున్నా అతనిలో బూతు నాటకాలను రాసే ప్రతిభ కూడా ఉన్నదన్న విషయం ఇంద్రసేనుడు పసిగట్టాడు. దాంతో నీలకంఠయ్యను కలుసుకొని తనకు కావలసిన బూతు నాటకాలను రహస్యంగా రాసిస్తే వాటిని ఇంద్రసేనుని రచనలలా జనానికి చాటి ప్రదర్శిస్తానని, దానికి కావలసిన పారితోషికం ముట్టచెప్తానని హామీ యిచ్చాడు. ముందు నీలకంఠయ్య దీనికి ససేమిరా ఒప్పుకోలేదు. కాని పేదరిక ప్రభావం అతన్ని లొంగదీసింది. ఎట్టకేలకు ఇంద్రసేనుడు చెప్పిన దానికి నీలకంఠయ్య ఒప్పుకున్నాడు.

కొద్ది రోజుల్లోనే ఇంద్రసేనుడు ప్రదర్శించిన "మన్మథ విజయం" విశేషమైన జనాదరణ పొందింది. ఆ తర్వాత "నాలో నీవూ నీలో నేను", "అలుపెరగని నాయకుడు", "చీరలోనే వున్న అందం", "అబ్బ-కుట్టాడిదెబ్బ" లాంటి గిలిగింతలు పెట్టే నాటకాలు విజయభేరి మ్రోగించాయి. ఇంద్రసేనుడు అనతికాలంలోనే రాజ్యంలోని పెద్ద ధనికుల జాబితాలోకి చేరిపొయ్యాడు. దీనికంతా పరాకాష్టగా, ఇన్ని గొప్ప విజయాల్ని సాధించిన ఇంద్రసేనుడికి సన్మానం చేస్తే అతని శృంగార భావాన్ని మెచ్చుకుంటూ వేదిక మీద మాట్లాడింది ఎవరో కాదు - ఆనాడు తన నీతుల్ని పొగిడిన నరసింహశాస్త్రి.

ఈ నాటకాల్ని వెనక నుంచి రాస్తున్న నీలకంఠయ్యకు మాత్రం ఇల్లు గడవడానికి సరిపొయ్యేంత పారితోషికం లభిస్తోంది. కాని తన ప్రతిభతో ఇంద్రసేనుడు ఇంత సంపాదిస్తున్నాడన్న ఉక్రోషం నీలకంఠయ్యను దహించివేసింది. అయితే ఈ బూతు నాటకాల్ని




తనే రాసేడని నలుగురి ముందరా చెప్పుకోలేడు. ఇంద్రసేనుడితో కఠినంగా మాట్లాడ్తే ఆ వచ్చే డబ్బు కూడా రాదేమోనన్న భయం.

ఎంత రహస్యమైనా అది ఎలా బైట పడ్తుందో ఎవరికీ తెలియదు. అలాగే ఇంద్రసేనుడి బూతు నాటకాల అసలు రచయిత నీతి నాటకాల నీలకంఠయ్య అని అక్కడక్కడ గుసగుసలు బయల్దేరాయి. ఇది మంత్రిగారి దాకా వెళ్ళింది. ఇలాంటి కష్టాల్లో ఉన్న నీలకంఠయ్యను గురించి కరాజు గారితో మాట్లాడి ప్రభుత్వపరంగా ఏదైనా సహాయం చేద్దాం అనుకుంటున్న తరుణంలో రాజు గారి దగ్గర్నుంచి మంత్రిని రమ్మని కబురొచ్చింది.

కరాజు మంత్రిని పిలిపించిన పనివేరు. సలహానందస్వామి వారు దేశయాటన ముగించుకొని ఆరోజే వాళ్ళ ఊరికి ఆగమిస్తున్నారట. సలహానంద స్వామి వారి సలహాలను గురించి వినని వారు లేరు. అవి నిత్యనూతనంగానూ, ఒక్కొక్కప్పుడు చిత్రంగానూ ఉంటాయి. వాటిని పాటించిన వారంతా కష్టాలు తీరి సుఖంగా జీవిస్తున్నారు. అలాంటి స్వామివారు ఒక నెల రోజులు తన రాజధానిలో బస చేస్తే, స్వామి సలహాలతో ఊరి ప్రజలకు మేలు కలుగగలదని కరాజు ఆలోచన. అందుకని స్వామి వారికి తగు సదుపాయాలను చూడవలసిందిగా మంత్రికి ఆనతిచ్చాడు.

"అలాగే, మహారాజా" అంటూ మంత్రి ఒక్కక్షణం ఆగి "మహారాజా, నాదొక మనవి. నీతి నాటకాలు రాసే నీలకంఠయ్య పేరు విన్నారా?" అన్నాడు. కరాజుకు మంత్రి చెప్పదలచు కుందేమిటో పూర్తిగా అర్థం అయింది. "మీరేం చెప్పదలచుకున్నారో నాకు తెలుసు, మంత్రీ! సమయానికి అతని ప్రస్తావన తెచ్చారు. నీలకంఠయ్యను ఒకసారి సలహానంద స్వామిని కలవమనండి. అతని భవిష్యత్తు చక్కబడ్తుంది"



అన్నాడు కరాజు. మంత్రికి ఏం చెప్పాలో తోచలేదు. రాజాజ్ఞ ప్రకారం నీలకంఠయ్యను పిలిపించి వెంటనే సలహానందస్వామిని కలవమని చెప్పాడు.

మంత్రిగారు చెప్పినట్టుగానే నీలకంఠయ్య సలహానందస్వామిని దర్శించుకొని, తన పరిస్థితిని వివరంగా చెప్పాడు.

"నీలకంఠయ్యా, నీవు "మర్కట సూత్రాల"ను పాటిస్తే నీవు కోరిన ధనలాభం నీకు చేకూరుతుంది" అన్నాడు స్వామి.

మర్కట సూత్రాలంటే ఏమిటో నీలకంఠయ్యకు అర్థం కాలేదు. స్వామి గోడపక్కనున్న మూడు కోతి బొమ్మలను చూపించాడు.

"ఇవి పూర్వం చైనా యాత్రికులు తీసుకొచ్చిన బొమ్మలు కదా?" అన్నాడు నీలకంఠయ్య సందేహంగా.

"అవి వేరు. వినకు, చూడకు, మాట్లాడకు అనే ఆ మూడు కోతులు ఆ రాజ్యానికి ఆ కాలానికి సరిపోతుంది. కాని ఈ కోతులు వేరు. ఈ సూత్రాలు మన రాజ్యానికి, కాలానికి సరిపోయేవి" అన్నాడు స్వామి.




పరికించి చూస్తే ఆ విషయం నీలకంఠయ్యకు అర్థమైంది. ఒక కోతి కళ్ళు విప్పి చూస్తున్నది. రెండవది నోరు తెరచి ఎదుటి వాళ్ళను మాట్లాడనివ్వకుండా తనే మాట్లాడేటట్టుంది. మూడవ కోతి రెండు చెవులూ మూస్కొని తనలో తను నవ్వుకుంటోంది.

"వీటి అంతరార్థం ఏంటి స్వామీ?" అనడిగాడు నీలకంఠయ్య.

"ఏముంది? మొదటి కోతిలా ప్రతిక్షణం కళ్ళు తెరచుకొని ఎక్కడ డబ్బుందా అని చూడు. రెండవ కోతిలా ఆ డబ్బు నాకే దక్కాలి అంటూ గట్టిగా నోరు తెరచి అరిచి చేజిక్కించుకో. డబ్బు సంపాదించినవాళ్ళను చూసి లేనివాళ్ళంతా ఛీ ఛీ అంటారు. ఆ మాటలు వినకుండా మూడవ కోతిలా చెవులు మూస్కొని నీలో నువ్వు నవ్వుకో" అన్నాడు సలహానంద స్వామి.

రాత్రంతా నీలకంఠయ్య మర్కట సూత్రాలను గురించి ఆలోచించాడు. ఇన్నేళ్ళూ తనని బాధించిన పేదరికం, ఇప్పుడు కూడా తన కృషిని ఉపయోగించుకొని మరొకరు ఆనందించడం, - వీటికంతా కారణం తన తత్త్వం. తనను గురించి ఎవరేమనుకుంటారోనన్న ఆందోళన. ఇప్పుడు జ్ఞానోదయమైంది. మొదటి కోతిలా కళ్ళు విప్పి డబ్బెక్కడుందో గాలించాలి. రెండవ కోతిలా తనకు రావలసిన డబ్బును గట్టిగా అరిచి రాబట్టుకోవాలి. మూడవ కోతిలా ఎవరేమన్నా వినకుండా చెవులు మూస్కొని నవ్వుకోవాలి.

ఆ మరుసటి రోజే నీలకంఠయ్య ఇంద్రసేనుణ్ణి పిలిపించి ఇంతవరకు ఆడిన తన నాటకాలకు పెద్ద మొత్తం డబ్బు చెల్లించవలసిందని, ఇకనుంచి ప్రదర్శించే ప్రతి నాటకం తన పేరుమీదే ఆడాలని గర్జించాడు. ఇంద్రసేనుడు నిర్ఘాంతపొయ్యాడు. ఏదో చెప్పబోయాడు. కాని నీలకంఠయ్య గట్టిగా నోరు తెరచి మాట్లాడుతూ ఇంద్రసేనుణ్ణి మాట్లాడనివ్వలేదు. ఇంద్రసేనుడు నీలకంఠయ్య షరతులకు ఒప్పుకోక తప్పింది కాదు. మొట్టమొదటి సారిగా నీలకంఠయ్య అపారధనాన్ని కళ్ళారా చూశాడు. ఇప్పట్నుంచీ వరుస నాటకాలు నీలకంఠయ్య కలంలోంచి ప్రవహించాయి. ఇప్పుడు నీలకంఠయ్య పేరు చెప్తే చాలు. రాజ్యంలోని యువత ఆవేశంతో చిందులు వేస్తారు. కాని ఒక వర్గం వారు మాత్రం అతన్ని దూషించారు. యువతను పెడత్రోవన పెడ్తున్నాడని ఊళ్ళో సభలు నిర్వహించి చర్చలు జరిపించారు. కాని నీలకంఠయ్యకి ఇవేవీ వినిపించలేదు. ఎందుకంటే అతను మర్కట సూత్రాలను పాటించి చెవులు మూస్కున్నాడు కనుక.

"చూశారా మంత్రీ! మంచివాళ్ళుగా చలామణి అయ్యే వాళ్ళంతా సిద్ధాంతాలకు లోబడి కాదు. తప్పు చేస్తే నలుగురూ తమను గురించి ఏమనుకుంటారోననే భయంచేత" అన్నాడు కరాజు.

"అంటే!..." అన్నాడు మంత్రి అర్థంకాక.

"అంటే దీని అర్థం ఒకటే. చెడ్డవాళ్ళ చెడ్డ ఆలోచనలన్నీ చేతల్లో ఉంటాయి. మంచివాళ్ళ చెడ్డ ఆలోచనలన్నీ మనసుల్లోనే ఉంటాయ్" అన్నాడు కరాజు చిఱునవ్వుతో.

●




నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# నవ్వుల నివాళి "అల్లుడు రామలింగయ్య"

రామలింగయ్య గారు లేరు....తప్పు తప్పు... శుద్ధ తప్పు ...ఉన్నారు!.. ధరించిన సహస్రాధిక పాత్రలతో మన ఎదుట సజీవంగానే వున్నారు. నిన్నటిదో మొన్నటిదో అటు కిందటిదో ఏ సినిమా ఏ టీవిలో వచ్చినా అందులో రామలింగయ్య వుంటారు. మనింట్లో తిరుగుతున్నట్టే వుంటారు. వుంటూ గల గలా నవ్విస్తారు. అందరిళ్లలోనూ వుంటారు. అందరి నోళ్లలోనూ వుంటారు, పళ్లికిలింప చేస్తూ. సర్వాంతర్యామి. భగవద్గీత చెప్పినట్టు -మాసినబట్టలు విడిచి, కొత్త బట్టలు వేసుకుని -ఏ రూపంలోనో వుండి పకపకా నవ్విస్తారు.

తెనాలి రామలింగడిపేరు పెట్టుకున్న పాలకొల్లు రామలింగయ్య 'వికటకవి' లాగే వికటనటుడు. తెరమీదనే కాదు, తెరముందుకూడా అల్లువి నవ్వుల జల్లులే. అల్లరి పువ్వులే. ఒక సినిమా కంపెనీ ఆఫీసు బాయ్ తమిళ భాష వాడు. తెలుగు పేర్లు కుదరవు. "అల్లుడు రామలింగయ్య గారు" అనేవాడు "అవున్రా బాబూ! నువ్వు ఇంటిపేరుకి 'డు' చేర్చి పలుకుతున్నావు. కర్క్టే. నేను ఈ సినిమా ఇండస్ట్రీకి అల్లుడినే- అలాగే పిలువు తప్పులేదు" అని ఆ ఆఫీసబ్బాయితో చమత్కారం చేసి నవ్వించారు అల్లు.

రామలింగయ్యగారి పాత్రలు రామలింగయ్య పాత్రలే. దొంగ గుమస్తాలు, పురోహితులు, పెళ్లిళ్ల పేరయ్యలు, స్కూలు టీచర్లు వీళ్లందరూ రామలింగయ్యవే! 'కుంటినక్క' వేషాలు రామలింగయ్య సొత్తు. అవి విలన్ పాత్రల్లాంటివి. ఇతే ముక్కు, కళ్లూ,పళ్లూ బిగిస్తూ అరుపులు అరవవు. నవ్విస్తూ వినోదపరుస్తూ క్రూరంగా ప్రవరిస్తాయి. విలనీలో విశిష్ట హాస్యం, హాస్యంలోంచి విలనీ- సాధించిన హాస్యనటుడు ఆయన. అందుకని ఆయన కోసమే కొన్ని పాత్రలు పుట్టేవి. అందుకనే అప్పట్లో సినిమా డిస్ట్రిబ్యూటర్లు -సినిమా హీరోతో పాటు "కాస్టింగ్ లో రామలింగయ్య వున్నారా?" అని అడిగేవారు.



### వచ్చీరాని మంత్రం

"పాపకోసం" సినిమాలో నేనూ ఆయనా బ్రాహ్మణ వేషధారులం! చిన్నసైజు పురోహితులం కూడా. ఎవరు దండం పెట్టినా "శతమానంభవతి ...శతాయుఃపురుష...." అంటూ మంత్రం చెప్తే బావుంటుందని నేను డైరెక్టరు శేషగిరిరావుగారితో అంటే, అలాగే అని ఆయన 'అభయ హస్తం' ఇచ్చినా, రామలింగయ్య మాత్రం 'భయహస్తం' చూపించారు. "అబ్బే.. ఇప్పటికిప్పుడా మంత్రం రాదు...వద్దు" అన్నారు. "ఒక్కసారి వినండి, వింటే మీకు రాకపోవడం ఏమిటి..." అంటే "ఎందుకూ ..మీ కూడా గొంతు కలిపేసి చెప్పేస్తాను.. కానీండి" అన్నారు. మంత్రం, అక్షరాలు పలక్కుండానే, పలికినట్టుగానే పలికి అందర్నీ గొల్లు మనిపించారు, అల్లు. 'మాయబజార్'లోనూ అంతే ...మీరు సరిగ్గా చూడండి.. వచ్చీ రానట్టుగానే వుంటాయా మంత్రాలు..అలా చెప్పడంలోనే కామెడీ... "అని చెప్పారు రామలింగయ్య.



'మాయబజార్'లో వంగర, అల్లురామలింగయ్య

### సినిమాకి ఎక్కిన స్కిట్టు

ఒకసారి -మద్రాసులోని 'కళాసాగర్' వార్షికోత్సవంలో సత్యనారాయణా, ఆయన ఒక్క చిన్న బిట్ చేశారు. అది అల్లినవారు అల్లే. ఇద్దరికీ మాటా మాటా వస్తుంది.

కోపం వచ్చి సత్యనారాయణ 'ఫెడీ' మని కొడతాడు. రామలింగయ్య గిర గిర తిరిగిపోయి, 'శ్రీకృష్ణార్జున యుద్ధం'లో అంచెలంచెలపాట సన్నివేశంలో పడిపోయినట్టు పడిపోయి, ఉక్రోషంతో మండిపోతూ లేచి, "ఎవడేనా నన్ను కొడితే మొదటిసారి, క్షమించేస్తాను. రెండోసారిగాని, కొట్టాడా-నా సంగతి తెలీదు- ఏం చేస్తానో తెలీదు, జాగ్రత్త!" అని చొక్కా చేతులు పైకి మడిచి, సత్యనారాయణ మీదిమీదికి వెళ్లారు రామలింగయ్య.

సత్యనారాయణ మళ్లీ కొట్టాడు. ఈసారి కిలోమీటరు దూరానికి తుళ్లాడు రామలింగయ్య. మళ్లీ లేచి, అయానం ఆవేశం రెండూ తెచ్చుకుంటూ -"ఇదిగో ....చూడు! రెండోసారి కొట్టావు. తెలీక కొట్టావు. నా సంగతి ఎరగవు. కొట్టేనంటే -కోటిపల్లి రేవులో తేల్తావు. జాగ్రత్త.... రెండోసారి కూడా వూరుకుంటున్నాను. మూడోసారి గనక కొట్టావంటేనా-నీ రక్తం కళ్ల చూస్తాను. నీ పేగులు లాగేస్తాను. ఆహా..! ...ఒళ్లు దగ్గర పెట్టుకో" అని వార్నింగ్ ఇస్తూ వుంటే- మొదటి రెండు దెబ్బలకంటే మిన్నగా మూడోదెబ్బ చరిచాడు సత్యనారాయణ.

అల్లు పళ్లూడినట్టుగా కెవ్వుమని అరిచి, చుట్టుకుపోయి ప్రదక్షిణలు చేస్తూ.."మూడోసారి కూడా కొట్టావన్నమాట ..మూడోసారి కూడా ..నన్ను కొట్టావన్నమాట.... ఫో...నీ పాపాన నువ్వు పోతావు"అని బుగ్గమీద చెయ్యి పెట్టుకుని సీరియస్‌గా నిష్క్రమిస్తారు రామలింగయ్య- ప్రేక్షక జనాన్ని తన టైమింగ్ డైలాగ్‌తో -చప్పట్లతో నవ్విస్తూ. ఇదే బిట్టుని 'సంసారం' సినిమా షూటింగులో ఆ ఇద్దరూ సరదాగా చేస్తే- ఆ చిత్ర నిర్మాత, దర్శకుడు టి.ప్రకాశరావుగారు- రామలింగయ్య అనుమతితో ఆ స్కిట్‌ని సినిమాలో వాడుకున్నారు. అలాంటి విదూషక విదుషీమణి అల్లురామలింగయ్య.

## రేలంగి నవ్వించిన అల్లు

'నర్తనశాల' సినిమాలో ఉత్తర కుమారుడికి (రేలంగి)వెన్నంటి వుంటాడు వాలతుల్యుడు (రామలింగయ్య). నేను సినిమాకి సహకార దర్శకుణ్ణి. "ఇదిగో, ఓ మాట. వాలతుల్యుడు అంటే అర్థం వుందా? వాడు నిజంగా భారతంలో వున్నాడా?'' అని నన్నడిగారు రామలింగయ్య.

''భారతంలో లేడు. వాలతుల్యుడు అంటే "తోకలాంటి వాడు" అన్నమాట. కూడా కూడా వుంటాడు" అన్నాన్నేను. ఆ మాట విన్న రేలంగి- ''విన్నావా రామలింగయ్యా -తోకలాంటివాడివి. నా వెనకాలే వుండాలి- అటూ ఇటూ పారిపోకు..." అన్నారు. "అలాగేనండి" అన్నది రామలింగయ్య వినయకంఠం.


'నర్తనశాల'లో అల్లురామలింగయ్య, రేలంగి, ఎస్వీ రంగారావు

షాటయిపోయింది. దీపాలు ఆరాయి. రేలంగి వెళుతూ వుంటే-వెనకాలే వెళ్లారు రామలింగయ్య. "నువ్వెక్కడికయ్యా నా వెనకా?" అని రేలంగి ఓ గసురు గసిరితే "మీరే కదండీ అన్నారు వెనకాలే ఎప్పుడూ వుండాలని" అని ఇంకా వినయశీలుడయ్యారు రామలింగయ్య.

''ఓర్నీ దుంపతెగ! నేను బాత్రూమ్‌కి పోతున్నానయ్యా బాబూ!" అని గొల్లుమన్నారు రేలంగి- "బలే వోడివే" అంటూ, తిరిగొచ్చి సెట్లో వున్నందరికీ రామలింగయ్యా తోక వ్యవహారం చెప్పి నవ్వించారు రేలంగి.

## రంగారావుకే చురక !

జెమిని వారు 'భలే కోడళ్ళు' తీశారు. కె. బాలచందర్ దర్శకుడు. ఆ ముగ్గురు కోడళ్లకీ ముగ్గురు మామగార్లం-రామలింగయ్య,నేనూ, బొడ్డపాటి. దృశ్యంలో పెద్దపులిలాంటి రంగారావు కూడా వున్నారు. ఆయన కూచుని పుస్తకం చదువుకుంటూనే, రిహార్సిల్స్ చూస్తున్నారు. బొడ్డపాటి తన డైలాగ్ చెబుతూ వుంటే - "ఆ డైలాగ్ చెప్పి ఇలా నావంక చూస్తే నేను ఇలా చూసి, నా డైలాగ్ చెప్తాను'' అన్నారు రామలింగయ్య- బొడ్డపాటితో.

పెద్దపులి దృష్టి మా మేకల మీద పడింది! ''ఏయ్ రామలింగయ్యా - ఇలారా" అని దగ్గరకి పిల్చి, "నీ కెందుకయ్యా అతడికి డైరెక్షను? నీ సంగతేదో నువ్వు చూసుకో. అసలే, అర్భకుడు-అతన్నెందుకు కన్ఫ్యూజ్ చేస్తావు?'' అని రంగారావు మందలించారు, మందహాసంతో నిలబడిన రామలింగయ్యని. ''అబ్బే ...ఏంలేదండి...అలాగే లెండి..." అని చెప్పేసి రామలింగయ్య తప్పుకున్నారు.

కొంతసేపయిన తర్వాత, మళ్లీ రిహార్సిలు జరుగుతోంది-వేరే షాటు. ఆ షాట్లో రంగారావు గారూ వున్నారు. " రంగారావు గారూ! ఒక అడుగు ముందుకేసి ఆ డైలాగ్ చెబుతే -మీతో పాటు వాళ్లు కూడా ముందుకు వస్తారు" అని చెప్పారు బాలచందర్.

"ఏం రామలింగయ్యా అర్థమైందా-నేను ముందుకి రాగానే మీరూ రావాలి" అని రంగారావు హెచ్చరిస్తే-

"అవునూ! మీరు ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకోరు గదా,మీ పనేదో మీరు చూసుకుంటారుగాని...." అని సవినయంగా రామలింగయ్య చిన్న చురక అంటిస్తే -ఆ చురకని 'చులకనగా' తీసుకుని కళ్లు మరింత పెద్దవి చేసి చిరునవ్వుతో స్వీకరించారు రంగారావు "అమ్మ రామలింగయ్యా" అంటూ.

## "తీ. తా. "

'అందాల రాముడు' అవుట్డోర్ రాజమండ్రి దగ్గరున్న దేవీపట్నం దగ్గర జరిగింది. ఆహ్లాదకరమైన ఆ వాతావరణం ఆ సంగతులూ అలా వుండగా, అందరూ కోడికూతతోనూ 'సైరన్ కూత'తోనూ లేచేవాళ్లం. ముఖాలు కడుక్కున్నాక,


'అందాలరాముడు'లో నాగభూషణం, అల్లురామలింగయ్య, ధూళిపాళ, వరప్రసాద్(నూతనప్రసాద్)

రోజూ మార్నింగ్ వాక్ పెట్టారు నాగభూషణం గారు. దాదాపు పదిమందిమి వెళ్లే వాళ్లం- రామలింగయ్యగారు తప్ప.

ఇక లాభం లేదని, నాగభూషణంగారు రామలింగయ్యగారు కూడా లేవాలని, లేచి రావాలనీ పట్టుబట్టి- ఆయన్ని లేవగొట్టి బయల్దేరించారు. ఆయన లేవడం లేటు. లేచి నడవడం అంటే బద్ధకం. రానన్నా రాలేనన్నా నాగభూషణం ఒప్పుకోరు. దానికి అల్లువారు, ఏదో ఆలోచన అల్లుకున్నారు. ఆ రోజు షూటింగులో, ఆవులిస్తూ కూచున్నారు. డల్ గా మొహం పెట్టి, ఎక్కడో వున్నట్టున్నారు. డైలాగు తొందరగా అందుకోడం లేదు. బాపుగారు "ఏంటండీ రామలింగయ్యగారూ మూడ్‌లో లేరు!" అనగానే

''కష్టం అండీ.... ఇదిగో ఈ

నాగభూషణంగారు చీకటితోనే లేవగొట్టి, వాకింగ్ చెయ్యమంటే, పరిస్థితి ఇలాగే వుంటుంది. ఐదున్నరకి లేస్తే -వాకింగ్‌లకి వెళ్లకుండా వుంటేనే -ఈ రామలింగయ్య, రామలింగయ్యలా వుంటాడు. అంచేత నన్ను లేపి, వాకింగ్ అని ప్రాణం తియ్యొద్దని నాగభూషణంగారికి చెప్పండి" అన్నారు రామలింగయ్య.

"అమ్మ రామలింగయ్యా - ఈ రూట్‌లో వచ్చావా ! పో నీకర్మ" అని వూరుకున్నారు నాగభూషణం. "అమ్మయ్య! ఇక మార్నింగులూ వాకింగులూ తప్పాయి"అనుకుంది అల్లు వారి మనసు.

అందులో ఆయన పాత్ర తీసేసిన తాశీల్దారు. అంచేత, రాజుబాబు అతన్ని అల్లరి పెట్టడానికి "తీతా " అని పిలుస్తూ వుంటాడు. ఆ పిలుపుకి 'తీతా' ఉలిక్కిపడుతూ వుంటాడు, సంగతి వీడికి తెలిసిపోయిందే అని.

ఈ 'తీతా' పిలుపు అప్పుడే పాప్యులరయి పోయింది. షూటింగులో రాజుబాబు పిలుపు



'అందాలరాముడు'లో 'తీ.తా.' గా...

విన్న ప్రేక్షకులు, రామలింగయ్య కనిపిస్తే చాలు -"తీతా" అని పిలిచేవారు. "ఓరిదేంటిబాబూ! అందరూ ఇలాగే పిలుస్తున్నారే నన్ను? ఈ పేరే ఖాయమై పోయేలా వుంది. ఈ పేరుతో, సినిమాలో రాజుబాబు పిలిస్తే ఉలిక్కి పడాలిగాని, జనం పిల్చినా ఉలిక్కిపడుతున్నానే!" అని నవ్వుతూ చెప్పేవారు రామలింగయ్య.

### పిల్లాటలు :

ఒకసారి షూటింగ్‌లో నూర్రోజుల పండక్కి రైల్లో వెళుతున్నాం. నా భార్య కూడా వుంది. సెకండ్ ఏసి. రామలింగయ్యగారు చిన్న బెడ్డింగు తెచ్చుకుని, పై బెర్తుమీద దాన్ని కూచోబెట్టి, తాను ఇంకో దగ్గర కూలబడి, కబుర్లలో పడ్డారు. నేను సరదాకి ఆయన బెడ్డింగు అక్కడనుంచి తీసేసి, ఇంకోచోట పెట్టేశాను. తర్వాత ఆయన అటూ ఇటూ తిరుగుతూ వెతుక్కోవడం కనిపించింది.

బెడ్డింగ్ దాచడం చూసిన రాధాకుమారి, రైలు పొడుగంత జాలిపడిపోయి"ఎందుకండీ పాపం ఆయన్ని తిప్పలు పెడతారు? బెడ్డింగు ఇచ్చేయండి" అంది- ఆయన వింటూ వుండగా! "ఎందుకూ- కాస్సేపు తిరగనీ, రైల్లో పనా? పాటా?... వెతుక్కోనీ" అన్నాన్నేను. ఆయన నవ్వి "ఏంటీ...వెతుక్కోనీయా? ..బలేవాడివయ్యా..." అన్నారు చూపించిన బెడ్డింగు తీసుకుంటూ కూల్‌గా.

కాస్సేపటికి నా సీటు దగ్గర నేను పెట్టిన చిన్న సూటుకేసు కనిపించలేదు" ఏమైంది ? అని అటు ఇటూ తిరుగుతూ, సీట్ల కిందా బెర్తుల మీదా వెతకడం మొదలెట్టాను. కంగారుకూడావుంది. నాకు రామలింగయ్య గారి మీద అస్సలు అనుమానం కలగలేదు.

కాని, ఆయనే నవ్వుతూ "వెతకండి... రైలంతా వెదకండి.... ఊరు వచ్చేదాకా వెతకండి..." అన్నప్పుడు గాని అది ఆయన పనేనని అర్థం కాలేదు. "బాబ్బాబు! ఇచ్చేయండి బాబూ ! అందులో నా మందులున్నాయి. వేసుకోవాలి.." అని బతిమాలుకున్న తర్వాత - తీసి ఇచ్చారు రామలింగయ్య!"

"ఇదిగో చిన్నప్పుడు మనం ఆడుకున్నామో లేదోగానీ,. ఇప్పుడీ రైల్లో పిల్లాటలు ఆడుకుంటున్నాం... లేకపోతే ఎప్పుడూ హైటెన్షన్ బతుకులే గదా" అని గొల్లున నవ్వారు అల్లు.

### నిర్మాత కామెడీ :

అల్లురామలింగయ్యకి పుల్లయ్య గారన్నా, దుక్కిపాటి మధుసూధనరావు గారన్నా వణుకు, భయం, భక్తి! ఈ ఇద్దరికీ రామలింగయ్యంటే అభిమానం. ఓ పక్క కేకలు వేస్తూనే, నెపాలు ఆరోపిస్తూనే -తమ సినిమాల్లో రామలింగయ్య వుండాలని కోరుకునేవారు.

అన్నపూర్ణా వారి షూటింగు. రామలింగయ్య వేషంలో వున్నారు. మధుసూధనరావుగారు- " ఏం రామలింగయ్యా ఎన్నాళ్ల నుంచి పనిచేస్తున్నావు మన సినిమాలో?" అని అడిగాడు. "అయ్యా -వారం రోజులయినట్టుందండీ''-వినయంగా రామలింగయ్య.

"మరి, అడ్వాన్సు తీసుకున్నావా? - లేదు. ఆఫీసు కొచ్చి డబ్బుతీసుకోవాలని తెలీదా? అదేమన్నా బ్యాంకా దాచి వుంచడానికి..." అని కేకలు మొదలు పెట్టారు.

"అంటే ..తమ దగ్గర ఎక్కడికి పోతుందని.. అవసరం వున్నప్పుడు..." నసుగుడు.

"నీ అవసరం వచ్చేవరకూ మేం నీ డబ్బు కాపాడుతూ కూచోలేం. వచ్చి తీసుకెళ్లు"

"అలాగేనండి"

ఆ మర్నాడే షూటింగు లేదని, రామలింగయ్య అన్నపూర్ణ ఆఫీసుకి వెళ్లారు. ''ఏం రామలింగయ్యా - కూచో '' అని పలకరించారు మధుసూధనరావుగారు.

"అదేనండి...డబ్బు తీసుకోమని నిన్న కేకలు వేశారు గదాని..."

మధుసూధనరావుగారు 'గఁయ్' మని లేచారు.

"ఏంటీ... డబ్బా...డబ్బుకోసం వచ్చావా.. ఏదో నిన్న అన్నానని, ఇవాళే వచ్చేయాలా?.. నా మీద అంత అపనమ్మకమా? ఐనా, డబ్బు కావాలని ఇంతవరకూ ఎవరూ మా ఆఫీసుకి రాలేదు. మేమే పంపించేస్తాం.డబ్బుకోసం వచ్చావంటే మమ్మల్ని అవమానించినట్టే కదా.."అన్నారాయన- నిలబెట్టి.

" అబ్బే..అదేం కాదండి.. మీ.... మీరన్నారు కదాని.. ఇవాళ ఖాళీగా వున్నాను కదాని..."

"హుఁ..ఇంద చెక్కు.... ఊరికే కేకలేశానయ్యా. నిన్ను ఆఫీసుకి రప్పించు కోవాలని... హుఁ హోమియో మందులు ఏమిస్తావో ఇవ్వు... నువ్వేకాదు నేనూ, చెయ్యగలను తమాషాలు..." అని నవ్వుతూ దుక్కిపాటివారంటే - గలగల నవ్వుతున్న అల్లువారు "ఇదీ కామెడీ అంటే..?" అన్నారు - ఆప్యాయతలూ అభిమానాలూ కలబోసి.

### తలగడ మంత్రం

షూటింగుకి వచ్చినప్పుడల్లా ఓ దిండు, ఓ తోలు సంచి, ఓ మందుల డబ్బా తెచ్చుకునే రామలింగయ్య -ఎవరికే చిన్న రుగ్మత వచ్చినట్టు తెలిసినా డబ్బా తెరిచి , ఓ సీసా తీసి , నాలుగు మాత్రలు చేతిలో వేసి ''పుచ్చేసుకోండి... వేసేసుకోండి హుఁ..'' అని ఇచ్చేవారు. ఏమిటో,ఎందుకో తెలుసుకోవాలసిన అవసరంలేదు, ఆయన చెప్పేవారు కాదు..."రేపు చెప్పండి ఎలా వుందో " అనేవారు.

మధ్యాహ్నం భోజనం కాగానే కాస్సేపు విశ్రాంతి కావాలి ఆయనకి. దానికోసం ఆ దిండు. లంచ్ బ్రేక్ రాగానే రామలింగయ్య గార్ని షాట్‌కి రమ్మని ఎవరూ పిలిచేవారు కాదు. దానికి ఆయన దగ్గర మంత్రం వుంది. ''ఇదిగో.. నన్ను ఓ అరగంట విశ్రాంతి తీసుకోనియ్యకపోతే, సెట్లో అంతేకథ. టేకులు టేకులు హాట్‌కేకుల్లాగా ఎగిరిపోతాయి. ఫిలిమ్ ఎంత ఖర్చవుతుందో నేను చెప్పలేను. మీకు టైము, ఫిలిమూ కలిసి రావాలంటే ఓ అరగంట రెస్టివ్వండి నాకు!".

ఇదీ మంత్రం. ఈ మంత్రానికి అందరూ కట్టుబడి - 'పోనీ పాపం' అని రెస్ట్ ఇచ్చి వేరే షాట్ పెట్టుకునేవారు. మూడు గంటలప్పుడు లేచి, టచప్ చేసుకుని -టంచన్‌గా సెట్టుకి హాజరై -" రెడీ . బస్తీమే సవాల్.... సీనేంటి డైలాగు లేంటి.. మీదే ఆలస్యం " అని తొందరపెట్టి గందరగోళం సృష్టించి -తెరమీద -తెరవెనుకా గొల్లు గొల్లున నవ్వించిన అల్లు.

ఇవాళలేరు!.... తప్పు తప్పు... ఉన్నారు... తను ధరించిన సహస్రాధిక పాత్రలతో, టీవీలద్వారా మన ఇంట్లో నిత్యం తిరుగాడుతూ నవ్వించే అల్లురామలింగయ్యలేరా... ఎవరో కిట్టని వాళ్లన్నమాట... ఆయన అమరజీవి.. కాదు... సజీవి!

# అల్లు
# మర(లోక) జీవి
# యిన విధంబెట్టిదనిన...

-డైమండ్ రత్నబాబు



అల్లురామలింగయ్య గారి ఆత్మను తీసుకువెళ్ళడానికి యిద్దరు దేవదూతలు స్వర్గం నుంచి వచ్చారు. అప్పటికే ఆయన ఆత్మను యమభటులు తీసుకువెళ్ళడం చూసి స్వర్గం నుంచి వచ్చిన ఆ దేవదూతలు షాకయ్యి ఒకరితో ఒకరు : యిదేమి అల్లు ఆత్మను స్వర్గమునకు తోడుకు రమ్మని మన ఇంద్రుల వారు చెప్పిరి కానీ యమభటులు తోడుకుపోవుచున్నారే. యిదేమి చిత్రము...!? త్వరగా మన ఇంద్రుల వారికి యీ విషయము విన్నవించవలె (అనుకుంటూ వెళ్ళారు).

(యమభటులు అల్లు ఆత్మను తీసుకుపోవుచూ మార్గ మధ్యంలో ఆగి)

యు.భ.: ఈయన గొప్పవారేమోరా.. ఈయనను చూచుటకు వేలాదిమంది జనులు వచ్చారు. మరి విచిత్రగుప్తుల వారు ఎందులకు వీరిని యమలోకానికి తీసుకురమ్మన్నారో !? ఎందుకో ఏమో .... తీసుకుపోవుట మన కర్తవ్యము కదా .....

(అనుకుంటుండగా అప్పుడే స్పృహలోకి వచ్చిన అల్లురామలింగయ్య వారిద్దర్ని చూసి విదిలించుకుంటూ)







అల్లు : ఏయ్ ఏయ్ ఎవరు మీరు?

యు.భ.: యమభటులం... నరకానికి తీసుకుపోవుచున్నాం.

అల్లు : నాన్సెన్ నన్ను నరకానికి తీసుకుపోవడమేంటి అరేయ్ నీచ్, కమీనే.. బాక్సబద్ధలైపోద్ది... వదలండ్రా వదలండి. యిదిగో మీరు వదలకపోతే కితకితలు పెట్టకుండా జోకులు చెప్పి నవ్వించేస్తా

యు.భ.: తెల్సు.. తెల్సే ముందుజాగ్రత్తగా దూదులు పట్టుకొచ్చాం.. జోకు మొదలెట్టగానే చెవుల్లో పెట్టేసుకుంటాం.

అల్లు : మీకిన్ని తెలివితేటలుఎప్పుడొచ్చాయ్‌రా?

యు.భ.: ఒకసారి భూలోకం వచ్చినప్పుడు 'యమగోల' చిత్రమును చూసితిమి.

అల్లు : కర్మరా నా కర్మ...రామారావుగారు ఆ సినిమాలో యమభటులకు తెలివితేటలు నేర్పించేశారు. ఏంచేస్తాం... పదండి మీ యమధర్మరాజునే అడుగుతాను పదండి.

యు.భ. : మిమ్మల్ని తీసుకురమ్మన్నది యమధర్మరాజుల వారు కాదు. విచిత్రగుప్తుల వారు. చిత్రగుప్తునికి వయసు మీరినదని, ఆ పదవి తనదే కావాలని తొలిసారిగా మీ ఆత్మను తీసుకొచ్చి యమధర్మరాజు గారి వద్ద మంచిపేరు పొంది తదుపరి చిత్రగుప్తుని పదవి పొందాలని అతని ప్రయత్నము.



(అల్లురామలింగయ్యగారు అర్థం కానట్టుచూసారు. అందరూ యమలోకం వైపు కదిలారు)

(యమలోక ద్వారములు తెరుచుకున్నాయి. అల్లు ఆత్మతో విరగబడి నవ్వుతూ ప్రవేశించిన యమభటుల్ని చూసి విచిత్రగుప్తుడు కోపగించుకుంటూ గట్టిగా అరిచాడు. యమభటులు ఉలిక్కి పడి చూసారు.)



విచిత్రగుప్తుడు : ఏమి ఆ నవ్వు, మిమ్మల్ని ఆయన జోకులు వినకుండా ఉండుటకు దూదులు కూడా ఇచ్చి పంపించితిమి కదా.. ఏమి ఆ ధిక్కారము. మా మాటను ధిక్కరించితిరా..

యు.భ. : మన్నించు విచిత్రగుప్త... మన్నించు. మీరు చెప్పినట్టే చెవులలో దూది పెట్టుకుంటిమి. మార్గ మధ్యమున యాక్షన్ కామెడీ అంటూ ముఖ కవళికలు మార్చి హావభావాలు ప్రదర్శించి మమ్మల్ని నవ్వించిరి.. యిందు మా తప్పిదము లేదు.

అల్లు : ఏయ్ ఎవరు నువ్వు... నన్ను ఎందుకు యమలోకానికి తెప్పించావు. ఎక్కడ యమధర్మరాజు... వేరీజ్ హీ...

విచిత్రగుప్తుడు : కంగారు పడకు. నేను విచిత్రగుప్తుడను. యమధర్మరాజుల వారు వచ్చు సమయము ఆసన్నమైనది.

(అని అంటుండగా యింతలో ధూంతత ధూంతత ధూంతతధూం ధర్మ పరిరక్షణ దక్షుండ సకల పాపముల శిక్షకుండ చండతర బాహుమండిత విగ్రహుండ యముండ అన్న బ్యాగ్రౌండ్ మ్యూజిక్ వినబడింది. యమధర్మరాజు, చిత్రగుప్తులు ప్రత్యక్షమయ్యి అల్లు రామలింగయ్యగారు అక్కడ వుండటం గమనించి ఆశ్చర్యంగా దగ్గరకి వచ్చి)

యమధర్మరాజు : మీరు అల్లు రామలింగయ్య గారు కదూ.

విచిత్రగుప్తుడు : అవును ప్రభూ... నేటితో ఈయన ఆయువు ముగిసినది.... నరకమునకు తెచ్చితిమి.

చిత్రగుప్తుడు : ఈయన వెళ్లవలసినది స్వర్గమునకు.... పాపాల చిట్టాలో అల్లుగారి పేరు లేదు. అయినను ఆయనను ఈయన యిక్కడకు ఎందుకు తెప్పించినారో అర్థమగుటలేదు. (అల్లు రామలింగయ్యా వైపు తిరిగి) మన్నించండి ఆర్యా. ఇది మా విచిత్రగుప్తుని తప్పిదము.

విచిత్రగుప్తుడు : యమధర్మరాజా, ఇందు నా తప్పిదము లేదు. ఆయన కొన్ని పాపములు చేసినారు.

అల్లు : నేనా...!?

యమధర్మరాజు : ఏమీ... ఈ హాస్యరారాజు తప్పిదములు చేసినారా...!?

విచిత్రగుప్తుడు : అవును ప్రభు.... యీయన చేసిన తప్పిదములు విన్నవించెదను.స్వాతంత్ర్య సమరయోధునిగా ఉద్యమాలలో పాల్గొనినారు ప్రభూ.

చిత్రగుప్తుడు : అది మంచి కార్యమే కదా

విచిత్రగుప్తుడు : ఆ ఒక్క కార్యముతో ఆగక యిటు హోమియోపతి వైద్యునిగానూ అటు నటుడిగానూ రెండు విధులు నిర్వర్తిస్తూ ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించారు.

అల్లు : ఏంటి నా టెంకె యిది ధర్మవిరుద్ధమా...!?

విచిత్రగుప్తుడు : అవును ధర్మవిరుద్ధమే... నటుడిగా ఉంటూ హోమియోపతి వైద్యునిగా కూడా చేయుట వల్ల కొంత మంది వైద్యుల ఉపాధికి అడ్డుపడినావు.

చిత్రగుప్తుడు : అది వాస్తవమే కానీ ఈయన స్వలాభము చూసుకోలేదు. అది పాపకార్యము కాదు. దానికి తార్కాణము రాజమండ్రిలో వీరిపేరుపై నిర్మితమైన అల్లురామలింగయ్య హోమియోపతి వైద్య కళాశాల.

విచిత్రగుప్తుడు : యమధర్మరాజా... దేవతల నీతి ప్రకారము ప్రతి ఒక్కరు ఒక్కొక్క కార్యమునే నిర్వర్తించవలెను. మీరు పాపులను శిక్షించుచుంటిరి; వరుణుడు వర్షమును, సూర్యుడు ఉష్ణమును, చంద్రుడు వెన్నెలను యిలా ప్రతి ఒక్కరూ ఒక్కొక్క కార్యమునే నిర్వర్తించుచున్నారు. కానీ, ఈయన స్వాతంత్ర్య సమరయోధునిగా, హోమియోపతి వైద్యునిగా, నాటక రంగంలోనూ, సినిమా రంగంలోనూ నటుడిగా, నిర్మాతగా యింకా ఎన్నెన్నో కార్యములు నిర్వర్తించుచున్నారు.

చిత్రగుప్తుడు : ఇవి అన్నియు సత్కార్యములే కదా. అందుకే ఈయన కీర్తి ప్రతిష్టలు ఆంధ్రదేశమంతయు వ్యాపించి జీవించి వుండగానే కాంస్య విగ్రహము ప్రతిష్టింపబడినది. పద్మశ్రీ అవార్డు దక్కినది. అంతియే గాక వీరి ముఖ్యమంత్రి ప్రతిఏటా వీరి పేరు మీద స్మారక అవార్డులు యిస్తామని ప్రకటించినారు కూడా.

అల్లు : అవునా రాజశేఖరరెడ్డి గారికి నాపై వున్న అభిమానము కడు హర్షణీయము... చీఛీ మీ భాష నాకు కూడా ఉచ్చారణలో వచ్చుచున్నది. బాబూ రాజశేఖర్‌రెడ్డీ నా థ్యాంక్స్ ఇక్కణ్ణించే అందుకో....

విచిత్రగుప్తుడు : చిత్రగుప్తా మీకు మతి భ్రమించినదా ఏమి.... మీకు నేను సహాయము చేయుచుంటిని. యమగోల చిత్రమందు మీ వేషధారణ వేసుకొని వన్ను ఊడపీకించి, కుక్కలను వెనుక లంకింపజేసి, సబ్బు ముక్కలను తినిపించి పలుయిక్కట్లకు మీ వేషమును గురిచేసారు. మరచిపోయితిరా...

చిత్రగుప్తుడు : అది కేవలం హాస్యము కొనవే. మమ్ములను అపహాస్యము చేయుటకు కాదు. ఈయన మంచితనం నీకు తెలియదు. మరణించిన వెంటనే నేత్రదానం చేసిన మానవతావాది.

యమధర్మరాజు : విచిత్రగుప్తా... చేసిన తప్పిదములకు అల్లు వారిని మన్నించమని ప్రాధేయపడి వేడుకొని వీరిని స్వర్గమునకు పంపించు...
(అల్లుతో)... బుడతా నీ హాస్య భంగిమలు బహుబాగా నచ్చినవి.

అల్లు : బుడతా ఏంటి నాటెంకె

చిత్రగుప్తుడు : వారి కంటికి నీవు బుడతడివే మానవా

యమధర్మరాజు : మరి బుడతడు కాక యింకేమి... 'మగరాయుడు' చిత్రమందు 'చికుబుకు చికుబుకు రైలే అదిరెను దీని స్టైలే' అనుచు, 'మావిచిగురు' చిత్రమునందు 'రంజు భలే రాం చిలకా, రమ్మంది ఎనకెనక' అని గానములు చేసి నృత్యభంగిమలు చేసితివి. ఇంకా... ఆఁ ...వయసు మీరినను 'కళ్యాణరాముడు' చిత్రమునందు ముసలి భామలకు పడుచువాని వలె మన్మథ బాణములు వేసితివి కదా...

అల్లు : (ఆశ్చర్యపడుతూ)అంటే ఆ సినిమాలు.....

యమధర్మరాజు : అవియేకాదు మీ తొలిచిత్రము 'పుట్టిల్లు' వద్ద నుంచి ప్రతి చిత్రమును నేను తిలకించుచుంటిని. అయ్యారే ఏమి మీ వేషధారణ... ముఖ కవళికలు... హావభావములు..!? వెయ్యి ముప్పై ఐదు చిత్రములనుకుంటాను మీరు నటించినది. పాపులను శిక్షించి మధ్యలో విశ్రాంతి కోసం మీరు నటించిన చిత్రములు చూచుచుంటిని. నేను మీ అభిమానిని.

అల్లు : నాకు చాలా సంతోషంగా వుంది. మీలో కర్కోటకుడే దాగి యున్నాడనుకున్నాను గాని మీలోనూ హాస్య ప్రియత్వం ఉన్నదన్న మాట.

యమధర్మరాజు : నేను సమవర్తిని కదా...

అల్లు : అందుకే... మీరు సినిమాలు చూస్తున్నారని తెలిస్తే...

యమధర్మరాజు : ఆఁ తెలిసిన ఏమి చేసెదవు ?

అల్లు : టికెట్ తీసుకోమని చెప్పేవాణ్ని... సమవర్తి కదా... దొంగతనముగా చూడనేల... టిక్కెట్టు తీసుకుని చూడవచ్చును కదా.

(యమధర్మరాజు బిగ్గరగా నవ్వుతుంటే విచిత్రగుప్తుడు మనసులో 'దొరికాడు' అనుకొని యమధర్మరాజుతో)

విచిత్రగుప్తుడు : చూసారా ప్రభు... మిమ్మల్ని నవ్వించిన విధముగనే తెలుగు ప్రేక్షకులను నవ్వించి, కవ్వించుచున్నారు.

చిత్రగుప్తుడు : ఇందులో పాపమేమున్నది !?

విచిత్రగుప్తుడు : ఓ సూక్ష్మమున్నది. ప్రజలు వీరి చిత్రాలు చూచి హాయిగా నవ్వుకొని ఆరోగ్యవంతులుగా అయిపోవుట వలన లక్షలు లక్షలు పోసి చదువులు చదివిన వైద్యులు, కోట్లు కోట్లు ఖర్చుపెట్టి కట్టించిన చికిత్సాలయములు ఖాళీగా ఉంటున్నవి. యీ విధముగా వైద్యుల జీవనోపాధికి గండి కొట్టుచూ, వారి జేబులకు చిల్లు పెట్టుచున్నాడు. అందుకే బ్రహ్మ ఈయనకు మరణము ప్రసాదించినాడు.

చిత్రగుప్తుడు : విచిత్రగుప్తా.... నీకు విషయ విశ్లేషణ బహు తక్కువ. ఈయన విషయంలో పొరపాటు పడినావు. బ్రహ్మ ప్రతివానికీ జనన మరణములు లిఖించినాడు... కానీ, ఈయనకు పుట్టుక వున్నది కానీ మరణము లేదు. ఈయన కీర్తికి మృత్యువు దరి చేరదు. హాస్యమున్నంత కాలమూ యీయన మనగలరు. అందుకే అనేక తర్జనభర్జనలు చేసి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కలిసి ఆలోచించి యింతకాలము మానవులకే అందిన హాస్యము దేవతలకును అందవలెననే తలంపుతో

యాయనకు మృత్యువును కల్పించి స్వర్గమునకు రప్పించుకొంటిరి. యీ విషయము తెలియక నీవు చాలా తప్పు చేసావు.

(విచిత్రగుప్తుడు పశ్చాత్తాపంతో బాధపడుతూ కన్నీళ్ళను తుడుచుకుంటూ అల్లు దగ్గరగా వెళ్ళి నమస్కారం చేస్తూ...)

విచిత్రగుప్తుడు : అల్లు ఆర్య.... నన్ను క్షమించండి.

అల్లు : నా మనవడు అర్జున్ నటించిన 'ఆర్య' చిత్రం పేరుతో నాపేరు కలిపి పిలిచినందుకు నిన్ను క్షమించేశాను... పో...

(ఇంతలో ఇంద్రుడు దేవదూతలతో అక్కడికి వస్తాడు.)

యమధర్మరాజు : ఏమి యీ విశేషము ఎన్నడునూ లేదు స్వర్గాధిపతి ఇంద్రుడు నరకమునకు రావటమా. యీ ఘట్టము సువర్ణాక్షరములతో లిఖింపదగ్గ విషయము ధన్యుడను ఇంద్రా ధన్యుడను.

ఇంద్రుడు : నీవూ, నేనూ కూడా ధన్యులమే యమధర్మరాజా... నేను వచ్చినది ఈయనను స్వయముగా స్వర్గమునకు తీసుకుపోవుటకు. రామలింగయ్య గారూ... వెళదాం వస్తారా?

అల్లు : ఎందుకు రానయ్యా మా అల్లుడు మెగాస్టార్ యాక్ట్ చేసిన 'ఇంద్ర' సినిమాకు నీపేరే పెట్టుకున్నాం కదా...

ఇంద్ర : అంతేకాదు అల్లు గారూ... ఆ చిత్రమును తిలకించిన పిదప నేను కూడా నా సింహాసనమందు మీ అల్లుని వలెనే కూర్చునుట సాధన చేసితిని.

అల్లు : అయితే ఇంకేం... ఇంక నీ సీటుకు ఢోకాలేదు... హ్యాపీగా ఉండు.

ఇంద్రుడు : పదండి రామలింగయ్య గారూ...

(అంటూ స్వర్గానికి తోడ్కొని పోవుతుండగా యమధర్మరాజు, చిత్రగుప్తుడు, విచిత్రగుప్తుడు చేతులు జోడించి హాస్య నట చక్రవర్తికి జోహార్లు అర్పిస్తుండగా అల్లురామలింగయ్య గారి ఆత్మ స్వర్గానికి దారి తీసింది.)

■




రాంభట్ల నృసింహశర్మ కవి, పండితుడు, 'పన్'డితుడు, సభా వ్యాఖ్యాత. ఆలిండియో రేడియోలో అనౌన్సర్ ఉద్యోగం ద్వారా తన వాగ్బలంతో, తెలుగు, సంస్కృత భాషలపై తనకున్న పట్టుతో, వచోచమత్కారంతో ముఖ్యంగా హాస్యప్రియత్వంతో శ్రోతలకు ఆప్తుడయ్యారు. పలు శ్రవ్యనాటికలను వ్రాసి, నిర్వహించి నవ్వులు పంచారు. 'స్వరపుష్కరం' (అంటే -రేడియో ఉద్యోగంలో చేరి 12 ఏళ్ల గడిచిన) సందర్భంగా వాటిలో 9 నాటికలను కూర్చి వెలువరించిన పుస్తకం ఇది. అన్నిటిల్లోనూ సామాన్య అంశం (థీమ్) పండుగల గురించి కాబట్టి, నాటకాలలో 'పన్' ఎక్కువగా ఉంది కాబట్టి పుస్తకానికి ఆ టైటిల్!

మాటవిరుపు వల్ల సాధించే హాస్యం 'పన్'! అంగికమైన హావభావాలు చూడడానికి అవకాశం లేని శ్రవ్యనాటికలలో పడవలసినది, పండవలసినది- మాటకు మాట! అవి ఎంత బాగా కుదిరాయో ఉదాహరణగా చూపడానికి భార్యాభర్తల మధ్య జరిగే కొన్ని సంభాషణలు-

* భార్య- 'ఏమండీ'
  భర్త - 'ఊఁ... చెప్పు'
  భార్య - 'అది కాదండి !'
  భర్త - 'పోనీ.... బూటు..'
* భార్య - 'మళ్ళీ పేపరు పట్టుకున్నారూ.... అసలీ పేపరు మానిపించేస్తే సరి - సగం శని విరగడవుతుంది'
  భర్త - 'మిగతా సగం నేనా' !
  భార్య - 'అని పైకి అన్నానా'!
* భార్య - 'నాకు మందాకిని పేరెందుకు పెట్టారో తెలుసా?'
  భర్త - 'మరీ శాకినీ, ఢాకినీ అంటే బావుండదని'...
  భార్య - 'నా మొహం....'
  భర్త - 'అవును ..అది చూసే అలా అనలేక యిలా అనుంటారు'
* భార్య - మా నాన్న నాకు 'గంగాభవాని' అని పేరు పెట్టారు. ప్చ్... నేను 'గం.భా.స.' అంత దాన్ని కావాలని కాబోలు మా వెర్రినాన్న పిచ్చి ఊహ...
  భర్త - 'హెవీస్ట్రాంగ్ ఎలక్ట్రిక్‌పోల్ లాంటి మొగుణ్ణి ...నన్ను.. ఎదురుగా పెట్టుకుని....నువ్వు గంగాభాగీరథీ సమానురాలై పోతానంటావా?'
* భార్య - 'కాఫీలో పురుగులమందు కలిపి ఒక్క గుటకవేసి గుటుక్కు మంటాను'
  భర్త - 'చావాల్సిన పురుగులే ఆ మందు తిని చావకుండా చేవదేరిపోతుంటే, నాగలిదుంప లాంటి నారీమణీని, నిన్నదేం చేస్తుంది!'
* భార్య - 'చెట్టుమీద ఆ మామిడికాయ..ఎంత కాయ వుంటుందేమిటి?'
  భర్త - 'ఎంత? నా తలకాయంతా.'
  భార్య - 'అదేమిటండీ అలా అంటారు! మరీ అంత చిన్నదా అది....?
* భర్త . - 'కొబ్బరిడిప్పలతో చేసే కొక్కిరాయి ప్రయోగాలంటావా! ఇవి ఫలిస్తే... నీముక్కుకి రవ్వల ముక్కెర చేయిద్దామను కుంటున్నాను'
  భార్య - 'ముక్కెర కాదు, ఈ ముదనష్టపు కంపు భరించలేక ముక్కెర్రగా అయిపోతోంది'
* భార్య - 'అదిగో, ప్రతిదానికి మధ్యన నేనొకర్తిని దొరికేను మీకు'
  భర్త - 'దొరక్క నువ్వెక్కడికి పోతావు... దొరకనిదెల్లా అదిగో కలుగులో దాక్కొన్న ఎలుకే..



120 పేజీలు,
వెల రూ॥ 50/-
ప్రతులకు
రచయిత
ఫోన్:0891-2717164/ 2715434/ 2560280

* భార్య- టీవిలో 'నాకు వీడు నీకెవరు?' అనే ప్రోగ్రామండి. అది - ప్రేమించిన ప్రియుణ్ణి కాక, వేరేవాళ్లని పెళ్లి చేసుకోవాల్సివచ్చిన ఒకనాటి ఆడస్నేహితురాళ్ల కార్యక్రమం - వెరీ యింటరెస్టింగ్'
  భర్త - 'ఇంటరెస్టింగ్ కాదే! ఇంట రెస్టు ఎక్కువై పోయి ఇలాంటి ముదనష్టపు కాలక్షేపం'
* భార్య - 'హోల్ సేల్‌గా కొన్నాడా నాన్న?'
  భర్త - 'మీ నాన్నా! హు, హోల్ మొత్తం సేల్‌కి హోల్ వేయబోయాడు'

శర్మగారి ఉపమానాలు భలేతమాషాగా ఉన్నాయి-

* కాకరాకులు నమిలిన మేకలా ఒకటేఅరుపులు
* కుళ్లగుమ్మడిపండులా కూలబడిపోయాను
* కాకనూనెలో వేగిన కరివేపాకు మొహాలూ మీరూనూ
* పొయ్యిపక్కనే ఆకుమడి..వున్నవూళ్లోనే ఉద్యోగం
* నిన్న జాయినైన నిచ్చెమల్లెమొగ్గలాటివాడివి
* గంబోరా సోకిన వుంజులాగ ఓ తెగ గింజుకుంటున్నావ్
* పిల్లిపీకిన పీనుగలాంటి ఈ బస్తాను చూడు
* గుమ్మంలో పెట్టిన కుమ్మొంకాయలా అయిపోయావ్!

- (వచ్చేసంచికలో మరికొన్ని)

- ఎమ్బీయస్ ప్రసాద్

# నేనూ నా పాటలు

50 సంవత్సరాల నట జీవితాన్ని పూర్తి చేసుకున్న స్వర్ణోత్సవ నటి జమున 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా అందిస్తున్న జ్ఞాపకాల ధారావాహిక

11



- శ్రీమతి జమునా రమణారావు

'మిలన్' షూటింగ్ టైంలో వర్క్ అయిపోతూనే సాయంత్రం షటిల్‌కాక్ ఆడుకునేవాళ్ళం. నూతన్ మాత్రం బయటకు వచ్చేది కాదు. పుస్తకాలతోనే కూర్చొనేది. ప్రాణ్, శశికళ...మేమంతా సరదాగా షటిల్ ఆడుకునే వాళ్లం. షూటింగ్ అయిపోయే టైంకి హోలీ వచ్చింది. నార్త్ వాళ్లు కదా. ముఖ్యంగా ఆనంద్‌బాబు, సునీల్‌దత్... 'యార్... యార్'అనుకునేంత ఫ్రెండ్స్. అంతా సీసాల్లో రంగునీళ్లు కలుపుకుని లాంచీ ఎక్కారు. రోజంతా షూటింగ్ అయిపోయింది. సాయంత్రం డెక్ మీద కబుర్లుచెప్పుకుంటూ కూర్చున్నాం. ఆదుర్తి సుబ్బారావు గారు, వాళ్లంతా ఒక చోట కూర్చున్నారు. నేను ఒక చోట కూర్చుని ఆ పరిసరాలను చూస్తూ చక్కగా ఎంజాయ్ చేస్తున్నాను. ఈ లోపల అక్కడ సరదాగా ఏం అనుకున్నారో ఏమో తెలీదు.. ఒక అసిస్టెంట్ అబ్బాయి గబగబా రెండు చెప్పులు తీసుకెళ్లి గోదారిలో పడేశాడు. తర్వాత మరెవరో.. 'నా చెప్పులు వేస్తావా...నీ చెప్పులు ఎక్కడ' అని అతని చెప్పులు పీకి విసిరేశారు. మొత్తం అందరూ చెప్పులు గోదారిలో విసురు కోవడం.... తర్వాత సుబ్బారావు గారో ఎవరో కంట్రోల్ చేశారు.

ఆ తర్వాత ఇక హోలీ. ఇదంతా ప్రయాణంలోనే.... బాటిల్స్‌లో తెచ్చుకున్న రంగునీళ్లు కొట్టుకుంటున్నారు. ఆనంద్‌బాబు మీద పోయాలని సునీల్‌దత్ పెద్ద సీసా తీసుకొచ్చాడు. ఆ డెక్ మీదే ఆనందబాబు వెంట పరుగెత్తాడు. ఆనంద్‌బాబు గబుక్కున గోదారిలో దూకేశాడు.

దూకి పాంటు,చొక్కాతో ఈదుకుంటూ వెళ్లిపోతున్నాడు. సునీల్‌దత్ కూడా ఓ చేత్తో రంగునీళ్ల సీసా పట్టుకుని...ఆనంద్‌బాబు మీద కొట్టడానికి ఆయన వెనకాల దూకేశాడు. అతను బాగానే ఈదుతున్నాడు.. ఇతనూ బాగానే ఈదుతున్నాడు. కొంత దూరం వెళ్లేసరికి ఆనంద్‌బాబుకు దమ్ము చాలలేదు. ఫస్ట్ మేమంతా కూడా తమాషా జరుగుతూందని చూస్తూ ఊరుకున్నాం. తీరా చూసేటప్పటికి అతను దమ్ము తీసుకోలేక రెండు మూడు మునకలు వేసి చేయిఊపుతున్నాడు. లైఫ్



సేవర్స్ ఉంటారు కదా ...(వాళ్లు ఎప్పుడూ కూడా ఉండేవారు.) వాళ్లు కనిపెట్టారు..'సార్ ఆయన మునిగిపోతున్నాడు..' అంటే 'దూకు దూకు' అన్నాం. వెంటనే లాంచీ ఆయన దగ్గరగా తీసుకెళ్లి టైర్ పడేశారు. గజ ఈతగాళ్లు కదా...వాళ్లు బాగా స్పీడ్‌గా టైర్ ఆయన దగ్గరకు తీసుకెళ్లటం... అతను ఓపిక తెచ్చుకుని టైర్ పట్టుకోవటం... వీళ్లు ఎలాగో ఆయనని సేవ్ చేయటం జరిగింది. లేకపోతే ఆనంద్‌బాబు మునిగిపోయేవాడు. అప్పుడు సునీల్‌దత్‌కు జ్ఞానోదయం అయింది. అప్పటిదాకా ఆయనకు తెలీదు. సునీల్‌దత్ మంచి ఈతగాడు. ఆరోగ్యంగా ఉంటాడు. ఈయనేమో అర్భకుడు. మొదట్నుంచీ బక్కగా ఉంటేవాడు. అంత దూరం ఎలా ఈదుతాడు. అందులోనూ నడి గోదారిలో.

ఇక నాకైతే గజగజ వొణుకు వచ్చేసింది... ఇన్ని రోజుల్నుంచీ గోదారితల్లి కాపాడింది. ఎందుకు వీళ్లు అలా చెప్పులు వేశారు అని అనిపించింది. అసలు మన పూర్వీకులు నదుల్ని ఎందుకు పూజించారు... ఇవన్నీను జీవనదులు! వీటికి పుష్కరాలనీ, పూజా పునస్కారాలనీ.. ఎందుకు చేస్తాం. మనం హిందువులం కాబట్టి... ఆ పవర్ తెలుసు కాబట్టి...!! పవిత్రమైన ఆ గోదావరి తల్లి మీద చెప్పులు వేశారు. చెప్పులు పడ్డ మరు నిమిషంలో ఇది జరిగింది.

సరే అందరూ బయటకు వచ్చేశారు. నాకు మాత్రం రాత్రంతా నిద్దర పట్టలేదు. నెక్స్ట్ డే సుబ్బారావు గారికి, ఆనందబాబుకు చెప్పాను. "బాబూ పొరపాటు చేశారు...ఇది మహానది.. జీవనది.. మనం ఇన్నాళ్లనుంచీ... ఇన్ని

షూటింగ్‌లు చేశాం...ఎవరికైనా చిన్న ఆపద జరిగిందా ? ఇలా ఆ తల్లి మనకి కో ఆపరేట్ చేస్తే... మనం సరదాగా కూడా అలా చెప్పులు విసిరేయ కూడదు. నాకు అనుమానంగా ఉంది... ఇదంతా చెప్పుల ఎఫెక్టే. రోజా తెల్లవారే సరికి కొబ్బరి కాయలు, పూలు, కర్పూరం, పళ్ల అన్నీ రెడీగా పెట్టి ఉంచండి. ఇక ఉన్నన్ని రోజులూ గోదావరికి పూజ చేయకుండా నేను బోటు ఎక్కను" అని చెప్పాను.

ఆ రోజునుండీ నాకంటే ముందు కొబ్బరికాయ, పళ్లు, కర్పూరం, పూలు...అన్నీ రెడీగా ఉండేవి. ఆనంద్‌బాబుకు ఒకసారి చెబితే చాలు అన్నీ రెడీగా ఉంచుతాడు. 'అవును మేడం గారూ... మీరు చెప్పింది నిజమేనండీ... నాకు కూడా ఆ థాట్ రాలేదు.. వీక్ అయిపోయి ఈదలేకపోయాను. కరెంట్ ఎక్కువ ఉంది... అక్కడ సుడిలాగా లాగుతూ ఉంది. అందుకని బయటకు రాలేకపోయాను" అని ఆనంద్‌బాబు చెప్పాడు. నెక్ట్స్ డే నుంచీ అందరి తరపునా ఓ నమస్కారం పెట్టి 'తల్లీ ....గోదారమ్మా మమ్మల్ని క్షమించు. తెలియక పొరపాటు చేశాం...మమ్మల్ని కాపాడమ్మా' అని కొబ్బరికాయ కొట్టి...పూలు నదిలో వేసేసి, హారతిచ్చి అప్పుడు ఎక్కేదాన్ని. నమ్మకం లేని వాళ్లు ఉంటారు కదా..వాళ్లు 'అబ్బా ఈవిడకో ఛాదస్తం' అనే వాళ్లు. 'చాదస్తం కాదు నిన్న చూసారు కదా ... ఇంకా చాదస్తం అంటారేమిటి..' అన్నాను. అదొక భయంకరమైన సిట్యుయేషన్.

గోదావరి అంటే నాకు మరో సంఘటన గుర్తుకొస్తుంది. అది సినిమాకు సంబంధించినది కాకపోయినా...! 1996లో మా అమ్మాయిని పెట్టి 'డాక్టర్ మమత' అని టి.వి.సీరియల్ తీశాను. 13 భాగాలు. అందులో కూడా గోదావరి ఏజెన్సీ ప్రాంతాలు.. కూనవరం వెళ్లి.. అక్కడ ఈ డాక్టర్ వాళ్లకు చదువుచెప్పి.. ట్రీట్‌మెంట్ ఇచ్చి వాళ్లలో చైతన్యం తెస్తుంది. అందుకోసం మేం అవేర్ సంస్థ నుంచి సహకారం తీసుకుని కూనవరం వెళ్లాం. అక్కడ ఓ 50 మంది రియల్ ట్రైబల్స్‌నే తీసుకుని రోజా కూనవరం, గోదావరి... మరో నది సంగమం వస్తుంది. అక్కడ నుండి 15 మైళ్లు వెళ్లిన తరువాత పాపికొండల జంక్షన్ వస్తుంది. బాగా ఇరుకు అవుతూ ఉంటుంది. అక్కడ దాకా లాంచీలో షూటింగ్‌కి వెళ్లేవాళ్లం.

నాకు మొదటి రోజు లాంచీ ఎక్కుతుండగానే 'మిలన్' సంఘటన గుర్తుకు వచ్చింది. ఒకసారి చేదు అనుభవం అయ్యింది మనకు అని చెప్పి ప్రతి రోజూ లాంచీ ఎక్కడానికి ముందు గోదావరికి కొబ్బరికాయ కొట్టి, పసుపు, కుంకుమ వదిలి.... అప్పుడు 50, 60 మందితో లాంచీ ఎక్కేవాళ్లం. ఇహ అక్కడనుండి కెమెరా పెట్టుకుని ఎక్కడ అందమైన దృశ్యాలు కనబడితే అక్కడ లంగరు వేసి షూటింగ్ చేసేవాళ్లం. 40 ఏళ్ల క్రిందట ఎట్లా ఉంది అని చూపించటం కోసం ఓ రోజున నాటు బోటులో ఈ కళాకారులని కూర్చోపెట్టి... లాంచీకి తాడు వేసి కట్టాం. ఫొటోగ్రాఫర్ మీర్ 'తాడు కనిపిస్తోంది... వద్దు' అని చెబితే ఆ తాడు తీసేసి వాళ్లను నాటుబోటులో వదిలేసాం. సరే బోటు నడిపేది ఓ చిన్న పిల్లాడు. షూటింగ్ స్మూత్‌గా అయిపోయింది. అందరూ లాంచీలోకి వచ్చారు. సాయంత్రం మేం కూనవరం వచ్చిన తరువాత అక్కడి స్థానికులు చెప్పారు... 'మీరు చాలా రిస్క్ తీసు కున్నారండి. అక్కడ ఉండేవన్నీ సుడిగుండాలే.... మిమ్మల్ని ఆ గోదావరి తల్లే కాపాడింది' అన్నారు. వాళ్లు చెప్పిన తరువాత గుండె దడదడా కొట్టుకుంది. నిజమే కదా. లాంచీ వెళ్తూ ఉండగా వచ్చే అలలు పడవను వెనక్కి తోస్తున్నాయి. పైగా నాటు బోటు. నడిపేది చిన్నపిల్లాడు. ఏదైనా అటూ ఇటూ అయితే మునిగిపోవటమే. అంతా సుడిగుండాలే. ఆ మహాతల్లికి రోజూ పూజ చేయటం వల్ల మమ్మల్ని కాపాడిందని నాకు అనిపించింది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే... నీటికున్నటు వంటి పవర్ అలాంటిది. నదుల్లో ఉండే పవిత్రతను మనం పూజించాలి.

# నేనూ నా పాటలు



రచన : కొసరాజు — గానం : ఘంటసాల, సుశీల, బృందం

గోపి : గౌరమ్మా, నీ మొగుడెవరమ్మా?<br>
ఎవరమ్మా, వాడెవరమ్మా? ॥గౌరమ్మా॥<br>
గౌరి : శెప్పాలంటే సిగ్గుకదయ్యా<br>
గోపి : ఆఁ<br>
గౌరి : ఆనవాళ్లు నే సెబుతానయ్యా<br>
మగకోరస్ : సెప్పు - సెప్పూ<br>
గౌరి : సిగలో నెలవంక మెడలో నాగరాజు<br>
ఆ రేడు నావాడు సరిరారు వేరెవరు<br>
మామయ్యా, నా మొగుడెవరయ్యా? వేరెవరయ్యా?<br>
ఆడకోరస్ : మామయ్యా నా మొగుడెవరయ్యా?<br>
గోపి : ఇల్లూ వాకిలి లేనివాడు - లే... నీ... వా... డు....<br>
మ. కో : లేనివాడు<br>
గోపి : బిచ్చమెత్తుకుని తిరిగేవాడు - మాదాకోళం<br>
మ.కో. : ఇల్లు వాకిలి లేనివాడు - బిచ్చమెత్తుకుని తిరిగేవాడు<br>
గోపి : ఎగుడూ దిగుడు కన్నులవాడు జంగందేవర నీవాడా ॥గౌరమ్మా॥<br>
గౌరి : ఆకాశమే ఇల్లు - లోకమే వాకిలీ<br>
ఆ.కో : అవును<br>
గౌరి : బిచ్చమడిగేది భక్తి, బదులు ఇచ్చేది ముక్తి<br>
ఆ.కో: బిచ్చమడిగేది భక్తి, బదులు ఇచ్చేది ముక్తి<br>
గౌరి : బేసికన్నులే లేకుంటేను, బెంబేలెత్తును ముల్లోకాలు<br>
మామయ్యా నా మొగుడెవరయ్యా? ఎవరయ్యా? వేరెవరయ్యా?<br>
ఆ : కో: మామయ్యా నా మొగుడెవరయ్యా?<br>
గోపి : మొగుడు మొగుడని మురిశావే - కులికావే, పొంగిడావే - పిల్లోయ్:<br>
నెత్తిన ఎవరినో ఎత్తుకుని, నిత్తెం దానినే కొలుసునట<br>
అదియే ఆతని ఆలియట, కోతలు ఎందుకు కోస్తావే?<br>
మొ.కో.: కోతలు ఎందుకు కో..స్తా..వే..?<br>
గోపి : గౌరమ్మా, నీ మొగుడెవరమ్మా? ఎవరమ్మా, వాడెవరమ్మా?<br>
గౌరి : ఎవరో పిలిస్తే వచ్చింది, ఎవరి కోసమో పోతోంది,<br>
మయాన్న మజిలీయేసింది<br>
ఆ.కో: మయాన్న మజిలీయేసింది<br>
గౌరి : సగం దేహమై నేనుంటే, అది పెళ్ళామంటే సెల్లదులే<br>
పళ్లు పదారు రాలునులే<br>
ఆ.కో: పళ్లు పదారు రాలునులే<br>
గౌరి : మామయ్యో, నా మొగుడెవరయ్యా? ఎవరయ్యా? వేరెవరయ్యా?<br>
ఆ.కో : మామయ్యా, నా మొగుడెవరయ్యా?







నేనూ నా పాటలు

ఇక 'మిలన్' విషయం వచ్చినప్పుడు తెలుగు 'మూగ మనసులు' గురించి చెప్పుకోవాలి. 'మూగమనసులు'లో అన్ని పాటలూ అద్భుతం. ప్రతి పాటా ఓ అమృత గుళిక. ప్రతి పాటలోనూ నేటివిటీ ఉంది. ఈ పాటల గురించి వచ్చే సంచికలో చెప్పుకుందాం.

'మూగమనసులు' అనగానే మనకు గుర్తొచ్చేది ఇటీవల మరణించిన అల్లు రామలింగయ్య గారు. రామలింగయ్యగార్ని, నన్నూ 1952లో 'పుట్టిల్లు' చిత్రం ద్వారా రాజారావు గారు పరిచయం చేయటం... పైగా మేమందరం ఒకే స్ట్రీట్‌లో ఉండటం వల్ల ఒక కుటుంబ సభ్యులుగా ఉండేవాళ్లం. ఆయన నాకు చాలా పెద్ద వెల్ విషర్. 'దొంగ రాముడు' షూటింగ్ ముందు ఆయన నా గురించి ఎంత తపన పడ్డారంటే...

షూటింగ్ మొదలు పెట్టబోతున్నారు. కె.వి.రెడ్డి గారు దర్శకులు. చెల్లెలుగా జమున అయితే బాగుంటుందని నా పేరు వచ్చింది. రామలింగయ్య గారు నాగేశ్వరరావు గారికి మిత్రులు. పాండీ బజార్ లో కబుర్లు అన్నీ పట్టుకొచ్చి మా నాన్నగారికి చెప్తుండేవారు. "శ్రీనివాసరావు గారూ! అమ్మాయికి మంచి అద్భుతమైన ఛాన్స్. కె.వి.రెడ్డి గారి డైరెక్షన్‌లో. అన్నపూర్ణ చాలా చక్కటి సంస్థ. అమ్మాయిని అనుకుంటున్నారు" అని చెప్పారు. "మేం చాలా సంతోషమండి" అన్నాం. వేం కూడా వాళ్లు వస్తారనే అనుకున్నాం. ఈ లోగా అక్కడ టాక్ ఏంటంటే "ఏమయ్యా... శ్రీనివాసరావు ఏంటి... వచ్చి కనిపించవచ్చుకదా... వాళ్లకు ఎందుకంత అహంకారం... కె.వి.రెడ్డి గారి డైరెక్షన్... అమ్మాయి పేరు అనుకుంటున్నాం... వాళ్లు రారా ఎవరి దగ్గరకీ... వేషాలు అడగరా ...' అని చెప్పి అల్లు రామలింగయ్య గారి ముందు అనటం... దాంతో ఆయన కంగారు పడిపోయి.. మా నాన్నగారి దగ్గరకు వచ్చి "శ్రీనివాసరావు గారూ ఆ వేషం అమ్మాయికి గ్యారంటీ అండి. అయినా వాళ్లు పెద్ద వాళ్లు కదా. పెద్ద కంపెనీ కదా. ఒకసారి వెళ్లి 'సార్ ఆ వేషంకి అమ్మాయిని అనుకుంటున్నారంట. ఆ వేషం ఇవ్వండి' అనడగండి .... మీరు అడగక్కర్లేదు, ఒక్కసారి అక్కడకు వెళ్లి కనబడితే చాలు. అమ్మాయికి ఆ వేషం ఇచ్చేస్తారు" అని చాలా తపనపడిపోయేవారు. ఇక మా నాన్నగారికి ఆత్మాభిమానం. 'పుట్టిల్లు' నుండి ఎప్పుడూ వేషాలు కోసం ఆఫీసుల చుట్టూ తిరగలేదు. మొదట్నుంచీ కథానాయికగానే అవకాశాలు వచ్చాయి. అంచేత 'ఎందుకండీ ఆఫీసుల చుట్టూ తిరగడం ఒకవేళ పొరపాటున 'వేషం లేదండీ..' అంటే చిన్నబుచ్చుకోవడం. అసహ్యంగా ఉంటుంది. నిజంగా ఆ వేషానికి అమ్మాయి పనికి వస్తుందనుకుంటే వాళ్లే కబురు చేస్తారు... అప్పుడు వెళదాం. అది మనకీ గౌరవంగా ఉంటుంది' అనేవారు.

ఇంతలో ఓ పుకారు... శ్రీరంజని గారిని బుక్ చేస్తున్నారని ! ఇక అల్లు రామలింగయ్య గారు పరుగెత్తుకొచ్చారు. ఆయనకు మా కుటుంబంతోనూ, మాతోనూ బాగా చనువు. అందుకే "శ్రీనివాసరావుగారూ.... అమ్మాయి భవిష్యత్తు మీరు పాడుచేస్తున్నారు. ఇంకేముంది అయిపోయింది. 'మీరు వెళ్లండి... నా మాట వినండి...' అంటే వినలేదు. ఆ వేషానికి శ్రీరంజనిని బుక్ చేయబోతున్నారు" అని తెగ గాభరా పడిపోయారు. మా నాన్నగారు 'పోనీలెండి రామలింగయ్య గారూ.. ఎవరికి ఎంత ప్రాప్తముంటే అంతే వస్తుంది. మనకు ప్రాప్తం లేదనుకుందాం. మీరు బాధపడవద్దు. అమ్మాయి తప్పకుండా పైకి వస్తుంది. ఆ టాలెంట్ ఉంది. అదృష్టం ఉంది..' అని అన్నారు.

అలా రామలింగయ్య గారు సినిమా రంగంలో మాకున్న శ్రేయాభిలాషులలో ముఖ్యమైనవారు. ఆయనతో కలిసి చాలా సినిమాల్లో నటించాను. ఓ గొప్ప మహానటుడాయన. 'మూగ మనసులు' లో రామలింగయ్య గారిని నేను కొట్టడం, కొట్టిన తరువాత ఆయన తన భార్యతో కోతలు కోస్తూ ఉంటే మళ్లీ నేను రావటం.... 'ఈ దెబ్బలేంటి కమ్చీతో కొట్టినట్టున్నాయ్' అని నేనడిగితే 'తిమింగలం తోకతో కొట్టింద'ని ఆయన అనటం... నన్ను చూడగానే నత్తి నత్తిగా మాట్లాడుతూ.. 'ఒసే నీకు దండం పెడతానే.. మా ఆవిడకు చెప్పకే.. నన్ను చంపేస్తుంది.. రాత్రికి కూడుండద'ని చెప్పటం... నాకు చాలా బాగా నచ్చిన సీన్ అది. హాస్య పాత్రలే కాకుండా ఆయన అనేక వేషాలు వేశారు. విలన్ వేషాలు... కొన్ని చిత్రాల్లో ఆయన నిజంగా ఏడిపించారు. సామాన్యంగా ఏంటంటే - కమెడియన్ ఎవరన్నా ఏడిస్తే మనకు నవ్వొస్తుంది. అలాంటిది రామలింగయ్య గారు ఓ సీన్‌లో ఏడిపించారు. అటువంటి గొప్ప నటుడాయన.

'మూగ మనసులు'లో 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా' పాటలో నేనూ, నాగేశ్వరరావు గారూ డ్యాన్స్ చేస్తుంటే అల్లు











'మూగ మనసులు' లో అల్లురామలింగయ్య గారితో నటించిన సన్నివేశాలలో శ్రీమతి జమునకు ఇష్టమైన సన్నివేశమిది

రామలింగయ్య గారు సన్నాయి వాయిస్తూ, డప్పు కొడుతూ కనిపిస్తారు.

ఆయన కేవలం నటుడే కాకుండా, నిండైన జీవితం అనుభవించారు. చిరంజీవి లాంటి గ్రేట్ ఫిలింస్టార్ అల్లుడు... అల్లు అరవింద్‌లాంటి పెద్ద ప్రొడ్యూసర్ కొడుకు. మనవడు అర్జున్ కూడా మంచి హీరోగా వచ్చాడు. పిల్లల భవిష్యత్తు చక్కగా తీర్చిదిద్దుకున్న మహోన్నత వ్యక్తి. అంతే కాకుండా ఆయన ఎంత గుండె నిబ్బరమైన మనిషి అంటే - ఓసారి ఏదో ఫండ్ రైజింగ్ కోసం రామారావుగారూ, నాగేశ్వరరావు గారూ అంతా తిరిగాం. అప్పుడు విశాఖపట్నం వెళ్లాం. అక్కడ జనం అంతా గుంపులు గుంపులుగా ఉన్నారు. మాకు ట్రెయిన్‌లోనే తెలిసిపోయింది. రామలింగయ్య గారి అబ్బాయి ఆ ట్రైన్ యాక్సిడెంట్‌లో పోయారని. ఆయనకు ఎలా చెప్పాలా అని చాలా సతమతమయ్యి... ఆయనకు అక్కడ చెప్పకుండా అందరం బస్ ఎక్కి హోటల్‌కు వెళ్లిన తరువాత రామారావు గారు చెప్పారో, పుండరీ కాక్షయ్య గారు చెప్పారో చెప్పిన తరువాత ఫస్ట్ షాక్ అయిపోయారాయన. కానీ ఆయన కమిట్‌మెంట్ ఎలాంటిదంటే కొవ్వొత్తి తాను కరిగిపోతూ వెలుగును చూపించినట్టుగా తను అంత బాధలో ఉండి కూడా జనం డిసప్పాయింట్ అవుతారు అని చెప్పి స్టేజ్‌మీద కనిపించి... వాళ్లను నవ్వించి వెళ్లిపోతాను అన్నారు. అటువంటి గొప్ప కమిట్‌మెంట్ ఉన్న... మహోన్నతమైన వ్యక్తి. వృత్తి పట్ల అంత అంకిత భావం ఆయనకు.

హోమియో వైద్యునిగా కూడా ఆయన అందరికీ పరిచయమే. ఆ మధ్య నాకు కీళ్ల నొప్పులువచ్చి నాగేశ్వరరావు గారికి ఫోన్ చేస్తే... 'రామలింగయ్య మంచి వైద్యం చేస్తాడమ్మాయ్... వెళ్లు' అని సలహా ఇచ్చారు. వెళ్లాను. కాళ్ల మడమల దగ్గర చిన్న నొప్పి. నిజంగా ఒకటే డోస్‌తో తగ్గిపోయింది.

ఎప్పుడన్నా నేను మద్రాస్ వెళితే... మా ముందు తరం తారలు భానుమతి గారు, ఎస్.వరలక్ష్మిగారు, జి.వరలక్ష్మిగారుతో పాటు అల్లు రామలింగయ్య గారిని కూడా కలుసుకోవటం నాకు అలవాటు. ఓసారి అలా నేను వెళ్లినప్పుడు రామలింగయ్య గారు అక్కడే ఉన్నారు. అప్పటికి ఇంకా ఆయన హైదరాబాద్‌కి షిఫ్ట్ కాలేదు. చిరంజీవి గారు, అల్లు అరవింద్ గారు... కూడా అక్కడే ఉన్నారు. రామలింగయ్య గారు, వాళ్ల ఆవిడ చాలా ఆప్యాయంగా పలకరించారు. 'నాన్నగారూ... మిమ్మల్ని చూడాలనిపించింది' అన్నాను. రామలింగయ్య గారిని నాన్నగారనే పిలుస్తాను. చాలా చిత్రాల్లో ఆయన నాకు తండ్రి గా వేషాలు వేశారు. ఆయన్ని చూస్తేనే నాకు పితృ వాత్సల్యం కలుగుతుంది. ఆయన కూడా అలాగే నన్ను చూసుకునేవాళ్లు. 'పుట్టిల్లు' సినిమా దగ్గరనుండీ అంతే. 'మంచిదమ్మా.... నీకు ఒకటి చూపిస్తాను రా' అని నన్ను ఆయన బెడ్ రూమ్‌లోకి తీసుకెళ్లారు. ఆయన తల దగ్గర గరికపాటి రాజారావు గారి పెద్ద ఫోటో. ఎవరైతే మమ్మల్ని సినిమాలకి పరిచయం చేశారో ఆయన ఫోటో..... దండ వేసి తన తల దగ్గర పెట్టుకున్నారు. మరి ఈ రోజుల్లో తనని పైకి తీసుకువచ్చిన వాళ్లను ఎవరైనా అసలు పట్టించుకుంటున్నారా? ఎక్కడైనా కనబడితే ఎవరన్నట్టు చూస్తున్నారు. ఆయనో మాట అన్నారు... 'అమ్మాయ్.. మనకు అన్నం పెట్టారమ్మా... ఆయన్ని ఎలా మరచిపోతాం చెప్పు. నువ్వు పెట్టుకున్నావా' అన్నారు. అంత కృతజ్ఞత ఉండేది ఆయనకు. 'నా దగ్గర కూడా ఆయన ఫొటో ఉంది నాన్నగారూ...' అన్నాను.

నా దగ్గర ఉన్నది సిల్వర్ ఫ్రేమ్‌లో ఫొటో. రాజమండ్రిలో కళానికేతన్ వాళ్లు సన్మానం చేసి రాజారావు గారి ఫోటో సిల్వర్ మీద ప్రింట్ చేసి ఇచ్చారు.

రాజారావుగారి ఫోటో చూశాక నాకు ఆయనలో ఉన్న కృతజ్ఞతా భావానికి కళ్లు చెమర్చాయి. మరి అటువంటి ఆయన ఇటీవల పోవడం... ఆయన భౌతిక కాయాన్ని చూడగానే నాకు చాలా ఏడుపు వచ్చింది. అయినా దుఃఖాన్ని దిగమింగాలి కదా!

రాజమండ్రిలో రామలింగయ్యగారి పేరున హోమియో కాలేజి పెట్టారు. నేను ఎం.పీ. గా ఉన్నప్పుడు అక్కడకు వెళ్లాను కాలేజీ అభివృద్ధికి ఏమైనా హెల్ప్ కావాలంటే చేస్తానన్నాను. తరువాత వాళ్లు అప్రోచ్ కాలేదు.

పేపర్లో చదివాను. రామలింగయ్య గారు నేత్రదానం కూడా చేశారంట. దేశభక్తి మెండు ఆయనకు. ఒక మనిషిలో ఎన్నో మంచి క్వాలిఫికేషన్స్... అందులోనూ ఓ హాస్యనటునికి ఉండటమనేది చాలా అరుదైన విషయం.

చివరి వరకూ కూడా చాలా మంచి జీవితాన్నే ఆయన అనుభవించారు. బాత్రూంలో పడిపోకపోతే మాత్రం డెఫినెట్‌గా ఇంకో నాలుగైదేళ్లు జీవించేవారాయన.





('మూగమనసులు'లో పాటల గురించి మరికొన్ని పాటల గురించి... వచ్చే సంచికలో....)

# కామాక్షి కరుణా కటాక్ష వీక్షణం

# శ్యామశాస్త్రి

## (1763 - 1827)

సంగీత త్రిమూర్తుల్లో శ్యామశాస్త్రి ఒకరు....

త్యాగరాజస్వామి శ్రీరాముడి మీదా....

ముత్తుస్వామి దీక్షితులు ....సర్వ దేవతల మీద రాస్తే

శ్యామశాస్త్రి ప్రధానంగా....కామాక్షి మీద ఎక్కువగా కీర్తనలు రాశాడు....

శ్యామశాస్త్రి పూర్వులు ఆంధ్ర దేశంలోని కర్నూలు జిల్లా కంబంలో ఉండేవారట.. ఆదిశంకరాచార్యుల కాలం నాటికే వారు కంచి కొచ్చీ శంకరుల వారు ప్రసాదించిన 'బంగారు కామాక్షి' విగ్రహానికి అర్చకత్వం ఆరంభించారట...

విజయనగర సామ్రాజ్యం ఉన్నంత వరకూ అత్యంత వైభవంగా వెలిగిన ఆంధ్ర దేశం తర్వాతర్వాత తురుష్కుల పాలనలో సాంస్కృతిక పతనం ఆరంభం అవ్వగానే శ్యామశాస్త్రి పూర్వీకులు తెలుగు గడ్డని వదిలి తమిళ దేశం వెళ్ళి స్థిరపడ్డారట...

తంజావూరు పాలకుడైన తులజాజీ మహారాజు శ్యామశాస్త్రి తండ్రిగారైన విశ్వనాథశాస్త్రిగారిని బాగా ఆదరించడం... తంజావూరులోనే 'బంగారు కామాక్షి' దేవికి ఆలయం కట్టించి ఆ వంశానికే అర్చకత్వం అప్పగించడంతో పునర్వైభవం కొనసాగింది..... ఒకసారి శ్రీ వేంకటేశ్వర స్వామి సమారాధన సమయంలో ఎవరో వృద్ధ బ్రాహ్మణుడొచ్చి.... విశ్వనాథ దంపతులతో "వచ్చే యేట చైత్ర మాసంలో కృత్తికా నక్షత్రం రోజున మీకు అబ్బాయి పుడతాడు" అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడట.

ఆ ప్రకారమే కృత్తికా నక్షత్రంలో పిల్లాడు పుట్టగానే వెంకట సుబ్రహ్మణ్యం అని పేరుపెట్టీ....పిలవడం మాత్రం 'శ్యామక్రిష్ణ' అని ముద్దుగా పిల్చుకునేవారట...



- దైవాంశ సంభూతుడు.. అపారమైన మేధ ఉండడం వల్ల....శ్యామ శాస్త్రి చిన్ననాడే సంస్కృత-ఆంధ్ర-తమిళ భాషల్లో పాండిత్యం సంపాదించటంతో పాటు... జ్యోతిష్య శాస్త్రంలో కూడా నైపుణ్యం సంపాదించాడు.

ఈలోగా 'సంగీత స్వామిగా' పేరు పొందిన ఒక యోగీశ్వరుడు శ్యామశాస్త్రి ముఖవర్చస్సూ, పాండిత్యమూ చూసి భవిష్యత్తులో ఈ పిల్లాడు సంగీతంలో పెద్దవిద్వాంసుడు కాగలడని గ్రహించి...శ్యామశాస్త్రిని తన శిష్యుడిగా గ్రహించి తన విద్యనంతా ధారపోశాడు.

అలాగే తులజాజి ఆస్థాన విద్వాంసుడిగా ఉంటున్న 'విరిబోణి' వర్ణకర్త పచ్చిమిరియం ఆది అప్పయ్యగారి సంగీతాన్ని కూడా బాగా విని... మెలకువలు తెలుసుకున్నాడు...

పచ్చిమిరియం గారు 'శ్యామశాస్త్రి' ని ముద్దుగా 'కామాక్షీ' అని పిలిచేవారట...

- తండ్రి తర్వాత కామాక్షీ దేవిని అర్చించే అధికారం శ్యామశాస్త్రికి వచ్చింది - పులకించి పోయాడు.... వెంటనే తన మొదటి కృతి "జననీ నతజన పరిపాలినీ పాహిమాం భవానీ" అంటూ భక్త్యావేశంతో అద్భుతంగా గానం చేసాడు....

ఆయన ప్రతీ శుక్రవారం అమ్మవారికి పూజ చేసేటప్పుడూ.... తను పిల్లాడై పోయి... తల్లితో మాట్లాడుతున్నట్టు ఉండేవాడట! గారాలుపోయేవాడట... బతిమాలే వాడట....అప్పుడప్పుడు అలిగే వాడట కూడా!... అదొక ఆధ్యాత్మిక దివ్యానుబంధం....

అలాగే 'బంగారు కామాక్షీ' దేవిని వాళ్ళు ఇంటి ఆడపడుచుగా భావించడం వల్ల.... దేవిమీద చేసిన అన్ని కీర్తనల్లోనూ 'శ్యామ క్రిష్ణ సహోదరీ' అనే ముద్ర ఉండేది.....

సంగీతత్రయంలో శ్యామశాస్త్రి పెద్దవాడు....పైగా ముగ్గురిదీ ఒకే ఊరు .... తరచూ శ్యామశాస్త్రుల వారు, త్యాగరాజస్వామి వారింటికి వొస్తూ ఉండేవారట.... అంతే!... సంగీతం గురించీ .. సాహిత్యం గురించీ..భక్తి గురించీ, ముక్తి గురించీ గంటల తరబడి మాట్లాడుకునేవారట...... ఇహ శిష్యగణం భక్తీ - ముక్తీ సరే... భుక్తి మాటేమిటి... అనుకుంటుండగానే రెండు ఝాములు దాటేదట..

ముత్తుస్వామి దీక్షితులు మల్లే శ్యామశాస్త్రి దేశాటన చేసిన వాడేం కాదు... అయితే తంజావూరు లేకపోతే మధుర అంతే!...

ఒకసారి శ్యామశాస్త్రి తన శిష్యుడైన అలసూరు క్రిష్ణయ్యతో కలిసి మధుర వెళ్ళారు... మీనాక్షీ అమ్మవారి దర్శనం అయింది!...

భక్తులమీద కరుణాకటాక్షాలను కురిపించే అక్షులేవైతేనేం వెంటనే పారవశ్యంతో పాట మొదలైంది!.. ఉన్న నాలుగు రోజుల్లోనూ అంబ మీద తొమ్మిది పాటలు రాశాడు. ఈ కృతులనే 'నవరత్న మాలిక' అంటారు...అయితే ఈ రత్నాల్లో రెండు మనకి లభించలేదు. దొరికిన ఏడూ ఏవిటంటే .....!

1. సరోజ దళ నేత్రీ ....... శంకరాభరణం
2. దేవీ మీన నేత్రీ ....... శంకరాభరణం

3. మరి వేరే గతి ఎవరమ్మా .... ఆనందభైరవి
4. నన్ను బ్రోవు లలితా ... లలిత
5. మాయమ్మా అని నే పిలిచితే .... అహిరి
6. దేవీ నీ పద సారములే .... కాంభోజి
7. మీనలోచనా - బ్రోవయోచనా .... ధన్యాసి

శ్యామశాస్త్రికి ఎక్కువగా ఆనందభైరవి రాగం అంటే ప్రీతి. అంచేత ఆ రాగంలో ఎక్కువ కృతులు రచించాడు.... ఈయన రచనలు దాదాపు ఒక మూడు వందల వరకూ ఉండొచ్చు....

సంగీత ప్రపంచంలో అతి తక్కువ మంది శిష్యులున్నది ఈయనకే... త్యాగరాజస్వామికి ఇరవై మంది కన్నా ఎక్కువ ఉంటే... ముత్తుస్వామి దీక్షితులకు పదిహేను మంది శిష్యులూ, ఇద్దరు సోదరులూ ఉంటే.... శ్యామశాస్త్రి గారికి ఏ ఒక్కరో ఇద్దరో ఉండే వారట...

ఈయన రచనలు.. త్యాగరాజస్వామి వారంత సరళమూ...ముత్తుస్వామిదీక్షితులంత క్లిష్టమూ కాకుండా మధ్యే మార్గంలో ఉండేవి... ఎంతసేపు తనూ.... తన కామాక్షీ....తన సంగీతం ప్రపంచంగా ఉంటున్న శ్యామశాస్త్రుల వారికి ఒకసారి తన తంజావూరు ప్రభువుల ప్రతిష్ఠ కాపాడాల్సి వచ్చింది...

ఆంధ్ర దేశం నుంచి 'బొబ్బిలి కేశవయ్య' మీ తమిళ నాడులో నా అంత మొనగాడెవడైనా ఉన్నాడా?' అని సవాలు విసిరితే.... వినయ సంపన్నుడూ... కామాక్షీ కటాక్ష వరప్రసాదం అయిన శ్యామశాస్త్రి చింతామణి రాగంలో 'దేవీ బ్రోవ సమయ మిదే' అనే కీర్తన రాసీ.... తంజావూరు సంస్థానానికొచ్చీ.....

'భూలోక చాపచుట్టి' అనే ....... బొబ్బిలి కేశవయ్యను ఢీ కొన్నాడు...... కేశవయ్య.... 'సింహనందన' తాళంలో పల్లవిని పాడితే...



శ్యామశాస్త్రి 'శరభనందనం' అనే నూతన తాళంలో పల్లవి పాడీ.... 'భూలోక చాప చుట్టని' నీరు కార్చాడట !!

గెల్చినా అహంకరించక.. "ఇది అమ్మ కటాక్షం అంతే" అన్నాట్ట..... తన కన్నా చిన్నవాడైన ముత్తుస్వామి దీక్షితులకి 'శ్రీవిద్య' ఉపదేశం చేసిన శ్యామశాస్త్రి -తన కుమారుడైన సుబ్బరామశాస్త్రిని సంగీతంలో మెళకువలు నేర్చుకొమ్మని తను గౌరవించే త్యాగరాజస్వామి వారి దగ్గరకు పంపడం.... ఆయన వ్యక్తిత్వంలోని ఔన్నత్యం మనకు తెలుస్తోంది!..

భక్త్యావేశాలతో కామాక్షీదేవిని నిరంతరం కొలిచి.. అనేక కృతులు రచించిన శ్యామశాస్త్రి అరవై అయిదు సంవత్సరాల జీవితాన్ని తృప్తిగా గడిపీ!.. 1827 ఫిబ్రవరి ఆరవతేదీ, శుక్ల దశమి నాడు... ప్రశాంతంగా అమ్మ ఒడికి చేరాడు... కర్ణాటక సంగీతంలో శ్యామశాస్త్రి గారి స్థానం అజరామరం.

- తనికెళ్ల భరణి

## పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 45.. మరొక అయిదు వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే..ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ.. మా దగ్గర వారికి సంబంధించినవి ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువున ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 5 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరునాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి, నారాయణ తీర్థులు, ముత్తుస్వామి దీక్షితులు.

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ 'హాసం,'**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

నన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ తనికెళ్ల భరణి






"ఏంటీ శ్రీనూ........ పరీక్ష రాయకుండా కూర్చున్నావు? "
"ఏం లేదు! టీచర్ ఈ క్రింది అయిదింటికి జవాబులు రాయమని ఉందండి. ఇంకా టైం అయిదు కాలేదని చూస్తున్నా!"



"మన పెళ్ళి రోజుకు టీవి అడిగావు కదా! పక్క షాపులో దొంగిలించి తెచ్చాను తీసుకో " అన్నాడు దొంగ.
"మీ తెలివి తెల్లారినట్టే ఉంది. ఆ షాపులో టి.వి. తీసుకుంటే ఫ్యాను ఉచితం అని రాశారు కదా..... మరి ఫ్యాను వదిలేసి వచ్చారేం!" అంది దొంగది.



"ఒరేయ్ రవీ...Agree కి వ్యతిరేక పదం ఏమిటి?"
"Dis agree సార్ !"
"వెరీగుడ్ ...గోపీ coverకి వ్యతిరేక పదం ఏమిటి?"
"Discover సార్ !"

"నేను కూడా మా నాన్నలాగే డాక్టర్ కావాలని కోరుకుంటున్నాను."
"మీ నాన్న ఏదో ఆఫీసులో క్లర్క్ అని చెప్పినట్టు గుర్తు"
"నే చెప్పేదీ అదే.... ఆయన కూడా అలాగే కోరుకున్నారు".





"లతా....గాంధీతాత గురించి చెప్పు"
"గాంధీగారి గురించి తెలుసు టీచర్ ! వాళ్ళ తాత గురించి తెలియదు."



"అమ్మా ! బిచ్చం తల్లీ"
"చాలా సంతోషం నాయనా... అక్కడ పెట్టి వెళ్ళు".



"ఈ మందుల్ని, టాబ్లెట్స్‌ని పడుకోబోయే ముందు వేసుకోవాలి"
"ఇంట్లోనా! ఆఫీసులోనా"

**ఈ జోకులను పంపించిన వారు: చిట్టూరి సురేష్ కుమార్, గనిశెట్టిపాలెం, విజయనగరం.**



ఓ పల్లెటూరి బైతు తన కేసుని వాదించమని కోరడానికి ఓ లాయర్ దగ్గరికి వెళ్ళాడు. తనో గొప్ప లాయర్‌ని అని భావించే ఆ లాయర్ ఆ బైతుతో "నీ కేసు నేను తప్ప వాదించలేరని ఎవరైనా చెప్పారా నా దగ్గరికి వచ్చావు" అనడిగేడు .
అందుకా బైతు "ఎట్టే ! చాలా మంది దగ్గరకెళ్ళాను - ఎవరి దగ్గర కెళ్ళినా తెలివి తక్కువ దద్దమ్మ తప్పితే నీ కేసు ఎవరూ వాదించరని అన్నారండి. చివరికి మీ దగ్గర కొచ్చాను. మీరు తీసుకున్నారు సంతోషమండి".



ఓ పిల్ల తల్లితో చెప్తోంది.
"మా టీచర్‌కి దైవభక్తి చాలా ఎక్కువ. నేను సమాధానం చెప్పినప్పుడల్లా 'ఓ మైగాడ్, ఓమైగాడ్' అంటూంటుంది."



పోలీస్‌స్టేషన్‌లోకి హడావుడిగా పరుగెత్తుకొచ్చిన ఒకావిడ అక్కడి హెడ్ కానిస్టేబుల్‌తో "సార్ !మా ఆయన బంగాళ దుంపలు తెస్తానని రెండు రోజుల క్రితం మార్కెట్‌కి వెళ్ళాడు. ఇంత వరకూ రాలేదు. ఏం చెయ్యాలో తోచక మీకు కంప్లయింట్ చేద్దామని వచ్చాను"
"బంగాళా దుంపలు కాకపోతే ఇంకోకూర ఏదైనా చేసుకోకపోయావా అమ్మా! దాని కోసం ఇంత దూరం రావాలా" అన్నాడా హెడ్ కానిస్టేబుల్ తాపీగా .

**ఈ జోకులను పంపించిన వారు: కె.సీతారామరావ్, హైదరాబాద్.**



జడ్జి : (దొంగతో) నువ్వేం దొంగతనం చేసావు?
దొంగ : రెండు మీటర్ల వైరు సార్ !
జడ్జి : ఇంత చిన్న విషయానికే నిన్ను అరెస్ట్ చేసారా !?
దొంగ : ఆ వైరు చివర ఒక కలర్ టీవి ఉంది సార్.



"మీ వాడికి బరువైన బూట్లు తయారు చెయ్యాలా.....? ఎందుకు ?"
"ఏ ఆడపిల్ల కనిపించినా ఊహల్లో తేలిపోతుంటాడులే ......అందుకని...."






" ఏమిటే మీవారి చేత ముగ్గులు వేయిస్తున్నావట....!?"
"అవునే మావారు ఇంట్లో పని ఆడవారు ఇంటి బయటి పని మగవారు చెయ్యాలని వాదిస్తూ ఉంటారు... అందుకని".

**ఈ జోకులను పంపించిన వారు: ఎ. బాలస్వామి - దుద్దెపూడి, ఖమ్మం.**

"ఆపరేషన్ రూమ్‌కి దారెటండీ?"
"ఎందుకూ"?
"డాక్టర్ పరలోకంగారు మా నాన్నగారికి ఆపరేషన్ చేస్తున్నారు అందుకనీ.."
"అలాగా...అయితే నువ్వు అటు వెళ్లటం వేస్ట్ .... మార్చురీ దగ్గర కాపలా కాయడం బెస్ట్"



"అవున్రా! పెళ్లిచూపుల కెళ్లొచ్చావ్ టకదా! ఆ అమ్మాయిని ఏమన్నా ప్రశ్నలడగక పోయావా?"
"ఏడ్చినట్లే వుంది! ఆ అమ్మాయి టి.వి.లో యాంకరట ఇంక మనం మాట్లాడటానికి అవకాశం ఎక్కడ ఇచ్చి చచ్చింది?"



**ఈ జోకును పంపించినవారు: ఆదూరిబాలస్వామి - దుద్దెపూడి**



"డాక్టర్ .....ఏంటో
నాలో నేను మాట్లాడేసుకుంటున్నాను......అర్థం కావటంలేదు...ఏదైనా మందివ్వండి ప్లీజ్"
"డోంట్‌వర్రీ.....చాలామంది ఇలాగే మాట్లాడేసుకుంటారు?"
"అది కాదు డాక్టర్ ! నాలో నేను హిందీలో మాట్లాడేసుకుంటున్నాను. నాకు హిందీ తెలియదు. దాంతో నాకు ఒక్క ముక్కకూడా అర్థమయ్యి చావడంలేదు."



"ఏరా గోపీ! మీ వేడ మీదతనికి తిక్కటగా?"
"అవున్రా!' పేపరివ్వం డంకుల్' అని అంటే
- 'వార్తలన్నీ వేడిగా వున్నాయ్- ఫ్రిజ్‌లో పెట్టిస్తానుండు' -అని అంటాడ్రా!"

**ఈ జోకులను పంపించిన వారు: కె. చిన్నబాబు, కిసాన్‌నగర్.**

వుట్టింటికి వెళుతూ మొగుడితో అంది పెళ్లాం - "చేరగానే టెలిగ్రాం ఇచ్చేదా ?" అని.
"వద్దులే ! ఇక్కడికి వచ్చే ముందివ్వు చాలు" అన్నాడా పతి పుంగవుడు తడుము కోకుండా.



**ఈ జోకులను పంపించిన వారు: మామిడి మహేంద్ర, పూణే.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన చిట్టూరి సురేష్‌కుమార్ - గనిశెట్టి పాలెం, కె.సీతారామారావ్ - హైదరాబాద్, ఎ.బాలస్వామి - దుద్దెపూడి, కె.చిన్నబాబు - కిసాన్ నగర్, మామిడి మహేంద్ర - పూణె గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.






# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం
సరస్వతీ చంద్ర
గీత రచయిత
ఇందీవర్
సంగీతం
కల్యాణిజీ, ఆనంద్‌జీ
గానం
ముకేష్ / లతా
(టాండమ్ సాంగ్)
అభినయం
మునీష్, నూతన్



ముకేష్ పాడినది :

చందన్ సా బదన్ - చంచల్ చిత్ వన్
ధీరేసే తేరా యే ముస్కానా ॥చందన్॥
ముఝే దోష్ నదేనా జగ్ వాలో ॥2॥
హో జావూ అగర్ మై దీవానా
చందన్ సా బదన్ - చంచల్ చిత్ వన్
యే కామ్ కమాన్ భవే తేరీ - పల్కోంకే కినారే కజరారే ॥2॥
మాథే పర్ సింధూరీ సూరజ్, హోఠోంపె బహకతే అంగారే
సాయా భీ జో తేరా పడ్ జాయే ॥2॥
ఆబాద్ హో దిల్ కా వీరానా ॥చందన్॥
తన్ భీ సుందర్ మన్ భీ సుందర్ - తూ సుందర్‌తా కీ మూరత్ హై ॥2॥
కిసి ఔర్ కో శాయద్ కమ్ హోగీ- ముఝె తేరీ బహుత్ జరూరత్ హై
పెహలే భీ బహుత్ మై తర్సా హూ ॥2॥
తూ ఔర్ న ముఝ్ కో తర్‌సానా ॥చందన్॥



లతా మంగేష్కర్ పాడినది :

చందన్ సా బదన్ - చంచల్ చిత్ వన్
ధీరేసే తేరా యే ముస్కానా ॥చందన్॥
ముఝే దోష్ నదేనా జగ్ వాలో ॥2॥
హో జాయే అగర్ దిల్ దీవానా
చందన్ సా బదన్ - చంచల్ చిత్ వన్
యే విశాల్ నయన్ జైసె నీల్ గగన్
పంచీ కి తర్హా ఖోజావూ మై
సర్‌కానా జో హో తేరీ బాహోంకా
అంగారోంపే సో జావూ మై
మేరా బైరాగీ మన్ డోల్ గయా ॥2॥
దేఖీ జో అదా తేరీ మస్తానా ॥చందన్॥
తన్ భీ సుందర్ మన్ భీ సుందర్ - తూ సుందర్‌తా కీ మూరత్ హై ॥2॥
కిసి ఔర్ కో శాయద్ కమ్ హోగీ- ముఝె తేరీ బహుత్ జరూరత్ హై
పెహలే భీ బహుత్ దిల్ తర్సా హై ॥2॥
తూ ఔర్ న దిల్ కో తర్‌సానా ॥చందన్॥



మొత్తం మీద చూసినపుడు కల్యాణ్‌జీ, ఆనంద్ జీ మంచి సంగీత దర్శకులు. ముకేశ్ పాటల పరంగా చూసినపుడు గొప్ప సంగీత దర్శకులు. అరుదైన బాణీ కుదిరినపుడు ముకేశ్ కు ఇచ్చేవారో లేక ముకేశ్ పాట అని తెలిసి అంత చక్కటి బాణీ చేసేవారో తెలీదు గానీ- వీరి కాంబినేషన్‌లో వచ్చిన పాటలన్నీ అపురూపమైనవే. అందులో విషాదభరితమైతే, చెప్పనే అక్కర్లేదు. 'హిమాలయా కీ గోద్ మే'లో 'మైతో ఎక్ కాబ్ హూ', 'దుల్హా దుల్హన్'లో 'హమ్ నే తుఝ్‌కో ప్యార్ కియా హై జిత్‌నా', 'పూరబ్ ఔర్ పశ్చిమ్' లో 'కోయీ జబ్ తుమ్హారా హృదయ్ తోడ్ దే', 'చలియా' లో 'మెరె టూటె హువే దిల్ సే', 'సరస్వతీ చంద్ర'లో 'హమ్ నే అపనా సబ్ కుచ్ ఖోయా ప్యార్ తేరా పానేకో'... ఇలాంటివి విన్న కొద్దీ వినాలనిపించేవి... ఎన్నో.

ఇలాంటి వీరి కాంబినేషన్‌లో సుప్రసిద్ధమైన రొమాంటిక్ గీతం 'సరస్వతి చంద్ర' లోని 'చందన్ సా బదన్'. ఇప్పుడు ఈ పాటని అర్థం చేసుకుని, ఆ సంగీత దర్శక ద్వయానికీ, ముకేశ్‌కూ నివాళులు అర్పిద్దాం.

ఈ చిత్రంలో నాయిక నూతన్. నాయకుడు మునీష్. భార్య సౌందర్యానికి అబ్బురపడుతూ



భర్త ప్రేమతో, ఆర్తితో పాడే పాట ఇది. ముకేశ్, లతా ఇద్దరూ పాడిన ఈ పాటలో ముకేశ్ వర్షనే ఎక్కువ హిట్టయింది. ఇది రెండు చరణాల పాట. ఇద్దరి వర్షన్‌లోనూ ట్యూన్ మారదు.

పల్లవి : **చందన్ సా బదన్ -చంచల్ చిత్ వన్ - ధీరే సే తేరా యే ముస్కానా**

బదన్ అంటే దేహం. చిత్ వన్ అంటే చూపు. ధీరేసే అంటే మెల్లిమెల్లిగా, ముస్కానా అంటే దరహాసం చేయడం.

**ముఝే దోష్ న దేనా జగ్ వాలో -హో జావూ అగర్ మై దీవానా**

దోష్ నదేనా అంటే తప్పు పట్టకండి, దీవానా అంటే పిచ్చివాడు.

ఈ పాటలో ఎక్కువ పదాలకు మాతృక సంస్కృతమే . అందుకే తెలుగు వారికి అర్థం కావడంలో అసౌకర్యం లేదు.

**చందనం వంటి మేను- చంచలమైన చూపు**
**మెల్లిగా విచ్చుకునే మందహాసం (చూస్తూంటే)**
**నేను పిచ్చి వాడినైపోతే- అది నాతప్పు కాదు**

అని ఆమె సౌందర్యం తనపై వేసిన ప్రభావాన్ని అతిశయోక్తిగా, అతి చక్కగా ప్రపంచానికి చాటి చెప్పాడు. (జగ్ వాలో అనడంలో జన సామాన్యానికి మొరపెట్టుకోవడం ఉంది)

మొదటి చరణం :

**యే కామ్ కమాన్ భవే తేరీ- పల్కోంకే కినారే కజరారే**

వంగిన విల్లు లాంటి నీ కనుబొమ్మలు - కనురెప్పల అంచున కాటుక కాంతులు

మాథే అంటే నుదురు; సూరజ్ అంటే సూర్యుడు. హొంట్ అంటే పెదవులు, అంగారే అంటే జ్వాల

**నుదుటి తిలకం సూర్యుడై**
**అధరాలు రగలుతున్న జ్వాలలై**
**సాయా భీ జో తేరా పడ్ జాయే- ఆబాద్ హో దిల్‌కా వీరానా**

సాయా అంటే నీడ, అబాద్ అంటే చిగురించడం,
వీరానా అంటే ఎండిపోయిన

**నీ నీడ నా పై పడినా - ఎండిన నా మానసం చిగురిస్తుంది**

రెండోచరణం:

**తన్ భీ సుందర్..**
**నీ తనువూ సుందరమే- మనసూ సుందరమే**
**నువ్వు మూర్తీభవించిన సౌందర్యానివి**
**ఇతరుల మాటకేమో గానీ**
**నాకు నీ అవసరంచాలా ఉంది**
**అసలే నేను (ప్రేమ కోసం )తపించిపోతున్నాను**
**నువ్వు ఇంకా నా తపనను పెంచకు**

అని ప్రాధేయ పడుతున్నాడు ప్రియుడు.



ఇక లతా మంగేష్కర్ పాటలో...

**యే విశాల్ నయన్....**
**నీలాకాశం లాంటి నీ విశాల నేత్రాల్లో పక్షినై ఒదిగిపోతాను**
**నీ బాహువుల ఆసరా ఉంటే - అగ్నిజ్వాలలపై నిద్రిస్తాను**
**నా వైరాగ్య మానసం ఉగ్రూతలూగింది**
**సమ్మోహకమైన నీ సోయగం చూసి**

ప్రేమికులు పరస్పరం ఆరాధనను, ప్రేమను వ్యక్తం చేసుకునే ఈ పాట చక్కని పద చిత్రాలతో, భావ చిత్రాలతో శాస్త్రీయ సంగీత బాణీలు ఏ వయస్సు వారినైనా అలరించేలా ఉంటుంది.

**- మృణాళిని**



## 1964

హేమంత్ కుమార్ సంగీతాన్నిచ్చిన 'కొహరా' చిత్రం 'బీస్ సాల్ బాద్' విజయాన్ని రిపీట్ చేయలేకపోయినా ఆ సినిమాలాగే మ్యూజికల్‌గా పేరు తెచ్చుకుంది. 'ఝూమ్ ఝూమ్ ఢల్‌తీ రాత్'(లతా), 'యే నయన్ డరే-డరే, యే జామ్ భరే -భరే'(హేమంత్‌కుమార్), 'ఓ బేకరార్ దిల్'(లతా), 'రాహ్ బనీ ఖుద్ మంజిల్ (హేమంత్‌కుమార్) పాటలు హిట్స్‌గా వెలుగొందాయి.

'దూర్ కి ఆవాజ్' చిత్రంలోని 'హమ్ భీ అగర్ బచ్చే హోతే హోతే...',(ఆశా, రఫీ, మన్నాడే,బృందం) 'షెహనాయ్' చిత్రంలోని 'న ఝట్‌కో జుల్ఫ్ సే పానీ యహ్ మోతీ...'(రఫీ) పాటలు రవికి మంచి పేరు తీసుకువస్తే, 'లీడర్' చిత్రంలోని 'హమీ సే మొహబ్బత్...',(రఫీ) 'తేరే హుస్న్ కి క్యా తారీఫ్ కరూఁ'(లతా, రఫీ), 'ముఝే దునియావాలో షరాబీ న సమ్‌జో'(రఫీ, బృందం), 'అప్‌నీ ఆజాదీ కో హమ్ హర్‌గిజ్ మిటా సక్‌తే నహీఁ'(రఫీ) పాటలు నౌషాద్‌కు చక్కటి గుర్తింపు తీసుకువచ్చాయి.

## 1965

శంకర్ -జైకిషన్‌ల బాణీ నుండి పక్కకు వచ్చి తమదైన తరహాలో సంగీతాన్నిచ్చి 'హిమాలయ్ కి గోద్ మేఁ', 'జబ్ జబ్ ఫూల్ ఖిలే' చిత్రాల ద్వారా కళ్యాణ్‌జీ - ఆనంద్‌జీలు సూపర్‌హిట్స్ సాధించారు. వీరికే కాదు గీత రచయిత ఆనంద్‌బక్షి కెరీర్ తారా స్థాయికి చేరుకోవటానికి ఈ చిత్రం ఎంతో దోహదపడింది. 'కంకరియా మార్ కే జగాయా, కల్ తూ మేరే సపనే..'(లతా), 'తూ రాత్ ఖడీ థీ'(ఉషా తిమోతీ, రఫీ, బృందం), 'చాంద్ సి మెహబూబా హో మేరే' ( 60లలో చందురుని పై ముకేష్ పాడిన రెండో పాట ఇది. మొదటిది కళ్యాణ్‌జీ- ఆనంద్‌జీ ల 'ఫూల్ బనే అంగారే' లోని 'చాంద్ ఆహే భరేగా') పాటలు ఇందీవర్ రాసిన 'ఎక్ తూ జో మిలా సారీ దునియా'(లతా), కమర్ జలాలాబాదీ రాసిన 'మై తో ఇక్ ఖ్వాబ్ హూఁ'(ముకేష్) పాటలతో పాటుగా చార్ట్స్‌లో మొదటి స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. ఈ చిత్రం సినీ మ్యూజిక్ డైరెక్టర్స్ అసోసియేషన్ నుండి ఉత్తమ సంగీత చిత్రంగా అవార్డును సొంతం చేసుకుంది.

ఆగస్టు 27, 2004 వరలక్ష్మీ వ్రతం సందర్భంగా...

# లలిత సంగీతం




ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993


## ఓ దేవి నీ మ్రోల ఒదిగి యున్నానమ్మ

ప॥ ఓ దేవి నీ మ్రోల ఒదిగి యున్నానమ్మ
ఏదేని వరమడుగ ఎంతవారము తల్లి ॥ఓ దేవి॥

చ॥ పాదాన తలలనే పారిజాతములుంచి
మోదాన బాష్పాల ముత్తెసరులుంచి ॥ఓ దేవి॥
జనని దయారస హృదయా జలజవనీ నిలయా
జయా జయా శుభాలయా జయాజయా హరిప్రియా ॥ఓ దేవి॥

చ॥ నొసట కలకాలమ్ము పసుపు కుంకుమలుంచి
నిసువు చిరునగవు వెన్నెల వీట వెలిగించి
ససి చెదని సంసార మందార ముంచి
బసచేసి మా యింట మసలేటి మహాలక్ష్మి ॥ఓ దేవి॥
జనని దయారస హృదయా జలజవనీ నిలయా
జయా జయా శుభాలయా జయాజయా హరిప్రియా ॥ఓ దేవి॥

### బృందగానం

| | |
|---|---|
| రచన | : కీ॥శే॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి |
| సంగీతం | : పాలగుమ్మి విశ్వనాథం |
| రాగం | : బిలహరి (కర్ణాటక సం॥) రాగ్ అల్హైయాబిలావల్ ( హిందుస్తాని సం॥) |
| తాళం | : ఖండగతి, త్రిశ్రగతి (కర్ణాటక సం॥) ఝప్‌తాల్, దాద్రా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : సరిగ పద స |
| అవరోహణ | : స ని దపమగరిస |

29వ మేళకర్త ధీర శంకరాభరణ రాగజన్యం - షడ్జము, చతుశృతి రిషభం, అంతరగాంధారం, పంచమం, చతుశృతి దైవతం ఆరోహణలోను, షడ్జము, కాకలి నిషాదం, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధమధ్యమం, అంతరగాంధారం, చతుశృతి రిషభం అవరోహణ లోను యీరాగంలో ని స్వరాలు. కైశికి నిషాదం కూడా యీ రాగంలో ఉపయోగించబడుతుంది.

కర్ణాటక సంగీతంలోని సుప్రసిద్ధ రాగాలలో బిలహరి కూడా ఒకటి. "కనుగొంటిని శ్రీరాముని నేడు" (త్యాగరాజ కీర్తన),"పరిదాన మిచ్చితే పాలింతువేమో" (పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ కీర్తన)మొదలుగునవి బహుళ ప్రాచుర్యాన్ని పొందిన కీర్తనలు. ఈ రాగాన్ని హిందుస్తాని సంగీతంలో "అల్హైయా బిలావల్" అని పిలుస్తారు. బిలము అనగా గుహ. బిలహరి అనగా గుహలో వుండే హరి. హరి అనగా విష్ణువు, సింహము అనే అర్థము కూడా వున్నది. గుహలో వుండేది సింహము. కనుక బిలహరి అనగా నర-కేసరి రూపంలో అవతరించిన హరి, అనగా నరసింహస్వామి. అనే భావనతో నేను ఒక కీర్తన రచించాను. యీ రాగంలో "హరి! అహో ! బిలహరి" అని "హరి! అహో బిలహరి" అని శ్లేషతో కీర్తన సాగుతుంది. "హరి ! అహో! బిలహరి" అంటూ బిలహరి రాగాన్ని పొగడుతూన్నట్లుగాను, "హరి ! అహో బిలహరి" అంటూ అహో బిలంలో వేంచేసియున్న హరిని అనగా నరహరిని కీర్తిస్తున్నట్లుగాను పల్లవి విశ్లేషతో రూపొందినది. ఈ కీర్తన విని సంగీత విద్వాంసులు, కవులు, పండితులు నన్నభినందించి ఆశీర్వదించారు.



దేవులపల్లి కృష్ణశాస్త్రి

ప్రతి సంవత్సరమూ శ్రావణ పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు "వరలక్ష్మీవ్రతము" జరుపుకోవడము మన సంప్రదాయం. ఆ దినము స్త్రీలందరూ ఎంతో భక్తి శ్రద్ధలతో వరలక్ష్మీ దేవిని పూజించడం వలన అష్టైశ్వర్యములు, ఆయురారోగ్యములు, సకల సుఖములు కలుగుతాయని భారతీయుల విశ్వాసం. ఆ వ్రత కథ కూడా యీ విషయాన్ని ధృవీకరిస్తుంది. చారుమతి అనే పుణ్య వనితకు కలలో లక్ష్మీదేవి కనిపించి" నీవు శ్రావణ పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు ఉదయమే లేచి స్నానాదికములు ముగించుకుని పవిత్రంగా నాకు కలశాన్ని ప్రతిష్ఠించి నిష్ఠతో నన్ను పూజించుము. నీకు సకల సౌభాగ్యాలను ప్రసాదిస్తాను"అని పలుకగా, ఆమె ఆదేశం ప్రకారం శ్రావణ పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారంనాడు యధావిధిగా వ్రతమాచరించి సకల భోగ భాగ్యాలను పొందడమే కాక చివరకు మోక్షాన్ని కూడా పొందినదని వ్రత కథ మనకు తెలుపుతుంది.

కాబట్టి శ్రావణ మాసంలో వరలక్ష్మీ వ్రతాన్ని అత్యంత వైభవంగా భక్తి శ్రద్ధలతో జరుపుకోవడం సంప్రదాయమైనది. అసలు శ్రావణ మాసమంతా మన స్త్రీలు మంగళ, శుక్రవారాలలో నోము నోచుకోవడం పరిపాటి. వరలక్ష్మీ వ్రతానికి సంబంధించిన సంప్రదాయ గీతాలు కూడా ఎన్నో వున్నాయి.

"లక్ష్మీ రావే మా యింటికి క్షీరాబ్ధి పుత్రీ వరలక్ష్మీ రావే మా యింటికి" అంటూ అతివలందరూ పాడుకునే గీతము, "ఎట్లా



ఖండగతి

ప॥ దస సనిదాదా | పదమగరి | ;రిగాపమగ | రిగసాస |
ఓ. దే. . వి | నే. మ్రో. ల | . ఒదిగియు. | న్నా. మమ్మ |

;ధసా రిగారీ | గపపపప | ;పదాస సనినిద | దదదపప |
. ఏ. దే. వి | వరముడుగ | . ఎం. తవా. . . | రముత. ల్లి |

దస రిగరి సనిదాదా | సా, ; |
ఓ. . . . దే. . . | వి. . |

1.చ॥ ;గా, దపదదా | ;పదాప మగరిగ | రిపగాప దస | సస సనిదాసా |
. పా. దా. . న | . తలలనే. . . | . పా. రి జా. | తములుం. . చి |

;దస సగరిగగా | సరి సనినీని | పాపానిదపాపా | మగగా పా, |
. మో. దా. . న | బా. ష్పా. . ల | . ముత్తె. సరు | లుం. . చి. |

"ఓ దేవి"

త్రిశ్రగతి

మగరి | గపా | మగరి | గపా | పదప | దసని | దదద | ;, |
జనని | దయా | రసహృ | దయా | జలజ | వని. | నిలయా. . |

పదప | దసద | సరీ | రిరీ | రిగా | ససా | సనిద | ససా |
జయా. | జయా. | శుభా | లయా | జయా | జయా | హరి. | ప్రియా |

"ఓ దేవి"

ఖండగతి

2.చ॥ ;మగా సా, సరి | గప పాప | ;పదాద దా | దదదపప |
. నొసట . కేల | తా. లమ్మ | . పసుపు కుం | కుమలుం. చి |

;పదాప పాసని | నినినిపద | నిదపాప | మగరిగ పాప |
. విసువ చారు. | నగవు వె. | న్నెల పాట | వె. లి. గించి |

;పదాస సస | సరిరిరి | ;రిగగరి సస | సనిదా సా, |
. స్నిగ్ధ జని | సం. సార | . సుం. దా. . ర | ముం. . చి. |

;దస రిగరి సస | సనిదా దపప | ;పద నిద పప | మగరిగ పాప |
. చస వే. . . సి | నా. . యుం. టి | . మనసు తె. . టి | మ. హా. లక్ష్మి |

"ఓ దేవి"

తరువాత మొదటి చరణంలాగ ని "జనని దయారస హృదయా.." అనే త్రిశ్రగతిలో పంక్తులను పాడి పల్లవి పాడాలి.

[illegible]

నిన్నెత్తుకొందునమ్మా వరలక్ష్మీ తల్లి -ఎట్లా నిన్నెత్తుకొంందు ఆట్లాడే బాలవు నీవు ఇట్లా రమ్మనుచూ నీవు కోట్లా ధనమిచ్చే తల్లి" అంటూ అల్లారు ముద్దుగా, ఆప్యాయతతో తల్లిని కొలుస్తారు.

కృష్ణశాస్త్రిగారు "ఓ దేవి నే మ్రోల"అనే లక్ష్మీదేవి స్తుతిగీతాన్ని వ్రాయగా పాలగుమ్మి విశ్వనాథంగారు బిలహరి రాగంలో కూర్చిన బాణీని బృంద గీతంగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం 1960వ దశకంలో ప్రసారం చేయగా పలువురి ప్రశంసలనందుకుంది.

ఆగష్టు 27, 2004 నాడు వరలక్ష్మీవ్రతం సందర్భాన్ని పురస్కరించుకుని యీ గీతాన్ని ఎన్నుకోవడం జరిగింది. ●



## బిలహరి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు



| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. ఎవరు నేర్పేరమ్మ యీ కొమ్మకు | ఈనాటి బంధ మేనాటిదో | పి. సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 2. మాదీ స్వతంత్ర దేశం (ప్రయివేటు రికార్డు) | ప్రయివేటు రికార్డు | టంగుటూరి సూర్యకుమారి | రజని |
| 3. విరటుని రాణివాసమున (పద్యం) | భార్యాభర్తలు | పి. సుశీల | యస్. రాజేశ్వరరావు |

పౌరాణిక చిత్రాలలో చాలా పద్యాలకు బిలహరి రాగం ఉపయోగించబడింది.



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...




పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
**ఎమ్బీయస్ ప్రసాద్**

**చిత్ర పరిచయం 11**

సమన్వయం
**మంజీర**

**జరిగిన కథ**

జాన్ డూలిటిల్ జంతువుల భాష అర్థం చేసుకోగల ఓ డాక్టర్. మార్క్, జీన్‌ల అనే భాగస్తులతో కలిసి ఓ క్లినిక్ నడుపుతూంటాడు. దాన్ని టేకోవరు చేసుకుందామని కేలోవే ఆధ్వర్యంలో నడిచే ఓ పెద్ద సంస్థ ముందుకు వచ్చింది. అనుకోకుండా జాన్ జంతువులకు వైద్యం చేయడం మొదలుపెట్టాడు. కానీ అందరూ అతన్ని మతిభ్రష్టుడిగా జమకట్టడంతో భయపడినా, జంతువులకు సహాయపడడంలోనే తనకు ఆనందం లభిస్తుందనీ గ్రహించాక జూనుండి అనారోగ్యంగా ఉన్న పులిని తప్పించి ఆపరేషన్ చేయబోతాడు. టేకోవరు విషయంలో మార్క్ అత్యాశ చూసిన జీన్ ఫంక్షన్ జరుగుతూండగా అతన్ని ముక్కు బద్దలు చేస్తాడు. గాయపడిన మార్క్‌ను స్ట్రెచర్‌పై పడుక్కోబెట్టి, కింద పులిని దాచి ఆపరేషన్ థియేటరుకు తరలిస్తూండగా గినీపిగ్ రోనీతో తగాదా పడి పులి బయటకు వచ్చేస్తుంది. టేకోవరు ప్రకటన చేస్తున్న కేలోవేతో సహా జనమంతా భయపడి పరుగులు పెడతారు.

**- ఇక చదవండి**

**పు**లి టేబులెక్కి రోనీని పట్టుకునేలోపున జాన్ వేదిక మీదనుండి వచ్చేసి దాని ప్రాణం కాపాడేడు. అంతేకాదు, భయపడిపోతున్న జనాల్ని ఊరడించడానికి "ఇదేమీ చేయలేదు, ఇది ఒత్తి జబ్బు పులి.'' అని చెప్పిచూశాడు.



ఇంతలో కేలోవే జాన్ దగ్గరకి వచ్చేశాడు. "నువ్వు చేస్తున్న పిచ్చిపనులకి సంజాయిషీ ఇస్తేనే మనం ముందు సాగుతాం..." అన్నాడు నిలువంతా కోపంతో వణికిపోతూ. ఇక జాన్ చెప్పక తప్పలేదు.

"పిచ్చిపనులంటే..ఒకలా చూస్తే అవి పిచ్చిపనులే..అలా అని సొంతం పిచ్చిపనులని అనలేం.. ఎలా చెప్పాలో తెలియటం లేదు... నేను చేసే పనుల్ని ఎలా సమర్థించుకోవాలో నాకూ తెలియదు...తెలిస్తే బాగుండును.."ఇక్కడిదాకా చెప్పి కేలోవే మొహం చూసి గుటకలు మింగాడు జాన్. కళ్లు మూసుకుని "అసలేమిటంటే.. ప్రస్తుతం ఓ పులి నాకు పేషెంటుగా ఉంది. దానికి వెంటనే ఆపరేషన్ చేయాలి. ఇదొక్కటే నాకు తెలిసినది." అని చెప్పేశాడు.

"ముందు ఈ అగ్రిమెంటు సంగతి తేలాక..'' అని కేలోవే శాసిస్తూండగానే పులి వాళ్ల మధ్యకి ఉరికింది. 'అంతరాయానికి చింతిస్తున్నాను' అన్న అర్థంలోనో ఏమో ఒక్క గాండ్రింపు గాండ్రించింది. కేలోవే బెదిరిపోయి మాటలు గురించి వెతుక్కుంటూన్న తరుణం చూసి జాన్ 'ఎక్స్క్యూజ్‌మీ' అంటూ పులిని వెంటబెట్టుకుని ఆపరేషన్ థియేటరుకి వెళ్లిపోయాడు.



చేతిలో రోనీ విసుక్కుంది - "అందుకే పులులకు బుర్ర లేదంటారు. బ్రహ్మాండమైన పార్టీ తగలేసింది. ఇంకా కాస్సేపు దాక్కోవచ్చుగా!" అని వ్యాఖ్యానించింది.

"షటప్" అన్నాడు జాన్ విసుగ్గా.

"ఏమిటయ్యా షటప్. హాయిగా మందు కొడుతుంటే మధ్యలో ఈ పులి వచ్చి అంతా చెడగొట్టింది. నువ్విస్తావా ఆ మందు!?" అని తిట్టిపోసింది రోనీ. జాన్ దాన్ని టేబుల్ మీద పడేసి పోయాడు.

* * *

ఇవతల సర్కస్‌వద్దనున్న పోలీసులకు పులిని పట్టుకెళ్లిన కారు డా॥ జాన్ డూలిటిల్‌దని తెలిసి పోయింది. మందీ మార్బలాన్ని వేసుకుని అతని క్లినిక్ వద్దకు చేరారు. కానీ లోపలికి వెళడానికి వీలుపడలేదు. ఎందుకంటే మెట్లమీద జాన్‌చేత వైద్యం చేయించుకున్న అన్నిరకాల జంతువులు-తాగుబోతు కోతి, చత్వారపు గుడ్లగూబ సహా-కాపు వేసి ఎవరినీ లోపలికి వెళ్లనివ్వటం లేదు.



తన కెరియర్ మొత్తంలో ఇలాటి సంఘటన చూడని పోలీసు సార్జంటు "ఇదెక్కడి గొడవయ్యా" అని ఆశ్చర్యపడ్డాడు.

అక్కడ పహరా కాస్తున్న కమాండర్ లక్కీ. జంతువుల చేత 1,2, 3, 4.. అని డ్రిల్ చేయిస్తోంది. "ఒక్క పోలీసుని కూడా గుమ్మం దాటి రానివ్వకండి. వస్తే పిక్కమీద ఓ పట్టు పట్టడమే" అని హుషారు చేస్తోంది తన సైన్యాన్ని.

పిక్కమీద ఓ పట్టు పట్టలేని పావురాల జాతికి చెందినది కాబట్టి అందర్నీ అక్కడికి పోగేసిన మగపావురం తన వంతుగా చొరబాటుదారులకు వ్యతిరేకంగా నినాదాలు ఇవ్వడానికి సమకట్టింది. "గో హోమ్ పిగ్స్, ఓ పందుల్లారా వెనక్కి మరలండి, గో బ్యాక్, గోబ్యాక్" అని కోలాహలంగా అరిచింది.

తమ డ్యూటీ అయిపోయింది కాబోసు అనుకున్న కొన్ని పందులు వెనక్కి మరలబోయాయి.

మనుష్యుల తిట్లు ఎరువు తెచ్చుకున్నందుకు తనను తాను తిట్టుకుని పావురం "అయ్యో మిమ్మల్ని కాదర్రా, పోలీసుపందులను అంటున్నా!" అని పందులకు చెప్పి మరింత స్పష్టత కోసం "పోలీసు పందుల్లారా, గో బ్యాక్, గో హోమ్" అని అరవడం మొదలుపెట్టింది. ఇంతలో "ఫర్వాలేదే చాలామందినే పోగేశావ్!" అంటూ ప్రశంస వినబడింది. తలతిప్పి చూస్తే భార్య! భార్యనుండి ఆ మాత్రం పొగడ్త ఇంతకుముందెప్పుడూ ఎరుగని పావురం రెట్టించిన ఉత్సాహంతో ఇంకా గట్టిగా అరవసాగింది.

* * *

'ఇక్కడ ఆపరేషన్ థియేటర్లో జాన్‌కి జీన్ సహాయపడుతున్నాడు. జీన్ మెషిన్లు చూసుకుంటున్నాడు. పేషెంటుతో మాట్లాడే భారం జాన్‌దే! అతను పులికి ఇంజక్షన్ ఇస్తూ జాగ్రత్తలు చెబుతున్నాడు - 'పెద్దగా నొప్పి ఉండదు. ఏదో చీమో, దోమో కుట్టినట్టుగా ఉంటుందంతే! కొద్దిగా ఓర్చుకో, ఏం'



ఆపరేషన్ థియేటరు గాజుకిటికీల వల్ల లోపల జరుగుతున్నది బయటకు కనబడుతుంది. అందరూ చుట్టూ మూగి వింత చూస్తున్నారు. తన భర్త పులితో కబుర్లు చెబుతుండడం చూసి లీసా బాధపడింది. "తను జంతువులతో మాట్లాడగలననే అనుకుంటున్నాడాయన. పిచ్చి తగ్గిందనే అనుకున్నాను కానీ ముదిరినట్టుంది. పాపం ఆ పులి గతి ఏమవుతుందో!"

ఆమెపక్కనే నిలబడ్డ జాన్ తండ్రి ఆర్చర్ మెల్లగా అన్నాడు - 'జాన్‌కు జంతువుల బాధ అర్థమవుతుందమ్మా.., ఇప్పుడే కాదు, చిన్నప్పటినుండీ అంతే!"

లీసా తెల్లబోయింది. "ఏ..ఏ..య్యేమిటి మీరంటున్నది!?"

"అవునమ్మా, చిన్నప్పుడే జంతువులతో మాట్లాడేవాడు. ఏం చేయాలో తోచక, ఈ వింతలక్షణం ఎలా పోగొట్టాలో అర్థం కాక నేను సతమతమయ్యేవాణ్ని. ఇది ఒక లోపమని అనుకునేవాణ్ని. కానీ అది



ఒక గిఫ్టమ్మా, దైవదత్తమైన వరం. అలా అని ఇప్పుడు తెలుస్తోంది. చూడు, చూడు, నువ్వే చూడు. జాన్ మాట్లాడుతున్నది పులి అర్థం చేసుకున్నట్లు కనబడుతోంది. నువ్వే గమనించు.."

మామగారి మాటలకు ఎలా స్పందించాలో తెలియక తికమక పడుతూనే లీసా ఆపరేషన్ థియేటర్‌లోకి చూసింది. జాన్ పులికి చెబుతున్నాడు -

"ఇదిగో నువ్వు మెలకువగా ఉండాలి. నొప్పి తెలియకుండా చిన్నపాటి మత్తు ఇంజక్షన్ ఇచ్చేనంతే! మెలకువగా ఉండి ఎక్కడ నొప్పి వుందో క్లియర్‌గా చెప్పాలి. ఓకే?"



నరేనంటూనే పులి ఓ సందేహం వెలిబుచ్చింది - "అవునుగానీ డాక్టర్, ఇలాటి ఆపరేషన్ నువ్వింతకుముందు చేశావా, లేక నా మీదే ప్రయోగాలు మొదలు పెట్టావా?"

"చేశా, చేశా.. కాలేజీలో చదువుకునేటప్పుడు ఇదే ఆపరేషన్ చేశాను. ఎటొచ్చీ పేషెంటు అప్పటికే శవం అయిపోయివున్నాడు. అంటే మెడికల్ కాలేజీలో ప్రాక్టీసుకోసం శవాలకు ఆపరేషన్లు చేయమంటారులే. కానీ అంతా అయ్యాక మా ప్రొఫెసరుగారు ఏమన్నారో తెలుసా, 'జాన్ వండ్రఫుల్‌గా చేశావయ్యా, వాడు అప్పటికే చచ్చిపోయాడు కానీ ఏమాత్రం ప్రాణం మిగిలున్నా రోగం నయమై పోయుండేది.' అని మెచ్చుకున్నారు."

"వింటూంటే మంచి ధైర్యం వస్తోంది డాక్టర్!"

* * *

హాస్పిటల్ బయట పత్రికా విలేఖరులు, టీవీ విలేఖరులు గుమిగూడారు. ఓ టీవీ రిపోర్టరు తమ ప్రేక్షకులకు తాజా వార్తలు అందించ నారంభించాడు - 'ఇది ఒక అపురూప దృశ్యం. ఓ సర్కస్ పులిని ఒకాయన ఎత్తుకురావడం, ఆ దొంగకు సపోర్టుగా ఇన్ని జంతువులు ఇక్కడ పోగడి నగరంలోని పోలీసులను అడ్డగించడం చాలావాలా, చాలా వింతగా ఉంది. దొంగిలించబడిన ఆ పులిని ఈ భవనంలోనే ఎక్కడో అక్కడ దాచిపెట్టారని పోలీసులు అనుమానిస్తున్నారు.'

* * *

ఆపరేషన్ థియేటర్లో జాన్ పులిని అడుగుతున్నాడు - "నొప్పేమైనా తగ్గిందా? బాధ ఎలా వుందో నాకు కరెక్టుగా చెప్పినపుడే నయం చేయగలుగుతాను."

"నొప్పి అలాగే ఉంది."

"తిమ్మిరిగా ఉందా?"

"ఏమో, తెలియటం లేదు. భయం వేస్తోంది డాక్టర్" అంది పులి దీనంగా.

"ఏమీ కంగారు పడవద్దు. భయం దేనికి? నిన్నంత త్వరగా పైకి పంపనులే" అన్నాడు జాన్ జోక్ వేసి పులి భయం పోగొట్టడానికి.



ఈ లోగా లీసా థియేటర్లోకి వచ్చింది, జాన్ భార్యగా కాదు, నర్స్‌గా. తన భర్తకు ఇటువంటి అపురూపమైన విద్య తెలిసినందుకు ఆమెకు గర్వంగా ఉంది. తనవంతుగా అతనికి నైతికస్థైర్యాన్ని ఇచ్చేందుకు ఆమె ముందుకు వచ్చింది. వచ్చి భర్త పక్కన నిలబడి, "పులి ఏమంటోంది?" అని అడిగింది.

"భయంగా ఉందంటోంది." అన్నాడు జాన్.

సమస్త జీవకోటికి మృత్యుభయం సమానమే కదా అనిపించింది లీసాకు. పులి మనకు క్రూరజంతువు అనిపించవచ్చు. కానీ దానికీ సుఖదుఖాలు, సంతోషవిచారాలు, భయాందోళనలు ఉంటాయి కదా. భాష తెలియకపోవడం వల్ల అవేవీ మనకు తెలియదు. కానీ ఒక ఉత్కృష్టకార్యం నెరవేర్చడానికి జన్మించిన తన భర్త వల్ల తనకూ తెలుస్తోంది. పులిని ఊరడించడానికి, సమాధానపరచడానికి తనూ ఏదో ఒకటి చేయాలి. భర్తలా భాష రాదు కానీ హావభావాల ద్వారా తెలియపరచ వచ్చుగా!

లీసా నెమ్మదిగా పులివద్దకు చేరి భయంభయంగానే దాని పంజాను తన చేతిలోకి తీసుకుని నెమ్మదిగా నిమరసాగింది. పులి ప్రాణానికి అది హాయిగా తోచింది. తనను నిరసించకుండా తన కృషిలో పాలుపంచుకుంటున్నందుకు భార్యను చూసి జాన్ చిరునవ్వు నవ్వాడు. ఆమె కూడా సిగ్గుపడుతూ నవ్వింది.



ఇంతలో 'పులి హార్ట్‌బీట్ తగ్గుతోంది చూడు జాన్' అని హెచ్చరించాడు సహాయకుడు జీన్.

'బాబోయ్, ఎడం చేతివైపు తిమ్మిరెక్కుతోంది' అని మూలిగింది పులి. మెషిన్లో గ్రాఫ్‌కేసి చూస్తూ జాన్ 'కంగారు పడవద్దు, ఓర్చుకో, ఓర్చుకో. ఎక్కడో రక్తం గడ్డ కట్టింది. అది త్వరగా తెలిస్తే బాగుండును. ఎక్కడుంది? నువ్వే చెప్పాలి." అని బ్రెయిన్ స్కాన్ చేస్తూ వెతకసాగాడు.

పులి అతనికి చెప్పసాగింది. 'అటే.., అటే.. కాస్త పక్కకు వెళ్లాలి. ఇంకొంచెం ముందుకు..అదిగో సరిగ్గా అక్కడే నొప్పి..'

జాన్ చేతిలో ఉన్న పరికరంతో ఏదో చేశాడు. బ్లడ్ క్లాట్ కరిగిపోయింది. కొన్నేళ్లుగా పులిని బాధిస్తున్న తలనొప్పి క్షణంలో మటుమాయం అయింది.

"పోయింది, నొప్పి పోయింది., హమ్మయ్య" అంది పులి ఆనందంతో కన్నులు మూతలు పడుతుండగా.



జాన్ చిరునవ్వు నవ్వుతూ తలెత్తి చూశాడు. థియేటరు చుట్టూ చేరి ఆతృతగా చూస్తున్న జనాన్ని చేసి 'హీ ఈజ్ ఓకే' అని అరిచాడు. అందరూ ఒక్కపెట్టున హర్షధ్వానాలు చేశారు. కేరింతలు కొట్టినది మనుషులు మాత్రమే కాదు, ఆకాశంలో, భూమి మీద ఉన్న జంతుజాలం కూడా!

" నీకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలో తెలియకుండా ఉంది డాక్టర్" అంది పులి.

"దానికేముందిలే, జాగ్రత్తగా మందులు తీసుకో. అతి త్వరలో లేచి తిరుగుతావ్. సర్కస్‌లో ఎప్పటిలాగా గంతులేస్తావ్." అన్నాడు జాన్.

ఎక్కడినుండో రోనీ వచ్చిపడింది, జాన్‌మీద ఎగిరి పడింది - "హేయ్ డాక్టర్, ఎందుకయ్యా పులిని బతికించావ్? అది ఇప్పుడు లేచి ఓపిక తెచ్చుకుని నన్ను నమిలి భోంచేయాలి చూస్తే..? అదే జరిగితే నీ మీసాలు కొరికేస్తాను చూసుకో" అని బెదిరించింది.

ఈ ఆపరేషన్ వ్యవహారమంతా కేలోవే ఓ గదిలోంచి గమనిస్తూనే ఉన్నాడు. అతన్ని వెతుక్కుంటూ మార్క్ పరిగెట్టుకు వచ్చాడు. డబ్బాశ అతన్ని ఎక్కువసేపు స్పృహతప్పి పడివుండనివ్వలేదు. తన కర్మాన తనను వదిలేసి పులిని ప్రాధాన్యత ఇచ్చిన కొలీగ్స్‌ను తిట్టుకునే వ్యవధి లేదతనికి. ఆలస్యం చేస్తే కేలోవే వెళ్లిపోవచ్చు. అందుకని రక్తం ఓడుతున్న ముక్కు పట్టుకుని మార్క్ వచ్చేశాడు

"ఆ జాన్ వట్టి క్రాక్ మాస్టర్ సార్. పిచ్చాసుపత్రినుండి పారిపోయి వచ్చాడు. ఇప్పుడే కాదు, చాలాకాలంగా ఉంది పిచ్చి! మేం ఎలాగూ హాస్పిటల్ నుండి తీసేద్దామనుకుంటున్నాం. అతను లేకుండా మనమే అనుకున్న ప్రకారం ఎగ్రిమెంటు..."



కేలోవే అతని మాటలు వినడం లేదు. ముగ్ధుడయిపోయి జాన్‌కేసి చూస్తూ " అతన్ని మించిన సర్జన్‌ను నేను భూప్రపంచం మీద చూడలేదు." అంటున్నాడు.

కేలోవే మొహం చూసి మార్క్ తక్షణం ప్లేటు ఫిరాయించేడు, "అఫ్‌కోర్స్, అతనూ మనతో బాటే ఉంటాడు.." అన్నాడు.

అతని మాటలు పట్టించుకోకుండా కేలోవే థియేటర్లోకి నడిచాడు - "డూలిటిల్, వండ్రఫుల్ జాబ్! కంగ్రాట్స్" అని అభినందించాడు.

డబ్బున్నవాళ్లకు వంతపాడడంలో వెనుకబడని మార్క్ "బ్రేవో జాన్, కీపిటప్" అనేశాడు.



"వెల్‌కమ్ టు అవర్ ఫ్రాంచైజ్. మా హాస్పిటల్స్ గ్రూపులో చేరడం ఉభయత్రా లాభదాయకం అనడంలో నాకేమాత్రం సందేహం లేదు. సరైన హాస్పిటల్‌నే, సరైన టీమునే కొంటున్నానని నాకు తెలిసిపోయింది." అన్నాడు కేలోవే గర్వంగా బోరవిరుచుకుని.

"మీరేమీ కొనటం లేదని నాకు తెలిసిపోయింది! అమ్ముడుపోవడానికి మేం సిద్ధంగా లేం!" అన్నాడు జాన్. 'నా అభిప్రాయమూ అదే' అన్నట్టు జీన్ అతనికి తోడుగా నిలిచాడు



"వాళ్లలాగే అంటారు కానీ.." అని తన ప్రయత్నాలు కొనసాగించబోతున్న మార్క్ నోరు మూయించడానికి పెదాలపై పై నుంచి పక్షి రెట్ట పడింది. కాస్సేపటి క్రితం పోలీసుపందులకు వ్యతిరేకంగా నినాదాల ద్వారా నిరసన తెలిపిన పావురం ఈ సారి వెరయిటీగా డైరక్టు యాక్షన్ ద్వారా నిరసన తెలిపింది.

పక్షిహృదయం అర్థం చేసుకోలేని కేలోవే 'నేను మాత్రం ఊరుకుంటానా, ఎలాగోలా..' అని ప్రగల్భాలు పలకబోతూ ఉంటే 'నేను సైతం' అన్న తీరులో పెంటి పావురం అతని బట్టతలపై తన వంతు రెట్ట తను వేసింది. తన కౌన్సిలింగ్ తర్వాత భార్యాభర్తలిద్దరూ కదం కలిపి నడుస్తున్నందుకు పావురాల జంటకు బొటనవేలెత్తి 'థమ్స్ అప్' సంకేతం చూపాడు జాన్ !

* * *

మాయా బెడ్‌రూమ్‌లో రోనీ అటూ ఇటూ తిరిగేస్తోంది. (దానికి బోను ఎందుకు పెట్టారో,అది బోనులో ఉండేదెప్పుడో దేవుడికే తెలియాలి. ఎప్పుడు చూసినా బయటే షికార్లు) 'ఇదిగో ఏమ్రా, ఇంట్లో డెలివరీ కాబోతోంది. ఒక్కళ్లూ పట్టించుకోరేమిటి? మాయా తెచ్చిపెట్టిన గుడ్డు కదులుతోంది. కాస్సేపటిలో పిల్ల బయటకు వచ్చేలా ఉంది." అని కేకలు వేసేస్తోంది.

నిజమే, మాయా తెచ్చి పెంచుతున్న గుడ్డు నెమ్మదిగా చిట్లుతోంది. కానీ పాపం ఇది తెలియని మాయా నిద్రపోతోంది. లక్కీ వచ్చి మొరిగి నిద్రలేపబోయింది. అలా మొరిగినప్పుడు వాసన వచ్చిందో ఏమో రోనీ చికాకు పడింది - 'ఇదిగో లక్కీ, కాస్త మౌత్ ఫ్రెషనర్ వాడితే నీ పళ్లేమైనా అరిగిపోతాయా? కంపుకొట్టే నోరు మూసుకుని కూచోకుండా మొరగడం ఒకటీ! నువ్వు కాస్త ఆగితే నేను లేపుతా! ఇదిగో మాయా లే, నీ హంస గుడ్డు పగులుతోంది. హంస బయటకు రాగానే నిన్నే చూడాలని తాపత్రయపడ్డావుగా ఇన్నాళ్లూ" అంటూ మాయాను లేపింది. మాయా లేస్తూనే తండ్రిని పిలుచుకురావడానికి పరిగెట్టింది..



"ఇంతకీ హంస అంటే ఏమిటి?" అని లక్కీ అడుగుతూండగానే గుడ్డు

కాస్త పగిలింది. ఓ ప్రాణి తల బయటకు పెట్టింది.



"ఇదేమిటి? జురాసిక్ పార్క్‌లా ఉంది. ఇది మనను బతకనివ్వదురా బాబూ" అని ఖంగారు పడింది రోనీ.

ఈలోగా మాయా అందర్నీ పిలుచుకు వచ్చింది. లక్కీ జాన్‌కేసి చూసి "దీన్నేమంటారు డాక్టర్?" అని అడిగింది.

మాయాతో సహ అందరూ జాన్‌కేసి చూశారు. జాన్ చిరునవ్వు నవ్వి, "ఇది హంస కాదు. చిరంజీవి మాయా గారి పెంపుడు మొసలి!"

అందరూ హాహాకారాలు చేశారు.



భూమిమీద పడీపడగానే తొలుతగా చూసినవారితో ఆ జీవి అనుబంధం ఏర్పరచుకుంటుందని మాయా విన్నది కరెక్టే కాబోలు. గుడ్డులోంచి బయటకు వచ్చీ రాగానే ఆ మొసలి పిల్ల కళ్లు టపటప లాడించింది. ఎదురుగా రోనీ కనబడింది. "అమ్మా" అంది.

రోనీ ఉలిక్కిపడింది. "బాబోయ్, నేను కాదు మీ అమ్మ" అంది.

అప్పుడు అది లక్కీ కేసి తిరిగి "అమ్మా" అంది. 'పోనీ నువ్వయినా' అనే ధోరణిలో!

"అబ్బే, నేనూ కాదు. నాకిలాటి అక్రమసంతానాల గోల లేదు." అంది లక్కీ ఖంగారుఖంగారుగా.

సర్కస్‌లోని పులిని పరామర్శించడానికి జాన్ వెళుతున్నాడు. వెంటనున్న లక్కీ చెబుతోంది - "ఇదిగో డాక్టర్, ఇప్పటినుండీ మనుష్యులకూ, జంతువులకూ ఇద్దరికీ వైద్యం చేస్తావ్ కదూ." అంది.

జాన్ విశాలంగా నవ్వుతూ "మనుష్యులూ, జంతువులూ అనే ఆకారంలో తేడాయే కానీ మనమంతా ఒక్కటే" అన్నాడు విశాలహృదయాన్ని కనబరుస్తూ.

లక్కీ వెంటనే ఆ పాయింటు దొరకబుచ్చుకుంది - "అదే నేనూ అంటున్నాను. నన్ను ఇకపై కుక్కా, గిక్కా అంటే కుదరదు. డైనింగు టేబుల్ దగ్గర నాకూ ప్రత్యేకంగా ఓ కుర్చీ వేయండి. మీ పిల్లలతో బాటు నాకూ ఓ గది స్పెషల్‌గా ఇయ్యి. దాంట్లో పెద్ద సైజు టీవీ ఒకటి.." కోరికల లిస్టు చదువుతోంది.

బయట చెత్తడబ్బాలో ఉన్న ఎలుకలు డూలిటిల్ కథంతా నెమరు వేసుకుంటున్నాయి. 'సుఖాంతం అయ్యే కథలంటే నాకు మహా చికాకనుకో.' అంటోంది ఓ ఎలుక.

దాని కోరిక తీర్చడానికి కాబోలు ఓ గుడ్లగూబ ఆకాశం నిండి దానివైపు రాసాగింది. దెబ్బకు రెండు ఎలుకలూ కకావికలై అటూ ఇటూ పరుగులు పెట్టాయి. "నా దారికి అడ్డు రాక, నువ్వు ఎడమవైపుకి వెళ్లు, నేను కుడివైపుకి పరుగెడతా.." అంటూ ఒకటే ఉరుకులు, పరుగులు.

(మొదటిభాగం సమాప్తం)

జంతువుల పట్ల కారుణ్యదృష్టి పెరిగేందుకు వాటిని నిస్సహాయులుగా చిత్రీకరించిన కథలనేకం ఉన్నాయి. కానీ జంతువుల్లో కూడా మనుష్యులలో లాగే కొంటెతనం, కిల్లాడీతనం ఉంటాయని చూపించి ఆత్మీయత పెంచిన డా॥డూలిటిల్ కథలు 80 ఏళ్లుగా ఇంగ్లీషు చదివే పిల్లలను అలరిస్తూ చిన్నపిల్లల పాఠ్య పుస్తకాలలో కూడా కనబడతాయి. అవి రచించిన హ్యూ లాఫ్టింగ్ ఆ కథలు రూపుదిద్దుకోవడానికి కారణం ఓసారి చెప్పాడు. - "అవి నేను మొదటి ప్రపంచయుద్ధంలో పనిచేసే రోజులు. యుద్ధంలో గుఱ్ఱాలు ఎంత తెలివిగా వ్యవహరించి ఆశ్వికులను కాపాడేవో ప్రత్యక్షంగా చూశాను. అంతేకాదు, కర్మకాలి అవి తీవ్రంగా గాయపడి, ఇక పనికిరావని తేలితే వాటిని సైనికదళం కాల్చి చంపేయడమూ చూశాను. వాటి గురించి నిజజీవితంలో నేనేమీ చేయలేకపోయాను. అందుకే ఓ చిన్న డాక్టరు, డూలిటిల్, పాత్రను కాల్పనిక జగత్తులో సృష్టించాను. జంతువులతో సంభాషించి, కష్టసుఖాలు తెలుసుకుని వాటి బాధలు తీర్చాలనే ఆశను ఆ పాత్ర ద్వారా నెరవేర్చుకున్నాను."

లాఫ్టింగ్ సైనికుడు కాడు. సివిల్ ఇంజనీర్. ఇంగ్లండులో పుట్టి కెనడాలో, పశ్చిమాఫ్రికా రైల్వేలో, క్యూబన్ రైల్వేలో పనిచేసి అమెరికాలో రచయితగా స్థిరపడ్డాడు. ఇంజనీరింగు నేపథ్యం వల్లనేమో తన మొదటికథకు - "కల్వర్ట్‌స్ అండ్ ఎ బ్రి(డ్)జ్" అని పేరుపెట్టాడు. 1914లో మొదటిప్రపంచ యుద్ధం ప్రారంభమయే నాటికి అతనికి పెళ్లయి, ఇద్దరు పిల్లలు పుట్టారు. బ్రిటిషు సైన్యపు లెఫ్టినెంట్‌గా న్యూయార్క్‌లో కొంతకాలం పనిచేశాక ఫ్లాండర్స్‌లోను, ఫ్రాన్సులోను యుద్ధభూమికి వెళ్లమని ఆదేశాలు వచ్చాయి.



అక్కడ పనిచేసేటప్పుడే డా॥ డూలిటిల్ పాత్ర ఆవిర్భవించింది. తన పిల్లలకు ఉత్తరాలు రాసేటప్పుడు డూలిటిల్ సాహసాలు కథలు కథలుగా రాసి పంపేవాడు. 1918లో యుద్ధంలో గాయపడడంతో ఇంటికి పంపేశారు. 'ఈ ఉత్తరాలన్నీ కథలుగా మార్చి పుస్తకంగా వేయకూడదా?' అన్నది అతని భార్య. దాంతో 1920 నుండి డూలిటిల్ పుస్తకాలు వెలువడసాగాయి.

పిల్లలు ఆ పుస్తకాలను విపరీతంగా ఆదరించారు. షెర్లాక్‌హోమ్స్ విషయంలో జరిగినట్లే డూలిటిల్ కూడా నిజమైన మనిషనుకుని ఉత్తరాలు రాసేవారు. కొంతమంది పిల్లలు సలహాలిచ్చేవారు. మరిన్ని కథలు రాయడానికి అవి లాఫ్టింగ్‌కు ఉపయోగపడేవి కూడా! షెర్లాక్‌హోమ్స్‌తో మరో పోలిక కూడా ఉంది. 'వాయేజెస్ ఆఫ్ డా॥డూలిటిల్', 'డా॥డూలిటిల్స్ గార్డన్', 'డా॥డూలిటిల్ ఇన్ ద మూన్' వంటి పుస్తకాలు రాశాక ఇక ఆ సీరీస్ ముగించేద్దామనుకున్నాడు లాఫ్టింగ్. కానీ పాఠకులు గొడవ పెట్టడంతో 'డా॥ డూలిటిల్స్ రిటర్న్' 'డా॥ డూలిటిల్ అండ్ ద సీక్రెట్ లేక్' కూడా రాయవలసి వచ్చింది. కథలు రాయడంతో బాటు వాటికి బొమ్మలు కూడా వేసేవాడాయన.

1947లో తన 61 వ యేట మరణించిన లాఫ్టింగ్ - 'హాసం'లో చిత్ర పరిచయం పేరిట ప్రారంభించిన ఈ శీర్షికపైన రాసిన 'పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం' అనే వాక్యాలను చూసివుంటే చాలా సంతోషించి వుండేవాడు. ఎందుకంటే డూలిటిల్ కథలకు బాలసాహిత్యంగా ముద్ర పడడం ఆయన కిష్టం ఉండేది కాదు. తోటిజీవులతో అనుబంధం బాల్యంలోనే కాక ఆజన్మాంతం ఉండాలని అనేవాడాయన! ఆయన కథలపై ఆధారపడి తీసిన ఈ సినిమా కథ చదివినవారు ఆయన్ని ఒకసారి స్మరించుకోవాలని అనిపిస్తే చాలు ఈ శీర్షిక ఉద్దేశ్యం నెరవేరినట్లే!

- ఎమ్బీయస్ ప్రసాద్,
- మంజీర




విడుదల : మధుర ఎంటర్‌టైన్‌మెంట్
వెల : 38/-




నటుడవుదామని వచ్చి, సంగీత దర్శకుడిగా శ్రీకారం చుట్టి, 'క్లీన్‌యు' అనే దుర్భేద్యమైన ప్రాకారంతో ఫామ్లీ దర్శకుడిగా మంచిపేరుని సంపాదించుకున్న యస్వీ కృష్ణారెడ్డి తొలి నుంచి తన చిత్రాలకు సంగీత నిర్వహణ బాధ్యతలను తనే నిర్వహిస్తూ వచ్చారు. అయితే గత సంవత్సరం ఆయన దర్శకత్వంలో విడుదలైన 'పెళ్ళాం ఊరెళితే' సినిమాకు మణిశర్మ సంగీతాన్ని ఇవ్వడం ఓ రికార్డు కాగా ఈ సంవత్సరం 'లేతమనసులు' సినిమాకి కీరవాణి సంగీతాన్నివ్వడం మరో రికార్డు. శ్రీకాంత్, గోపిక, కళ్యాణి కాంబినేషన్లో నిర్మించబడిన ఈ చిత్రానికి విజయ బాపినీడు గారి దగ్గర పరిశ్రమకు సంబంధించి ఎంతో అనుభవాన్ని గడించిన కొసరాజు రాజేంద్రబాబు సమర్పకుడు. కృష్ణారెడ్డి -కీరవాణి కాంబినేషన్‌కి సంబంధించి ఓ రికార్డుగానే కాకుండా పాటల పరంగా కూడా రికార్డు బ్రేక్ చేసే స్థాయిలోనే వచ్చిందీ చిత్రం ఆడియో.

ఆడియోలో తొలిపాటగా వినిపించే 'తొలి తొలి కోరిక తొంగి చూస్తూంటే కంటికి కరువయ్యె కునుకమ్మా' పాటను సంగీత దర్శకుడు కీరవాణి రాయగా టిప్పు, మధుశ్రీ పాడేరు. మణిరత్నం 'యువ'లో 'కత్తిలాంటి కోడి' పాట ద్వారా శ్రోతలనాకర్షించిన మధుశ్రీకి లభించిన మరో మంచి పాట యిది. పాటలో సంగీత దర్శకుడిగా కీరవాణి చేసిన కొన్ని తమాషాలు ఉన్నాయి. పాట పల్లవి మొదలవడానికి జస్ట్ ఓ పది సెంటీమీటర్లు రివైండ్ చేసుకుని (నంబరింగు ఉంటే ఓ రెండు నంబర్లు వెనక్కి వెళ్ళి) వినండి. అక్కడ వినిపించే ఫ్లూట్ బిట్ పూర్తయ్యి 'తొలి తొలి కోరిక' మొదలవబోతుంటే ఆపేసి అలా ఆలపించుకుంటూ వెళ్ళి చూడండి. 'ఆత్మీయులు' లో రాజేశ్వరరావుగారు ట్యూన్ చేసిన 'చామంతి ఏమిటే ఈ వింత' అనే పాటలోకి వెళ్ళిపోతారు. అలాగే 'అందుకే....' అని వచ్చిన దగ్గర మొదట చేసినట్టే చేసి చూడండి. బాగా పరిచయమైన ఓ వరస గుండెని ఉక్కిరి బిక్కిరి చేసేసి 'గుండె గొంతుకలోన కొట్లాడుతాది' అనే ఫీలింగ్‌ని కలగచేస్తుంది. రివైండ్ అండ్ ప్లే, రివైండ్ అండ్ ప్లే చేసుకుంటూ ఉంటే - 'ఒడిలో- చెలి మోహనరాగం' (బ్రతుకు తెరువులోని 'అందమె ఆనందం' పాట) అనే లైను స్ఫురించి మనసుకి హాయిగా అనిపిస్తుంది. పల్లవి చివర్న వచ్చే 'ఆడుకుందామా తెగ కూడుకుందామా' ట్యూన్ వింటే 'శ్రీమంతుడు' లోని 'బులిబులి ఎర్రని బుగ్గలదానా' పాటలో 'మరచి పొయ్యావా అయ్యో మారిపోయ్యావా' గుర్తొస్తుంది. పాట చివర్న 'ఒంటికి బరువయ్యె పైటమ్మా' అనే లైన్‌లో 'పైటమ్మా' అనే మాటని పలికించిన తీరు-'భలేతమ్ముడు' లోని 'గోపాలబాల నిన్నేకోరి నీ సన్నిధి చేరి' పాటలో 'కృష్ణమ్మా' అంటూ రఫీ పాడిన విధానాన్ని జ్ఞప్తికి తెస్తుంది. కొన్ని కొన్ని పాటల్లో సంగీత పరంగా చిన్నప్పట్నించీ మనకిష్టమైన బిట్‌లు కొన్ని వుంటాయి. ఆ ఫ్రేజ్‌ల్ని కలుపుకుంటూ మరోపాట అల్లుకోవాలనిపిస్తుంది. లేదా ట్యూన్ చేసిన పాటలో మనకి బాగా ఇష్టమైన ఆ ఫ్రేజ్‌లు జొప్పించడానికి అవకాశమో వేరే దానికి దగ్గరగా పాటలో మిగతా ట్యూన్ కుదరడమో లాంటిది జరుగుతూ ఉంటుంది. అలాంటిదే ఈ పాటలో జరిగుంటుంది. ఎందుకంటే సంగీత దర్శకుడిగా కీరవాణి శక్తిసామర్థ్యాలు, నిజాయితీ ఎటువంటివో ఎంతటివో శ్రోతలకు బాగా తెలుసు. ఆయనతో ఈ సమీక్షకుడికి వ్యక్తిగతంగా గల పరిచయాన్ని, చనువుని పురస్కరించుకుని కూడా ఈ వాక్యాలను వ్రాయటం జరిగిందని పాఠకులకు సవినయ మనవి. ఇక మిగిలిన పాటలో 'మారాకు చెయ్యొద్దురా మాటల్తో చంపొద్దురా' దగ్గర ట్యూన్ చాలా బావుంది. ఈ పాట రచయితగా కీరవాణి గురించి చెప్పాలంటే భవిష్యత్తులో ఏదో ఒక చిత్రానికి లేదా ఏదో ఒక చిత్రం నుండి 'పాటలు, సంగీతం: కీరవాణి' అనే టైటిల్ కార్డుని మనం కచ్చితంగా చూస్తామనిపిస్తుంది.

భువనచంద్ర రాయగా కీరవాణి, బిందు పాడిన 'కనులకేల ఎరుపు రంగు, బుగ్గలకే చాలులే' పాటలో మెలోడీ - సంగీత పరంగా సాహిత్యపరంగా కూడా పెద్దపీట వేసుక్కూచుంది. సాహిత్య పరంగా మెలోడీ అనటం ఎందుకంటే రాసింది భువనచంద్ర కనుక. భార్యా భర్తల మధ్య, ప్రేమికుల మధ్య వచ్చే ప్రణయ గీతాలలో శృంగారం పాళ్ళు ఆయన నుంచి మన వాళ్ళు ఎంతగా రాబట్టుకుంటారో అందరికీ తెలుసు. కూతలోని తీపిని చెవులతో తినాలనుకోవటం, బుగ్గలలో ఎరుపుని కనులవరకు రానివ్వద్దని తెలపటం ఇవన్నీ మంచి ఎక్స్‌ప్రెషన్లు. ఇక ఈపాటకు కీరవాణి ఇచ్చిన ట్యూన్ వింటే శాంతారామ్ సినిమాలు తీసే రోజుల్లో ఈయన ఈ స్థాయిలో ఉన్నట్టు ఉండి ఉంటే మరో 'నవరంగ్' తీసుండే వాడని కచ్చితంగా చెప్పొచ్చు. కావాలంటే 'నవరంగ్'లోని పాటల్ని ఆడియో ద్వారా గానీ, వీడియో ద్వారా గాని విని వెంటనే ఈ పాటని విని చూడండి. సృజనాత్మక సారూప్యం ఎంతగా ఉందో అర్థమవుతుంది. ట్యూన్‌ని ఎక్స్‌ప్రెసివ్‌గా పాడడం అంటే తెలుసుకోడానికి ఈ పాట ఓ ఉదాహరణ. అయితే పాట చివర్న వచ్చే 'కూజితాలను' ఈ ప్రశంసల ఖాతాలో జమచేయరాదు. ఎందుకంటే అటువంటివి నలుగురిలో పాడడానికి ఇబ్బందిగా ఉంటాయి. గాయని బిందుకి మంచి భవిష్యత్తు ఉందనిపిస్తుంది.

భువనచంద్ర రాయగా శ్రియాఘోషల్, బృందం పాడిన 'కుర్‌కు-కూర్ కుకుకు' పాటలో గాయని ప్రతిభ ప్రముఖంగా కనబడడానికి కారణం చక్కగా అమరిన ఇంటర్‌లూడ్స్! అందరి ప్రతిభ సమన్వయ పరిస్తేనే ఇలాంటి పెర్ఫార్మెన్స్ ఓరియెంటెడ్ సాంగ్స్ శ్రోతల దృష్టిని ఆకర్షిస్తాయి. ఆ సమన్వయం ఈ పాటకు బాగా కుదిరింది.

'తాన నాన' లతో సునీత ఆలపించిన చిన్న బిట్‌తో బి సైడు ప్రారంభమవుతుంది. మధ్యలో 'లేత మనసా' అంటూ వస్తుంది. ఈ ఖండికకు రచయితగా చిత్రాన్ని సమర్పించిన కొసరాజు రాజేంద్రబాబుగారి పేరులో ఇంటిపేరుని మాత్రమే వేశారు. ఈ బిట్ లో వయొలిన్‌తో వచ్చే ఓ చిన్న ఇంటర్ లూడ్ చెప్పుకోదగ్గ స్థాయిలో ఉంది. వాయించినది అమల్‌రాజ్ అని కీరవాణి తెలిపారు. ఈయన యాభై కి పైగా వాద్యాలను వాయించగలడట.

కీరవాణి,చిత్రపాడిన 'తన్నానా తన్నానా బళ్ళోనా దేవుడి గుళ్ళోనా' పాటకు కూడా కీరవాణే రచయిత. రచనాపరంగా ఆయన గురించి మొదటిపాటకు చెప్పుకున్నట్టే చెప్పుకోవాలి. పాడుకోడానికి హాయిగా, వీలుగా ఉండే ట్యూన్ జతపడింది ఈ పాటకి. 'ఇళయరాజా అయితే ఈ పాటకు ఎలా ట్యూన్ చేస్తారో అలా చేద్దాం' అనుకుని ట్యూన్ కట్టినట్టు అనిపిస్తుంది. 'వాన చినుకుల్లా రాలి వరద పొంగుల్లా తేలి తేలి కలలేవో మురిపిస్తాయని' అనే వాక్యంకి అమరిన ట్యూను, జతపడిన రిథమ్ వింటే ఎవరికైనా సరే ఈ అభిప్రాయమే కలుగుతుంది.

భువనచంద్ర రాయగా కీరవాణి, సాధనాసర్గమ్ పాడిన 'ఆనాటి మన చెలిమి... కాదా ఒక కల' పాటకి మిగిలిన పాటల కన్నా ఆయుష్షు ఆదరణా ఎక్కువ అనిపిస్తుంది. మోహన రాగం ప్రధాన రాగంగా సాగిన ఈపాటను బాగా ఆకళింపు చేసుకుంటే కీరవాణి మోహనరాగాన్ని ఉపయోగించుకునే పద్ధతి మీద మంచి పట్టు దొరుకుతుంది. అలాగని అన్యస్వర ప్రయోగాలు, రాగాతిక్రమణలు లేకుండా పాటంతా 'ప్యూర్‌మోహన' అని చెప్పడానికి వీల్లేదు. జనార్షణ కోసం అవన్నీ ఉన్నా మోహనరాగం చాలా ప్రధానంగా వినిపిస్తుందీపాటలో. మోహనరాగాన్ని ప్రయోగించటంలో రాజేశ్వరరావు, పెండ్యాల, ఘంటసాల వంటివారికి ఒక శైలి ఉంది. ఆ శైలిని పట్టుకుంటే ఏ పాట ఎవరు ట్యూన్ చేశారో చెప్పేయొచ్చు. అలా మోహనరాగానికి సంబంధించినంత వరకు కీరవాణికి ఓ నడక ఉంది. ఆ నడకలో సాగిన ఈపాట ఆ రాగంలో ఆయన శైలిని మనకు బాగా అందిస్తుంది.

కృష్ణారెడ్డిగారికి, కీరవాణికి గల ఇమేజ్‌ని మరింత పెంచేస్థాయిలో అమరిన ఈ ఆడియో మధుర ఎంటర్ టెయిన్‌మెంట్ ద్వారా విడుదలైంది. ●

రఫీ గాన వైదుష్యాన్ని వివిధ కోణాలలో ప్రతిబింబింప చేసే వ్యాస పరంపర

# రఫీ హాస్యగీతాలు



3

మహమ్మద్ రఫీ తొలి రోజుల పాటలు వింటే (తేరే కూచేమే అరమానోంకి దునియా, యహ్ బదలా వఫా కా వంటివి) ఇతని కంఠ స్వరానికి గంభీరమైనవీ, మృదువైనవీ, విషాద భరితమైనవీ బాగుంటాయని అనిపిస్తుంది. కిశోర్, మన్నాడేల స్వరాలు వింటేనే హాస్యానికి పనికొస్తాయని తెలిసిపోతుంది. అయితే, రఫీ పాడినన్ని హాస్య గీతాలు మరే గాయకుడూ పాడలేదు. ఆ కంఠస్వరం దిలీప్ కుమార్‌తో ఎంత బాగా కలిసిపోయిందో, జానీవాకర్‌తోను అలాగే కలిసిపోయింది. రాజేంద్రకుమార్ విషాదంతో ఎలా రగిలిపోయిందో, మెహమూద్ వినోదంతో అంత కితకిత లాడించింది. భగవాన్ నుంచి - జూనియర్ మెహమూద్ వరకూ హాస్య నటులందరికీ రఫీ గళం అద్భుతంగా పలికింది.

రఫీకి కంఠస్వరం ఒక సాధనం. అతను సాధకుడు. దాని చేత ఏమైనా పలికించగలడు. తద్వారా తను ఎంతైనా అనుభవించగలడు. శ్రోత చేత దేన్నయినా అనుభవింపజేయగలడు. కథానాయకుల నటనను, హావభావాలను దృష్టిలో పెట్టుకుని, వారికి తగినట్లుగా పాడినట్లే, హాస్య నటుల్లో వైవిధ్యాన్ని కూడా అంత బాగానూ ప్రతిధ్వనించగలిగాడు. భగవాన్, ఆఘా, జానీవాకర్, మెహమూద్, రాజేంద్రనాథ్, దేవెన్ వర్మా, జగ్‌దీప్, ఐ.ఎస్. జోహర్, జలాల్ ఆఘా, జూనియర్ మెహమూద్, చివరికి ఒకటో రెండో సినిమాలు చేసిన జానీ విస్కీ.. ఇలా ప్రసిద్ధ హాస్య నటులందరికీ రఫీ గళమే.

అయితే, హాస్యనటులందరిలోనూ జానీవాకర్‌తో రఫీ స్వరానికి ఉన్న అనుబంధం మరెవ్వరికీ లేదంటే అతిశయోక్తి కాదు. సినిమాలో నాయకుడెవరైనా సరే, అందులో హాస్య పాత్ర జానీవాకర్ వేస్తుంటే, అతనికి కూడా రఫీయే పాడాలి అన్నది ఒక సంప్రదాయంగా మారిపోయింది. దానికి తగినట్లుగానే రఫీ కూడా హీరోకు, కమెడియన్ కూ సమాన ప్రమాణంలో పాటలు పాడ్డంలో అనితర సాధ్యమైన కళా కౌశలాన్ని ప్రదర్శించాడు.

'ప్యాసా'లో గురుదత్ కోసం **'యే దునియా అగర్ మిల్ భి జాయే తో క్యాహై'** అని గుండెల్ని పిండేసిన రఫీ, జానీ వాకర్ కోసం **'సర్ జో తేరా చకరాయే , యాదిల్ డూబా జాయే, అజా ప్యారే పాస్ హమారే కాహే**

**చిత్రం : గుమ్‌నామ్**

రచన : శైలేంద్ర  సంగీతం: శంకర్‌జైకిషన్  గానం : రఫీ, మెహమూద్

ఖయాలోంమే... ఖయాలోంమే... ఖయాలోంమే...ఖయాలోంమే....
జై హంగామా... కహా భాగ్‌రీ తూ.. యా అల్లా.. కాలేసే డర్ గయే క్యా...
హమె కాలే హైతో క్యాహువా దిల్‌వాలే హై
హమె కాలే హైతో క్యాహువా దిల్‌వాలే హై
హమె తేరే తేరే తేరే చాహనే వాలే హై ॥హమె కాలే॥
యే గోరే గాలా తందానా
యే రేషిమి బాలా తందానా
యే సోలా సాలా తందానా
హై తేరే ఖయాలా తందానా ॥యే గోరే॥
హమ్ తేరే తేరే తేరే చాహనే వాలే హై ॥హమె కాలే॥
తుమె కిదర్ కో జానై తందానా
క్యూ పాస్‌నా ఆతై తందానా
క్యా మారీయా బాతా తందానా
దిల్ తోడియా జాతా తందానా ॥తుమే॥
హమ్ తేరే తేరే తేరే చాహనే వాలే హై ॥హమె కాలే॥
హమె మానా గరీబ్ హై తందానా
సూరత్ సే అజీబ్‌హై తందానా
అరే ఫిర్ భీ నసీబ్‌హై తందానా
యే తేరే కరీబ్‌హై తందానా ॥హమె॥
హమ్ తేరే తేరే తేరే చాహనే వాలే హై ॥హమె కాలే॥



ఘబరాయ్' అని అంత ఉల్లాసంగానూ మనల్ని అలరించాడు. ఇదే పంథాలో 'మధుమతి'లో దిలీప్ కోసం '**టూటే హువే ఖాబోనే**' జానీవాకర్ కోసం '**జంగల్ మే మోర్ నాచా కిసీ నే న దేఖా**' పాట్లంలో రఫీ చూపిన వైవిధ్యం అపూర్వం.

అలాగే 'మిస్టర్ అండ్ మిసెస్ 55'లో గురుదత్ కోసం '**ఉధర్ తుమ్ హసీ హో ఇధర్ దిల్ జవాహై**' అనడంలోని సున్నితత్వం, జానీ వాకర్ కోసం '**జానే కహా మేరా జిగర్ గయా జీ -అభీ అభీ యహి థా కిధర్ గయా జీ**' అనడంలోని అల్లరితనం అద్భుతం.

మామూలుగా హీరో కు రఫీ పాడి, హాస్య నటుడికి మన్నాడే పాడ్డం రివాజుగా ఉన్న రోజుల్లోనూ, జానీవాకర్ విషయంలో దీనికి పూర్తి వ్యతిరేకంగా జరిగింది. 'చోరి చోరి'లో రాజ్ కపూర్ పాటలన్ని మన్నాడే పాడితే, జానీవాకర్‌పై చిత్రించిన '**ఆల్ లైన్ క్లియర్**' కుమాత్రం రఫీ వచ్చేశాడు. రఫీ, జానీవాకర్‌ల అనుబంధం అలాంటిది. ఇందాకే చెప్పినట్టు కథానాయకుడికి రఫీ పాడిన సినిమాల్లో కమెడియన్ జానీవాకర్ అయితే మాత్రం మళ్ళీ రఫీయే పాడాలి. దీనికి అనేక ఉదాహరణలు దొరుకుతాయి. 'చంఘిజ్ ఖాన్' లో ప్రేమనాథ్ కోసం '**మొహబ్బత్ జిందా రెహతీహై**', జానీవాకర్ కోసం '**యా హోకర్ రహేగా**' 'నయా దౌర్ 'లో దిలీప్ కుమార్ కోసం '**మాంగ్ కే సాథ్**' మొదలైనవీ, జానీవాకర్ కోసం '**మై బొంబాయ్ కా బాబూ నామ్ మేరా అంజానా**', 'సి.ఐ.డి.'లో దేవ్ ఆనంద్ కోసం '**ఆంఖోంహి ఆంఖోమే**' జానీవాకర్ కోసం '**ఏ దిల్ హై ముష్కిల్ జీనా యహా**' 'దూర్ కీ ఆవాజ్ ' లో జాయ్‌ముఖర్జీ కోసం '**హుస్న్ సే చాంద్ భీ శరమాయా హై**', జానీవాకర్ కోసం '**ఏక్ ముసాఫిర్ కో దునియామే క్యా చాహియే, సిర్ఫ్ థోడీసీ దిల్లు మే జగా చాహియే, ఖైర్ జావూ.....**' ఇలా ఎన్నెన్నో.

ఒక్క మాటలో చెప్పాలంటే కథానాయకుల్లో షమ్మీ కపూర్ తో రఫీ ఎలా మమేకం చెందాడో అదే స్థాయిలో హాస్యగాయకుల్లో జానీవాకర్ తో చెందాడన్నది అక్షర సత్యం. 1956లో 'ఛూమంతర్'లో కథానాయకుడిగా, జానీ వాకర్ కోసం పాడిన హిట్ పాట '**గరీబ్ జాన్ కే హమ్ కో న తుమ్ మిటాదేనా - తుమ్హీనే దర్ద్ దియాహై తుమ్హీ దవాదేనా**' నుంచి 1969లో 'ప్యార్ కా సపనా' చిత్రంలోని '**హసీనోంకీ ఆంఖోంకా తారా రహూంగా**' వరకూ, జానీవాకర్ హాస్య నటుడిగా రాజ్యమేలినన్ని రోజులూ అతని కంఠం రఫీయే. జానీవాకర్ ఉచ్చారణను కూడా రఫీ ఎంత బాగా అనుకరించేవాడో, 1957లో వచ్చిన 'మిస్టర్ ఎక్స్' చిత్రంలోని '**లాల్ లాల్ గాల్ జాన్ కే హై లగూ, దేఖ్ దేఖ్ దేఖ్ దిల్ పె రహే కాబూ**' ను, 1968 లో వచ్చిన 'దునియా' సినిమాలోని '**తూహీ మేరీ లక్ష్మీ, తూహి మేరీ చాయా, దునియామే ఆయా తో తెరె కారణ్ ఆయా-లక్ష్మీ చాయా**' అన్న పాటను గుర్తు తెచ్చుకుంటే అర్థమవుతుంది. అందుకే రఫీ చనిపోయినపుడు దిలీప్ కుమార్, షమ్మీ కపూర్‌లతో పాటు జానీవాకర్‌ను కూడా జర్నలిస్టులు ఇంటర్వ్యూ చేశారు.

మెహమూద్ తనంతట తాను మన్నాడే తనకు పాడాలని సూచించడం వల్ల, అతనికి రఫీ అంత ఎక్కువ పాటలు పాడలేదు. అయితే, మెహమూద్ కు రఫీ కేవలం హాస్య గీతాలనే కాక, శాస్త్రీయ సంగీతం బాణీలు, తాత్విక గీతాలు కూడా పాడడం విశేషం. 'నమస్తే జీ', 'సాంజ్ ఔర్ సవేరా', 'శబనమ్' చిత్రాల్లో మెహమూద్ పాత్రకు నవరసాల పాటలను రఫీ అందించాడు. వీళ్ళ కాంబినేషన్‌లోని హాస్యగీతాల్లో ఎక్కువ పాటలు హిట్లే. 'ఛోటి బహన్' లోని '**మై రిక్షా వాలా, మై రిక్షావాలా-హై చాంద్ కా బరాబర్ యే దో టాంగే వాలా**', '**ఓ గోరీ జుల్మను కరే జుల్ఫ్ కా బిఖర్ జానా**' (మై ఔర్ మేరా భాయి), '**హమ్ కాలే హైతో క్యా హువా దిల్ వాలే హై- హమ్ తేరే తేరే తేరే చాహనే వాలే హై**' (గుమ్ నామ్), '**జాజా రే జాదివానే జా**' (ఆశాతో కలిసి, గృహస్థీ సినిమాలో ), '**అజ్ హూన ఆయే బాల్‌మా సావన్ బీతా జాయే**' (సాంఝ్ ఔర్ సవేరా-సుమన్ కళ్యాణ్ పూర్ తో కలిసి) '**పర్ దా హటాదే, ముఖ్ డా దిఖాదే -తూమేరే దిల్‌కా దుఖడా మిటాదే**' (ఆశాతో కలిసి మాధవి చిత్రంలో) ఇలా మెహమూద్‌తో అనేక ప్రసిద్ధ గీతాలున్నాయి.

ముఖ్యంగా' **హమ్ కాలే హై తే క్యా హువా**' మెహమూద్ ని టాప్ కమెడియన్‌గా నిలబెట్టిన పాట. మెహమూద్ పాటల అభినయానికి రఫీ ఒక దిశా నిర్దేశం చేసిన పాట. అప్పట్నుంచీ 'ప్యార్ హీ ప్యార్ 'లో '**హమ్ ఆగయే ఫిర్ డర్ కాహే కా**' వరకూ మెహమూద్ పాటల దృశ్యాల్లో ఈ అభినయాన్ని చూడవచ్చు. 1953 నుంచీ అప్పటి ప్రముఖ హాస్య నటుడు

**చిత్రం : ప్యాసా**

రచన : సాహిర్ సంగీతం: సచిన్‌దేవ్ బర్మన్ గానం : రఫీ

సర్ జో తేరా చకరాయే, యా దిల్ డూబా జాయే
ఆజా ప్యారే పాస్ హమారే
కాహే ఘబ్‌రాయ్, కాహే ఘబ్‌రాయ్ ॥సర్ జో॥

తేల్ మేరా హై ముస్కీ, గంజ్ రహే న ఖుస్కీ
జిస్‌కే సర్ పర్ హాథ్ ఫిరా దూ.. చమ్‌కే కిస్‌మత్ ఉస్కీ ॥తేల్॥
సున్ సున్ సున్, అరే బేటా సున్, ఇస్ చంపీ మేఁ బడే బడే గున్ ॥2॥
లాఖ్ దుఖోం కీ ఏక్ దవా హై, క్యూ నా ఆజ్‌మాయే
కాహే ఘబ్‌రాయ్, కాహే ఘబ్‌రాయ్ ॥సర్ జో॥

ప్యార్ కా హోవే ఝగడా, యా బిజినెస్ కా హో రగడా
సబ్ లఫ్‌డోం కా బోఝ్ హాటే జబ్ పడే హాథ్ ఇక్ తగడా ॥ ప్యార్॥
సున్ సున్ సున్...అరే బాబూ సున్, ఇస్ చంపీ మేఁ బడే బడే గున్ ॥2॥
లాఖ్ దుఖోం కీ ఏక్ దవా హై, క్యూ నా ఆజ్ మాయే
కాహే ఘబ్‌రాయ్... కాహే ఘబ్‌రాయ్... ॥సర్ జో॥

నౌకర్ హో యా మాలిక్, లీడర్ హో యా పబ్లిక్
అప్‌నే ఆగే సభీ ఝుకేతే హై క్యా రాజా క్యా సైనిక్ ॥నౌకర్॥
సున్ సున్ సున్...అరే రాజా సున్, ఇస్ చంపీ మేఁ బడే బడే గున్ ॥2॥
లాఖ్ దుఖోం కీ ఏక్ దవా హై, క్యూ నా ఆజ్ మాయే
కాహే ఘబ్‌రాయ్... కాహే ఘబ్‌రాయ్...

సర్ జో తేరా చకరాయే, యా దిల్ డూబా జాయే
ఆజా ప్యారే పాస్ హమారే
కాహే ఘబ్‌రాయ్,



**చిత్రం : అందాజ్**
**సంగీతం: శంకర్ జైకిషన్ గానం : రఫీ , సుష్మాశ్రేష్ఠ**

సున్‌లో సునాతా హూ తుమ్ కో కహానీ
రూఠోనా హమ్‌సే వో... గుడియోంకీ రానీ...
రే మామ రే మామ రే... రే మామా రే మామా రే... ॥సున్‌లో సునా॥
హమ్‌తో గయే బాజార్ మేఁ లేనే కో లట్టూ ॥3॥
లట్టు వట్టూ కుఛ్ నా మిలే పీఛే పడా టట్టూ
రే మామ రే మామ రే... రే మామా రే మామా రే... ॥సున్‌లో సునా॥
హమ్‌తో గయే బాజార్ మేఁ లేనే కో రోటీ ॥3॥
రోటి వోటి కుచ్‌నా మిలే పీఛే పడీ మోటీ
రే మామ రే మామ రే... రే మామా రే మామా రే...
సున్‌లో సునాతా హూ తుమ్ కో కహానీ
రూఠోనా హమ్‌సే వో... గుడియోంకీ రానీ...
రే మామ రే మామ రే... రే మామా రే మామా రే...
రే మామ రే మామ రే... రే మామా రే మామా రే...



భగవాన్ కు రఫీ యే ప్రధాన గాయకుడు. '**నరమ్ గరమ్ యే చెన్నే**' (రంగీలా), '**నజరోనే మేరా హమేబేకరార్**' (జింబో షహర్ మే) మొదలైన ఎన్నో పాటలు భగవాన్‌వి హిట్టయ్యాయి. అలాగే 'జోహర్ మెహమూద్ ఇన్ గోవా' లో ఐ.ఎస్. జోహర్, మెహమూద్ ఇద్దరికీ, 'జోహర్ ఇన్ బాంబే' లో జోహర్‌కు రఫీ చక్కటి హాస్య గీతాలు పాడాడు. 1960 దశకంలో ఏ నటుడికైనా రఫీ గొంతే కావాలి కనక, ఒకే సినిమాలో నేపథ్య గీతానికీ, నాయకుడికీ, హాస్య నటుడికీ అన్నింటా తానై రఫీ పాడిన పాటలెన్నో. హాస్య గీతాల్లో రఫీ ప్రకటించిన హావభావాలు సన్నివేశానికి, పాటలోని మాటలకు అతికినట్లుగా ఉండేవి.

మామూలుగా హాస్య గీతాలంటె గుర్తొచ్చేది కిశోర్ కుమార్ చేసే యోడ్లింగ్ ధ్వనులు. (మై హు ఝుమ్ ఝుమ్రూ). నిజానికి రఫీ కూడా 1957లోనే ఈ ప్రక్రియ చేసాడని చాలా మందికి తెలీదు. 'ఆగ్రారోడ్' సినిమాలో, రోశన్ సంగీత దర్శకత్వంలో గీతాదత్‌తో పాడిన '**ఉన్ సే రిప్పీ టిప్పీ హోగయి హా హా హా యానీ బాతే పక్కీ హోగయి ఓ ఓ ఓ ఆగే ఆగే దేఖియే హోగా హోగా క్యా**' పాటలో రఫీ ఆహ్లాదకరమైన యోడ్లింగ్ విని తీరాల్సిందే . రఫీ హాస్య గీతాల్లోని మరో ప్రత్యేకత హీరోలకు పాడిన హాస్య గీతాలు, రాజ్‌కపూర్, షమ్మీ కపూర్, సంజీవ్ కుమార్, జాయ్ ముఖర్జీ, దేవ్ ఆనంద్, చివరికి దిలీప్‌కుమార్ కూడా హాస్య గీతాలు సినిమాల్లో అభినయించారు. వాటికి రఫీ ప్రాణం పోశాడని వేరే చెప్పనక్కర్లేదు. ఉదాహరణకు బిశ్వజిత్ అభినయంలో '**ఏప్రిల్ ఫూల్ బనాయా**'( ఏప్రిల్ ఫూల్) , జాయ్ ముఖర్జీకి '**బడేమియా దీవానే**', '**దునియా పాగల్ హై**' (శాగిర్ద్), షమ్మీ కపూర్‌కు '**అయ్యయ్యా సుకు సుకూ**' (జంగ్లీ), దేవ్ ఆనంద్‌కు '**చలీ యే ఫౌజ్ హమారీ హై - చల్ చలంచల్ చల్లంచల్**' (ఏక్ కే బాద్ ఏక్), దిలీప్‌కుమార్ కు '**నైన్ లడ్ జయ్ హై తో మన్వా మా కసక్ హోయ్ బేకరీ**' (గంగా జమునా).

రఫీ హాస్య గీతాల్లో బాగా ప్రసిద్ధి చెందినవి పిల్లల పాటలు. వాటిని అతను పాడిన తీరు పిల్లలకే కాదు, పెద్దలకు కూడా మనోరంజకంగా ఉంటుంది. '**హమ్ భీ అగర్ బచ్చే హోతే, నామ్ హమారా హోతా బబులూ**' (దూర్ కీ ఆవాజ్) ,' **రే మామా రే మామా రే - సున్‌లో సునాతా సునాతా హూ తుమ్ కో కహానీ** ' (అందాజ్) , '**చక్కే మే చక్కా, చక్కే పే గాడి** '(బ్రహ్మచారి) వంటివి ఎన్నో పాటలు సూపర్ హిట్లయ్యాయి.

రఫీ హాస్య గీతాల్లో యుగళ గీతాలు కూడ చాలా ఉన్నాయి. ముఖ్యంగా షంషాద్ బేగమ్, గీతా దత్, ఆశాభోంస్లే హాస్యంలో రఫీకి మంచి జోడీలు. ప్రత్యేకించి హాస్య గీతం కాకపోయినా '**దీవానా మస్తానా హువాదిల్ జానే కహా హోకే బహార్ ఆయి**' పాటలో రఫీ, ఆశా పరస్పరం వెక్కిరించుకుంటూ పాడిన పద్ధతి అద్భుతంగా ఉంటుంది. జీవితాన్ని, పాటని ఆద్యంతం ఎంజాయ్ చేసిన రఫీకి హాస్యం పాడ్డం పెద్ద సమస్య కాలేదు. ఒకసారి నౌషాద్ అన్నట్టు అతను తన పాటల్లోనే అన్ని రసాలను, అన్ని రసాల పర్యవసానం అయిన శాంతిని పొందగలిగాడు. ఎప్పుడూ చిరునవ్వు ముఖాన్నే ప్రపంచానికి చూపించిన రఫీ '**డర్ లగే తో గానా గా, డర్ లగేతో గానా గా, ఐసా భీ హో...వై సా భీ హో...**'(యార్‌మేరా) వంటి పాటలతో మనల్ని కడుపుబ్బ నవ్వించాడు. మేటి కథానాయకులకు పాడిన తను, బ్రహ్మచారి, జూనియర్ మెహమూద్ వంటి చిన్న నటులకు పాడడం నామోషీగా ఏనాడు భావించలేదు. అతనికి పాటంటే పాటే. అందుకే జానీవాకర్ ఒక టి.వి. ఇంటర్వ్యూలో మాట్లాడుతూ '1970 తర్వాత నాకు పెద్దగా వేషాలు లభించలేదు. కానీ 1980 లో రఫీ చనిపోయాక నాకు పాత్ర దొరికినా నా గొంతు పోయింది కదా అని బాధపడ్డాను. నేను హాస్య నటుడిగా సాధించిన విజయంలో రఫీ పాత్ర చాలా కీలకమైంది. అతను నాకు పాడకపోతే ప్రజలు నన్ను అంతగా మెచ్చేవారు కారేమో' అన్నాడు.

**-మృణాళిని**




విడుదల : ఆదిత్యా మ్యూజిక్
వెల : 38/-




మహేష్ బాబు, గుణశేఖర్, మణిశర్మ, కాంబినేషన్, అనగానే ఎవరికైనా అనగానే ఎవరికైనా గుర్తొచ్చేది - ఒక్కడు! ఆదిత్యమ్యూజిక్ ద్వారా విడుదలైన 'అర్జున్' ఆడియోకి ఆ అంచనాలన్నీ వర్క్ అవుట్ అయ్యాయి. ఇటీవల ఈ ఆడియోకి హెక్సాప్లాటినమ్ డిస్క్ ఫంక్షన్ జరిగిందంటే ఊహించుకోవచ్చు - మార్కెట్లో ఈ ఆడియో ఎంత క్రేజ్‌ని సృష్టించిందో....! ఈ ఆడియోలో పాటలన్నిటినీ వేటూరి రాశారు.

ఆడియోలో తొలిగీతం - ఈ మధ్య వస్తున్న సంప్రదాయం ప్రకారం శంకర్ మహదేవన్ పాడేరు. 'ఒక్కమాట ఒక్కబాణం ఒక్కటేలే గురి' అన్నది పాట పల్లవి. పాటవినీ వినగానే రెహమాన్ 'వందేమాతరం'లోంచి కొంత ఇన్‌స్పిరేషన్ తీసుకున్నారేమోనని అనిపించటం సహజం. కానీ పాటలో కెళ్ళాకా ఆ విషయమే మర్చిపోతాం. అంతగా లీనం చేసుకుంటుందీ ట్యూన్. ఇదే పద్ధతిలో లోగడ 'బాబీ' లో 'ఈ జెండా పసి బోసి చిరునవ్వురా దాస్య సంకెళ్ళు తెంచిందిరా' అనే పాటను ఈ సందర్భంలో గుర్తుచేసుకుని, ఈ రెండు పాటల్లోనూ మణిశర్మ చూపిన పోలిక, వైవిధ్యం పరిశీలిస్తే ఆయన సృజనాత్మక నైపుణ్యం తెలుస్తుంది. సాహసిస్తే అకాశంలో భూకంపాలే సంభవం, నదులను కాదు ఎదలనే కలిపేస్తే గెలుపుర, జీవితం ఈక్వేషన్ స్నేహితం, యవ్వనం ఈజీక్వల్టు అద్భుతం లాంటి ప్రయోగాల్తో వేటూరి తన కలాన్ని మరోసారి ఝుళిపించారు.

చరణ్,శ్రియాఘోషల్ పాడిన 'ఏయ్ పిల్లా ఏం చేద్దాం చెప్పు' పాటలో హుషారు పాళ్ళు ఎక్కువ. అంచేత సంగీత సాహిత్యం, గానం ఆ లెవెల్లోనే తమ శక్తి మేరకు విజృంభించి యువతరాన్ని ఆకట్టుకునే ప్రయత్నంలో సక్సెస్ అయ్యాయని చెప్పొచ్చు. 'చుమ్మా' కి కౌంటర్‌గా 'అత్తగారి సొమ్మా', ఈలకైనా లీలకైనా వేళుందయా' లాంటివి పాతికేళ్ళ క్రితం నాటి 'చిలిపి వేటూరి'ని గుర్తుచేస్తాయి. ఈపాట చరణాలలోని తొలిపంక్తులు (భీమిలీలో ప్రేమలీల ఎన్నడో / నే చాకులాంటి సోకులున్న పిల్లని) వింటుంటే 1962 లో వచ్చిన ' బీస్ సాల్ బాద్'లోని 'బేకరార్ కర్‌కే హమే యూన జాయియే' పాట చరణంలోని తొలిపంక్తి ('దేఖియె ఏ కాలికాలి బద్ లియా) ట్యూను, 1959లో వచ్చిన 'లవ్‌మ్యారేజ్' సినిమాలోని 'ధీరే ధీరే చల్ చాంద్ గగన్ మే' పాటలోని తొలిపంక్తి (తు ఝూమ్కే చలే తొ దిల్ పే లగే కటారీ) ట్యూను - మిక్స్‌అయి ఈ రూపుదాల్చిందా అనే ఫీలింగ్ కలుగుతుంది. ఇది కాకతాళీయం కావచ్చు అయినా కరతాళీయం అనదగ్గ స్థాయిలో ఉంది.

బాలు,చిత్ర పాడిన ' డుమ్ డుమారే డుమ్ డుమారే పిల్ల పెళ్ళి చాంగు భళారే' పాట శిఖరాయమానంగా ఉంది. ఈపాట వేటూరి మాత్రమే రాయగలరు అనిపిస్తుంది. దేశంలోని ఆలయాల చరిత్ర వేటూరిగారికి తెలిసినంతంగా పరిశ్రమలో మరొకరికి తెలియదన్నది ఈ సమీక్షకుని అభిప్రాయం. 'అలగర్ పెరుమాళ్ళు అందాల చెల్లెలా మిలమిల లాడే మీనాక్షీ' అనే లైను అందుకు ఓ చిన్న ఉదాహరణ. అలాగే ఇప్పుడున్న గాయకులలో తీవ్ర,మధ్యమ, మంద్ర స్థాయిలలో ఏ స్థాయిలోనైనా స్పష్టత కోల్పోని, శ్రావ్యత చెడని, చక్కని సమన్వయంగల కంఠం బాలుగారిదని నిరూపించే పాటయిది. అందుకు ఈపాటలోని చరణాలే సాక్ష్యం. గాయనీ గాయకుల శక్తి సామర్థ్యాలకు పరీక్ష పెట్టే ఇటువంటి పాటను అందించిన మణిశర్మ మనోవాక్కాయ కర్మలా అభినందనీయుడు, 'మిలమిల లాడే మీనాక్షీ' అనే లైను తర్వాత వచ్చే చర్మవాద్యం శ్రోతల దృష్టిని కచ్చితంగా ఆకర్షిస్తుంది.

బీ సైడు తొలిపాటగా వచ్చే 'పిల్లిపిల్లి వచ్చే ఎలకా చోర్ దాగుడు మూతా' అనేపాట వినడానికి ఏ మాత్రం ఇబ్బందినీ కలిగించకుండా సాగిపోతుంది... అంతే! ఇన్ లే కవర్ పై 'ఓ చెలీ నీ వయ్యారాలే' అంటూ ప్రింటయిన ఈ పాటను కార్తీక్, చిత్ర బృందం పాడేరు.

ఉన్ని కృష్ణన్, హరిణి, బృందం పాడిన 'మధుర మధుర తర మీనాక్షీ కంచి పట్టులా కామాక్షీ' పాట సంగీత సాహిత్య పరంగా ప్రశంసార్హమైన పాట. ఏ సైడునున్న అఖరుపాటకు చెప్పుకున్నట్టు - ఈపాటను కూడా వేటూరి మాత్రమే రాయగలరు. ఉదహరించాలంటే పాటలోని రెండు చరణాలనూ యధాతథంగా రాయాలి. కావాలంటే వింటూ ఎవరికి వారు ఎదురుగా ఓ పేపరు పెట్టుకుని రాసుకుని చూడండి. వేటూరి గొప్పతనం తెలుస్తుంది. ఇక ట్యూన్ పరంగా హ్యాట్సాఫ్ టు మణిశర్మ! ఏ సైడు ఆఖరుపాటకీ, ఈపాటకీ చాలా మంచి అవుట్ పుట్ ను వేటూరి, మణిశర్మల దగ్గర్నుంచి రాబట్టుకున్నాడు దర్శకుడు గుణశేఖర్.

ఉదిత్ నారాయణ్, స్వర్ణలత పాడిన 'రా..రా....రా...రా.... ఎక్కడ పోతావ్‌రా' పాట లో వేటూరి ప్రాసక్రీడలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకున్నాయి. 1969 లో వచ్చిన 'షత్రంజ్' అనే హిందీ చిత్రంలో 'బత్‌కమ్మా బత్‌కమ్మా బత్‌కమ్మా బత్‌కమ్మా ఎక్కడ పోతావ్‌రా' అనే పాట పల్లవి, ఈపాట పల్లవికి రచనా పరంగా ప్రేరణ అయిఉండొచ్చు. అంతకుమించి ఈ పాట గురించి చెప్పడానికింకే లేదు.

# ఉత్తమ పత్రికగా 'హాసం' కు అవార్డు



అవార్డు నమూనా

జంట నగరాల సాంస్కృతిక సంస్థ సంగమ్ అకాడమీ 2003 సంవత్సరంకు సినిమా అవార్డులను ప్రకటించింది. మ్యాగజైన్ కేటగిరీలో 'హాసం' హాస్య సంగీత పత్రిక ఉత్తమ పత్రికగా ఎన్నికైంది. ఈ నెల 21 వ తేదీ సాయంత్రం 6గంటలకు రవీంద్రభారతిలో జరిగే ఓ కార్యక్రమంలో 'హాసం' తరపున పబ్లిషర్ వరప్రసాద రెడ్డి, సంపాదకులు రాజా ఈ అవార్డులను స్వీకరించనున్నారు.

ఉత్తమ సంగీత దర్శకునిగా కీరవాణి (ఒకరికి ఒకరు చిత్రానికి) ఎంపిక కాగా, ఉత్తమ గాయకునిగా యస్పీ బాలసుబ్రహ్మణ్యం ('సీతయ్య' చిత్రంలోని ఇదిగో రాయలసీమ గడ్డ, 'ప్రాణం' చిత్రంలోని సైయ్యారి నా ఎంకి... పాటలకు), ఉత్తమ గాయనిగా చిత్ర వాతాపిగణపతింభజే (ప్రాణం చిత్రానికి), ఉత్తమ గీత రచయితగా చంద్రబోస్ (ఈ అబ్బాయి చాలా మంచోడు చిత్రంలోని ఒక మనసుతో ఒకమనసుకి పాటకు),ఉత్తమ హాస్యనటునిగా బ్రహ్మానందం (శ్రీరామచంద్రులు చిత్రానికి) ఎన్నికయ్యారు. మిగిలిన అవార్డుల వివరాలు

ఉత్తమ నటుడు - ప్రభాస్ (రాఘవేంద్ర), ఉత్తమ నటి - లయ (మిస్సమ్మ), ఉత్తమ దర్శకుడు - చంద్రశేఖర్ (ఐతే), నీలకంఠ (మిస్సమ్మ), ఉత్తమ నిర్మాత - సత్యనారాయణ (మిస్సమ్మ), గంగరాజు (ఐతే), ఉత్తమ సహనటి - రాధాకుమారి (ఒకరికి ఒకరు), ఉత్తమ విలన్ - రాజీవ్ కనకాల (చంటిగాడు)

స్పెషల్ జ్యూరీ అవార్డులు
దర్శకత్వం - బి.జయ (చంటిగాడు)
సంగీత దర్శకుడు - కమలాకర్ (ప్రాణం)
గాయకుడు - వేణు (సత్యం)

ఈ సందర్భంగా లైఫ్ టైమ్ ఎచీవ్ మెంట్ అవార్డును గుమ్మడి వెంకటేశ్వరరావు గారికి ప్రదానం చేయనున్నారు.



# 143

and I MISS YOU

పాటల ప్రత్యేకం

పూరి జగన్నాథ్

శ్యామ్ కె. నాయుడు   చక్రి   మార్తాండ్ కె. వెంకటేష్

రచన: భాస్కరభట్ల రవికుమార్ **(1)** గానం: చక్రి, పల్లవి

ఆ: నా ఒంటిలోన వేడిపుట్టి చంపేస్తోంది పిల్లడ
నా కన్నె ఈడు పోరుపెట్టి పిలుస్తోంది పిల్లడ ॥నా ఒంటిలోన॥
అ: ఏయ్ కళ్ళలోన కళ్ళుపెట్టి అలా చూడకే తల్లే
నాగుండెలోన కవ్వమెట్టి ఇలా తిప్పకే తల్లే
అరే పాలకోవ బిళ్ళలాగ నన్నూరించకే తల్లే
నీ అందమంత ముందరెట్టి కిర్రెక్కించకే తల్లే
ఆ: నువ్ మసేర మసే... ఆ...
కో: మసేర మసేర మసేర
ఆ: ఇక ఢంకా పలాసే... ఆ...
కో: పలాసే పలాసే పలాసే
ఆ: ఏయ్ లెలెల్ల లెల్ల లెల్లె లెల్ల లేచిపోదామా...
అ: ఏయ్ లెలెల్ల లెల్ల లెల్లె లెల్ల లేచిపోదామా...
అరె పిల్లో... పిల్లో...
అ: నువు మరీ ఇంతలా గుబాళించితే ఏలా?
ఆ: చనువిచ్చాను కనుకా చుట్టుకోరా ఇలా
అ: చలి గిల్లేస్తోందనీ సతాయించితే ఎలా?
ఆ: అరే నీదేర చిలకా.. రెచ్చిపోరా ఇలా నా నవ్వే తమాషా...
కో: తమాషా తమాషా తమాషా
ఆ: నేనాలూ సమోసా...
కో: సమోసా సమోసా సమోసా
ఏయ్ లెలెల్ల లెల్ల లెల్లె లెల్ల లేచిపోదామా...
అ: ఏయ్ లెలెల్ల లెల్ల లెల్లె లెల్ల లేచిపోదామా...
అరె.. పిల్లో పిల్లో
ఆ: నే యాపిల్‌పండులా బాగున్నానుగా ఇలా
అ: నన్నొగ్గెయ్ పిల్లో దారికాస్తే ఏలా?
ఆ: నే మొగల్‌పువ్వులా ముద్దొస్తానుగా ఇలా
అ: కొంపముంచద్దె పిల్లో కూతపెడితే ఎలా?
ఆ: నేనేమో అనాసా...
కో: అనాసా అనాసా అనాసా నీతోనే కులాసా...
కో: కులాసా కులాసా కులాసా
ఏయ్ లెలెల్ల లెల్ల లెల్లెలెల్ల లేచిపోదామా...
అ: ఏయ్ లెలెల్ల లెల్ల లెల్లె లెల్ల లేచిపోదామా...
యహా.. పిల్లో పిల్లో...

రచన: కందికొండ **(2)** గానం : చక్రి

ఎందుకనీ..కనీ.. ఏమిటనీ... టనీ..
బిగి బిగి చెరసాలా బిగిసెను ప్రియురాలా
చిటపట చిరుజ్వాలా కురిసెను హృదయాలా
మనసే అవుతోంది మసిబారిన కిరణంలా
వలపె మిగిలింది తడి ఆరని నయనంలా
అమవాస్యపు గగనంలా
ఎందుకనీ.... ఏమిటనీ....
నీ అడుగులలో అడుగులు వేసి నడిచిన బంధమిలా
ఒంటరి తనమై క్షణమొక యుగమై మిగిలే ఏమిటిలా
ఆరిన పెదవుల మాటలికా... నా మాటలికా... నా మాటలికా...
చేరున చెలి నీదాకా... దాకా... దాకా... దాకా
ప్రియతమా నమ్ముమా ప్రాణం వున్నది నీకోసం
నా కనులలో నిన్నటి నీరూపం
ఎందుకనీ... ఎందుకనీ... ఎందుకనీ... ఎందుకనీ... ఏమిటనీ...
వెలుగులు చిలికే చిరు జాబిలిని మబ్బులు కమ్మె ఇలా
చిగురులు తొడిగె చిరునగవులపై చీడే చేరెనెలా
చిలిపిగ చేసిన బాసలిలా... ఆ బాసలిలా... ఆ బాసలిలా...
నా మదినె తొలిచేనా... తొలిచేనా
కాటుకై చేరనా కంటిలో దాగిన కన్నీరై
నీ చెక్కిలి తాకన చిరు ఆశై... ॥ఎందుకనీ॥

రచన: చంద్రబోస్ **(3)** గానం: చక్రి, కౌసల్య

అ: త... తాననినా తన్నానా తాననినా తాన్నానా
ధిరనా ధిక్ ధిరనా ధిరనా ధిరనా ధిరనా
అ: రా... రాగమయి రమ్మన్నా - తా.. తాళమయి నేనున్నా
ధిరనా ధిక్ ధిరనా ధిరనా ధిరనా ధిరనా
ఆ: రా... రాధనయి రమ్మన్నా - రా.. రాతిరైయినేనున్నా
ధిరనా ధిక్ ధిరనా ధిరనా ధిరనా ధిరనా
అ: స్నేహపురి దారుల్లో - ప్రేమపురి వీధుల్లో
ఆ: సిగ్గుపురి నీడల్లో - సొగసుపురి మేడల్లో
అ: చేరుకోనా - సిరిమల్లెల గుర్రంపైనా
ఆ: చేర్చుకోనా - నిను నాలో
అ: రా... రాగమయి రమ్మన్నా - తా.. తాళమయినేనున్నా
ఆ: ధిరనా ధిక్ ధిరనా ధిరనా ధిరనా ధిరనా ॥2॥
ఆ: విరహం నన్నే తరిమేస్తుంటే
పైపైకొస్తూ భయపెడుతుంటే
దాగుండిపోనా - నీ గుండెల గుహలోన
బందీనైపోనా - నీ చేతుల చెరలోన
అ: పైన నీపైన పడుతుంటే చీకటివాన
లేనా నేలేనా చంద్రుణ్ణే గొడుగుగ తేనా
ఆ: చూపుల సుందర వదనా - మాపటి వేళల మదనా
అ: అయిదారడుగులు వున్నా - నీ అడుగుకు మడుగవనా
ఆ: రా... రాధనయి రమ్మన్నా - రా.. రాతిరైయినేనున్నా
ధిరనా ధిక్ ధిరనా ధిరనా ధిరనా ధిరనా ॥2॥
అ: తాపం నన్నే వేధిస్తుంటే
దాహం నేడే పీడిస్తుంటే
తలదాచుకోనా - నీ పెదవుల తడిలోనా
పడవేసుకోనా - నీ మధువుల నదిలోనా
ఆ: లోనా నీలోనా పుడుతుంటే తుమ్మెదకూనా
కానా జతకానా ప్రాయాన్నే పువ్వుగ తేనా
అ: మనసును దోచిన సుగుణ మలుపులు తిరిగిన రచన
ఆ: పరువపు హిమగిరినయినా నీ ప్రేమకు నీరవనా
అ: రా... రాగమయి రమ్మన్నా - తా.. తాళమయినేనున్నా
ఆ: ధిరనా ధిక్ ధిరనా ధిరనా ధిరనా ధిరనా ॥2॥



రచన: భాస్కరభట్ల రవికుమార్ (4) గానం: వేణు, ఆదర్శిని

తా... తడి కంటపడీ చంపుతున్నారే
వావ్ అనీ వెంటపడీ దంచుతున్నారే
ఆల్రెడీ గుండెసడీ పెంచుతున్నారే
హోయ్ అనీ అడ్డుపడీ ఆపుతున్నారే
కందిరీగలాంటి నడుం కదుపుతున్నారే
దొండపండులాంటి పెదవి కొరుకుతున్నారే
అమ్మోయమాయమ్మా ఏం కులుకుతున్నారే
ఘుమాఘుమా గుమ్మా గుండెల్లో గుభేలే... ॥ తా.. తడి ॥
కో: ఓయ్ అ: ఓ చాందినీ
కో: ఏయ్ అ: ఏ నందినీ
కో: ఓయ్ అ: ఓ అంజనీ ఏంటే ఫోజూ
కో: ఏయ్ అ: మీ కళ్ళుపడి
కో: మేం అ: కంగారుపడి
కో: మా అ: బుర్రంతచెడి లైఫే క్లోజూ
అ: ముద్దుగా పిలవడం ముగ్గులో దించడం
ప్రేమలో ముంచడం చేస్తారంట
ఏంటీ మార్కులు నీలో మార్పులు
అంటూ ఇంటిలో తిడతారంట
ఆ: దేఖోరే... మా జోరే
మీరే మ్యాచీసు మీరే మిర్చీసు మీతో వర్రీసు తడి తడి తడి తడి
అ: తా... తడి కంటపడీ చంపుతున్నారే
వావ్ అనీ వెంటపడీ దంచుతున్నారే
కో: మేం
అ: మేం ఇష్టపడి
కో: మేం
అ: మేం కష్టపడి
కో: మేం
అ: మేం మోజుపడి ఎన్నో చేశాం
కో: ఆ...
అ: ఆ సైగలకే
కో: ఆ... అ: ఆ నవ్వులకే
కో: ఆ... అ: ఆ చేష్టలకే బకరాలయ్యాం
అ: అయ్యోదేవుడా ఆలోచించకా అన్నీ వాళ్ళకే ఇచ్చేశావా?
మళ్ళీ జన్మలో మా అందర్నీ లేడీసల్లె పుట్టించవా?
ఆ: చాల్లేరా... మీగోలా
మేమే ఆల్వేజు ఎంతో హేపీసు
మీరే బేవార్స్ తడి తడి తడి తడి... ॥తా.. తడి కంటపడి॥

రచన: కందికొండ (5) గానం: చక్రి

కలలోన నువ్వే ఇలలోన నువ్వే
కన్నీటి వరదై కమ్మేసినావే
గుండెలోన కూసిన కోయిలా
గొంతుమూగదైనది ఏంటిలా
హృదయపు లయలకు కిలకిలా
మరి నేర్పిన చెలిమే లేదెలా
నీలి నీలి కన్నులా నిండిపోవె ఇలా
జాలువారె వెన్నెలా వుండిపోవే అలా
కలలోన నువ్వే ఇలలోన నువ్వే
కన్నీటి వరదై కమ్మేసినావే
ఆపవే ఆపవే అల్లరింకా
ఈ అల్లిబిల్లి ఆగడాలు ఏలా
చేరవే చేరవే చంద్రవంకా
చిమ్మి చీకటేగ చిన్నినవ్వు లేకా
నువ్వు వాగల్లే వస్తే
చెలి మెరుపుల అలనే నేనౌతా

రచన: కందికొండ (6) గానం: రవివర్మ, సునంద

ఆ: ఓరోరి దేవుడా మొగుడే రాడా
ఈ పెళ్ళియోగం నాకింకలేదా
వయసు బరువై ఇలా
నిదర రాదే ఎలా?
ఈ చీరకట్టు నా ఒంటి చుట్టు
బిగించి కట్టిన నిలువదు ఎలా
ఒక్క మగవాడు
ఏడి జతగాడు
హె... చెయ్ పట్టేసుకోరా
హె... ముడి వేసేసి పోరా
హెయ్ ఇక అల్లేసుకోరా
హెయ్ నన్ను గిల్లేసిపోరా
హోహోహోహో ....
అ: దింతక... దింతక...దింతక... దింతక (2)
హోహోహోహో... హోహోహోహో
అ: కొత్తగా... పిల్లడు
చాటింగ్‌లో చేపలా తగిలాడు
అమెరికా మొగుడని
మురిసి నే పొంగిపోయాను
ముఖాన కొంచెం పౌడరు అద్దిన ఫోటో పంపాడు
కన్నులు మూస్తే కల్లోకొచ్చి కిరికిరి చేసాడు
అ: హో... తైతక తైతక...
ఆ: కలలింక ఆపక ముందే కన్నుల ముందుకు చేరాడు
ఏముంది తీరాచూస్తే నాలుగు అడుగుల పొట్టోడు
అ: పొట్టి... పొట్టి... పొట్టి... పొట్టి...బలె... బలె... బలె... బలె...
ఆ: సిరిపురం పోరడు
ఈడు జోడీలే అన్నారు
ఏం కళైన ఫేసులే
సుందరాంగుడే అన్నారు
చేపల చెరువులు రొయ్యల చెరువులు నీవే అన్నారు
ఎక్స్‌పోర్టంటు ఇంపోర్టంటు చుక్కలు చూపారు
అ: తైతక... తైతక... తైతక... తైతక...
ఆ: ఏముంది తీరా చూస్తే నాకు మామలా ఉన్నాడు
అచ్చంగా ఆ నిలువెత్తు తుమ్మమొద్దు ఆ బండోడు...
అ: బండ... బండ... బండ.... బండ... ॥ఓరోరి దేవుడా॥

చిరుగాలై వీస్తే
నే ఎదురుగ నిలబడి అల్లుకుంటా
ఓఓఓఓఓ... పాపను నేనంటా
ఓఓఓఓఓ... అమ్మవు నీవంటా
నీలి నీలి కన్నులా నిండిపోవె ఇలా
జాలువారే వెన్నెలా వుండిపోవే అలా
కలలోన నువ్వే ఇలలోన నువ్వే
కన్నీటి వరదై కమ్మేసినావే
మెత్తగా మత్తుగా మల్లెపువ్వా
నీచెంపమీద కోటి ముద్దులివ్వా
మెల్లగా చల్లగా చిట్టిగువ్వా
సన్నమూగ సైగ చేసే కాలిమువ్వా
నువు ఎదపై పడుకుంటె నిను ఊపె ఊయల నేనవుతా
చిరునవ్వే వరమిస్తే నీ పెదవిని చినుకై తడిపేస్తా
ఓఓఓఓఓ... మృదుపాదం నీవంటా
ఓఓఓఓఓ... నేలను నేనంటా
నీలి నీలి కన్నులా నిండిపోవె ఇలా
జాలువారే వెన్నెలా వుండిపోవే అలా
కలలోన నువ్వే ఇలలోన నువ్వే
కన్నీటి వరదై కమ్మేసినావే

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

వైష్ణో అకాడమీ

# 143

## and I MISS YOU

పూరి జగన్నాథ్

శ్యామ్ కె.నాయుడు   చక్రి   మార్తాండ్ కె.వెంకటేష్







### తారాగణం

సాయిరాం శంకర్, సమీక్ష, ఫ్లోరా, పూజా, నాగేంద్రబాబు, రామరాజు, చిట్టి, చైతన్య, ఆనంద్‌రాజు, బ్రహ్మానందం, మల్లిఖార్జునరావు, ఎం.ఎస్.నారాయణ, ఆలీ, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, కొండవలస లక్ష్మణరావు, వేణుమాధవ్, గౌతంరాజు, సత్యప్రకాష్, బ్రహ్మాజీ, భాస్కర్, భరత్, ఉత్తేజ్, గణేష్, శ్రీనివాస్‌రెడ్డి, బాంబే రాజ్, జి.విజయ్‌కుమార్, హేమ, రజిత, ఉమ, శోభారాణి, ముమిత్‌ఖాన్ (ముంబై)

### సాంకేతిక నిపుణులు

ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్స్
కృష్ణ, పి.ఉమాశంకర్ గణేష్

సినిమాటోగ్రఫీ
శ్యామ్ కె.నాయుడు

ఎడిటింగ్
మార్తాండ్ కె.వెంకటేష్

మ్యూజిక్
చక్రి

ఆర్ట్ డైరెక్టర్
చిన్న

థ్రిల్స్
రామ్-లక్ష్మణ్

కొరియోగ్రఫీ
ప్రదీప్ ఆంథోని
కృష్ణారెడ్డి

కాస్ట్యూమ్స్ డిజైనర్
లావణ్య

కాస్ట్యూమ్స్
అంజిబాబు

మేకప్
సుద్దాల రాజు

స్టిల్స్
దశరథ్

పి.ఆర్.ఓ.
పులగం చిన్నారాయణ

పబ్లిసిటీ డిజైనర్
ధని ఏలె

కో-డైరెక్టర్
ఎల్.పి.రామారావు

అసోసియేట్ డైరెక్టర్స్
వి.వి.బద్రి
అశోక్‌కుమార్ లాలమ్

అసిస్టెంట్ డైరెక్టర్స్
ఐ.రమేష్‌చంద్ర
గాంధీ శ్రీనివాస్
గోపి గణేష్
పి.పరశురామ్ నాయుడు
రాజేంద్ర పి.నారాయణదాస్

కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, నిర్మాత,

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తెలుగు | | తమిళం |
|---|---|---|
| చిత్రం | : ధర్మదాత | ఎంగ ఊర్ రాజా |
| రచన | : సి.నారాయణరెడ్డి | కణ్ణదాసన్ |
| సంగీతం | : టి.చలపతిరావు | ఎం.ఎస్.విశ్వనాథన్ |
| గానం | : ఘంటసాల, సుశీల | టి.ఎం.సౌందరరాజన్,సుశీల |
| అభినయం: | అక్కినేని నాగేశ్వరరావు, కాంచన | శివాజీగణేశన్, జయలలిత |

'ధర్మదాత' చిత్రం కోసం డాక్టర్ సి.నారాయణరెడ్డిగారు మూడు ప్రణయగీతాలు రాశారు. అందులో "పరమేశ్వరి జగదీశ్వరి రాజేశ్వరి కాళేశ్వరి ఇకనైనా శాంతించవే" అనే చమత్కారమైన పల్లవితో ప్రారంభమయ్యే గీతం ఒకటి. 'ధర్మదాత' చిత్రానికి మూలమైన 'ఎంగ ఊర్ రాజా' చిత్రంలో 'పరమేశ్వరి రాజేశ్వరి జగదీశ్వరి బాగేశ్వరి నల్‌వాక్కు తరువాయడి' అనే పల్లవితో మొదలయ్యే పాట ఉంది.

ముందుగా ఆ తమిళ గీతం గురించి కాక తెలుగుపాట గురించి ప్రస్తావించడానికి కొన్ని ప్రత్యేకమైన కారణాలున్నాయి. తమిళంలో పాట నలుపు తెలుపు రంగుల్లో చిత్రించగా - తెలుగు పాటను రంగుల్లో చిత్రీకరించారు. తెలుగు పాటను రంగుల్లో చిత్రీకరించకపోయి ఉన్నా నష్టం ఉండేది కాదు. ఎందుకంటే మూల తమిళ గీతంలో లేని రంగులూ, రుచులూ, సువాసనలూ అన్నీ ఈ తెలుగు పాటకు కలిసివచ్చాయి. పాటలో మాటలు సొగసుగా కుదిరినప్పుడు, పాటకు సంగీతం కూడా కలిసివస్తుంది. తమిళగీతంలోని పల్లవిలోని కొన్ని పదాలనూ, కొద్దిగా ఆ పల్లవిలోని సంగీత రచనను తీసుకోవడం తప్ప - తెలుగు పాట స్వతంత్రంగా సాగింది. నారాయణరెడ్డి గారి రమణీయ రచనకు చలపతిరావు గారి సంగీతం, పాట పాడిన ఘంటసాల, సుశీల గార్ల గళాలు కలిసివచ్చాయి. తమిళ గీతంలోని నటనలో కొంత అసహజత్వం కనిపించినా తెలుగు పాటలో ఆ సమస్య లేదు. తమిళ గీతంలో శివాజీ గణేశన్, జయలలితలతో పాటు ఒక స్కూటర్ కూడా కనిపిస్తాయి. తెలుగు పాటలో అందమైన ఉద్యానవనంలో అక్కినేని నాగేశ్వరరావు, కాంచన అందంగా హాస్యాన్ని పండించారు.

ఈ పాట గురించి డాక్టర్ సి.నారాయణరెడ్డి గారు చెప్పిన వివరాలు చూస్తే ఆయన ఎంత ఆలోచనతో పాట రాశారో తెలుస్తుంది. "ఆ నాయిక - నాయకుడు అంతంత మాటలతో తనను కీర్తిస్తుంటే 'నీ దండకం నేను విన్నాను' అంటుందేమిటి? 'చాల్లే ఇక ఆపు నీ దండకం' అన్నట్టుగా ఉందే ఇది... ఆ పదంలో ఈసడింపు కనిపిస్తున్నదే! ఎందుకిలా జరిగింది దండకానికి? అది వస్తుపరంగా ఏర్పడింది కాదు. దాని ఛందో రూపం వల్ల. మామూలుగా పద్యాల్లో ఉండే విభిన్న గణాలు దండకంలో ఉండవు. 'తా+నా+న' అంటూ రెండు దీర్ఘాక్షరాలతోనూ ఒక లఘువుతోనూ క్రమంగా కూడుకున్న 'త' గణం మాత్రమే ఇందులో ఉంటుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఈ ప్రక్రియలో 'తానాన తానాన' అంటూ ఒకే నడకలో ఎన్నో త గణాలుంటాయి.... ఒకటే వరసలో ఎవరైనా ఊదరగొట్టినపుడు 'ఇక చాలు నీ దండకం ' అనే వాడుక అలా ఏర్పడింది. ఈ పల్లవిలో నిజానికి ఆ 'త గణాలు' లేవు. ఆ దండకంలో ఛందస్సు లేదు. ఒక గతిలో ఊపిరాడకుండా సంబోధనలు గుప్పించడం ఉంది. ఆ ధోరణినే దండకమంటూ పరిహసించింది నాయిక. అంతటితో ఆ విరసం ముగిసింది. సరసం మొదలైంది. అతణ్ణి భక్తుడిగా తనను ఒక దేవతగా భావించుకుని 'హారతిని అందుకున్నాను' అని తన ఆమోదం తెలుపుతుంది. ('పాటలో ఏముంది - నా మాటలో ఏముంది' అనే రచనలో డాక్టర్ నారాయణరెడ్డిగారు చెప్పిన విశేషాలు ఇవి)

పాట మొదట 'ఓం' అని మొదలైనా తర్వాత పల్లవి వచ్చినపుడు 'పరమేశ్వరి' అనే మొదలవుతుంది.

ముందుగా తెలుగు పాట :

అ : ఓం పరమేశ్వరి జగదీశ్వరి రాజేశ్వరి కాళేశ్వరి
ఇకనైనా శాంతించవే
మండోదరి గుండోదరి నీలాంబరి కాదంబరి
నీ దాసుని కరుణించవే

ఆ: నీ దండకం నేను విన్నాను
నీ అండగా నేను ఉన్నాను ॥నీ దండకం॥
నీ హారతిని అందుకున్నాను ॥2॥
నీ ముద్దు చెల్లించమన్నాను ॥2॥ ॥పరమేశ్వరి॥

అ: ఎన్నెన్ని పుణ్యాలు చేశానో
ఈ జన్మలో నిన్ను చూశాను ॥ఎన్నెన్ని॥
చిలకమ్మ లెన్నెన్ని ఎదురైనా ॥2॥
తొలిచూపు నీ పైనే వేశాను ॥2॥ ॥పరమేశ్వరి॥

ఆ: నా కళ్లలో నిండిపోవాలి - నువ్వు
నా గుండెలో ఉండి పోవాలి ॥నా కళ్లలో॥

అ: చెలి కౌగిలి చెరసాల కావాలి ॥2॥
కలకాలం బందీనై పోవాలి ॥2॥

ఆ: పరమేశ్వరి...

ఆ: (వద్దన్నట్టు) ఊహూ..

అ: ప్రాణేశ్వరి ప్రణయేశ్వరి హృదయేశ్వరి మహదేశ్వరి
ఇకనైన శాంతించవే
రాగేశ్వరి భాగేశ్వరి వాగీశ్వరి నాగేశ్వరి
నీ దాసుని కరుణించవే



దేవతలకు మ్రొక్కు చెల్లించడం ఉంటుంది. అయితే ఈ దేవి ప్రణయదేవి. అందువల్ల ఆమె ముద్దు చెల్లించమంటున్నది. సాధారణంగా చెల్లించమనే వాడుక ఉన్నా, ఇక్కడ ముద్దు చెల్లించమనడంలోని ముచ్చట లేదు. ఆ ప్రేమ దాసుడు ఆ దేవిని చూడడానికి ఎన్నెన్ని పుణ్యాలో చేశాడు. చిలకమ్మ లెన్ని ఎదురైనా తొలిచూపు ఆమెపైనే పడ్డాదట. చిలక స్త్రీకీ, గోరింక పురుషుడికీ ప్రతీకలు కదా!

ఆ దేవి ఆ భకుణ్ణి తన కళ్లల్లో నిండిపోయి తన గుండెలో ఉండిపోవాలని రెండు వరాలు అడిగింది. ఆ భక్తుడు ప్రణయబంధాన్ని కోరాడు. ఆ కోరడంలో ఆమెను 'చెలి' అంటూ 'చెలి కౌగిలి చెరసాల కావాలి కలకాలం బందీనై పోవాలి' అంటాడు. అని మళ్లీ 'పరమేశ్వరి' అని పల్లవి అందుకోబోతుంటే ఆమె అట్లా పిలవద్దన్నట్లు 'ఊహూ' అంటుంది. నాయకుడు వెంటనే పల్లవి మార్చి "ప్రాణేశ్వరి ప్రణయేశ్వరి హృదయేశ్వరి మహదేశ్వరి"అని నాయికను శాంతింపచేసుకుంటాడు. పాట చివర 'నాగేశ్వరి' అనడం నాయక పాత్రవేస్తున్న నాగేశ్వరరావుగారి పరంగా చమత్కారంగా చేసిన ప్రయోగం. పాట చివర పల్లవిలోని మార్పు తెలుగు పాట అందాన్ని పెంచింది. తమిళగీతంలో ఈ మార్పు లేదు.

ఇక తెలుగు పాట పాడించిన తీరులో చలపతిరావుగారు ఒక చక్కని ప్రయోగం చేశారు.

ప్రతి చరణంలోనూ నాలుగు పంక్తులుండగా రెండేసి పంక్తులను కలిపి ఒకసారి పాడించి, మళ్లీ ఆ పంక్తులనే తిరిగి పాడించారు. అయితే తొలిసారి పాడిన దానికి మలిసారి పాడిన దానికీ తేడాలు కనిపిస్తాయి. ఒక భావాన్ని రెండు రకాలుగా పలుకుతూ ఒకసారి పాడిన దానికన్నా రెండవసారి పాడినది మరింత సొగసుగా వినిపించడంలో ఘంటసాల, సుశీల కృతకృత్యులయ్యారంటే- అందుకు పాటకు స్వరకల్పన చేసిన చలపతిరావు గారినే మెచ్చుకోవాలి.

ఇక తమిళగీతం గురించి...

కణ్ణదాసన్ రాసిన ఆ పాటకు ఎం. ఎస్. విశ్వనాథన్ సంగీతం సమకూర్చారు. పాట పాడినవారు-టి.ఎం. సౌందరరాజన్, పి. సుశీల.

ఆ తమిళ గీతం ఇది :

తమిళగీతానికి భావానువాదం ఇక్కడ:

అ: పరమేశ్వరి రాజేశ్వరి జగదీశ్వరి
భాగేశ్వరి శుభవార్త అనుగ్రహించవే
మండోదరి గుండోదరి చింతామణి చూడామణి
పెళ్లిచూపులకు వస్తాలేవే

ఆ: దేవి పూజకు రుసుము ఉంది
(అదే) ముద్దు బేచిలర్ బాయ్ (బ్రహ్మచారీ)

అ: ఆశగా మూడువందలు చెంపల మీద
సాయంకాలం ఒకటి ఉదయాన రెండు
బీచికి(సముద్రతీరానికి) వెళ్లి...

అ: కట్టయిన మేని తేనెగా మార్చి
గాజు గిన్నెలో పోసెయ్యనా

ఆ: పనిలోపనిగా నేను పాలుగా మారి
తేనెతో జోరుగా ఊరనా

అ: వేసవిలో నీవు ఇచ్చిన లేత కొబ్బరి నీళ్లు తాగి
ఉత్సవం జరుపుకొని జరుపుకొని బీచికి వెళ్లి..
చలికాలానికి నేనిచ్చే దుప్పటి ఉంది
ఇదిగో ఇదిగో...

ఆ: బేచిలర్ బాయ్..
ఆగని వరదలో మునిగి వచ్చిన ప్రేమ
చాలదే చాలదే ఇంకా కాస్త (కావాలి)
పువ్వుతో పువ్వు పోరాడే వేళ
అమ్మయ్యో అమ్మయ్యో అంటుంది హృదయం ॥పరమేశ్వరి॥

అల్లరి పాట కావాలని చెప్పడం వల్ల కావచ్చు కణ్ణదాసన్ ఈ గీతాన్ని శ్రమపడకుండా రాసినట్టు కనిపిస్తుంది. 'బేచిలర్ బాయ్' అనే పదాలతో ప్రాస కలపడానికి 'బీచ్చిలే పోయ్' అనే పదాలు వాడడం అందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

'ముద్దు'ను తమిళంలో 'ముత్తం' అంటారు. 'ముత్తం' అని సూటిగా చెప్పకుండా 'మూనా ఇత్తు తానా ఇమ్ము' అని నాయిక అక్షరాలు విడివిడిగా

అతడు:పరమేశ్వరి రాజేశ్వరి జగదీశ్వరి
భాగేశ్వరి నల్ వాక్కు తరువాయడి
మండోదరి గుండోదరి చింతామణి శూడామణి
పెణ్ పార్క వరులేనడి ॥పరమేశ్వరి॥

ఆమె:దేవియిన్ పూజైక్కు అచ్చారం ఉండు
మూనా ఇత్తు తానా ఇమ్ము బేచిలర్ బాయ్
బేచిలర్ బాయ్ బేచిలర్ బాయ్

అ: ఆశైక్కు మున్నూరు కన్నత్తిల్ కొండు
అందియిల్ ఒన్ను కాలైయిల్ రెండు
బీచ్చిలే పోయ్ బీచ్చితే పోయ్ బీచ్చిలే పోయ్

అ: కట్టాన మేనియై తేనాగి మాత్రి
కణ్ణాడి కిణ్ణత్తిల్ పోడట్టుమా

ఆ: కైయోండు నానుం పాలాగమారి
తేనోడు జోరాగ ఊఱట్టుమా ॥పరమేశ్వరి॥

అ: కోడైయిల్ నీ తంద ఇళనీరై ఉండు
కొండాడి కొండాడి బీచ్చిలే పోయ్ బీచ్చిలే పోయ్ బీచ్చిలే పోయ్
వాడైయిల్ నాన్ తరుం పోర్వైయుం ఉండు
ఇందాడి ఇందాడి

ఆ: బేచిలర్ బాయ్ బేచిలర్ బాయ్, బేచిలర్ బాయ్
పోగాద వెళ్ళత్తిల్ పోయ్ వంద కాదల్
పోదాదే పోదాదే ఇన్నుం కొంజం
పూవోడు పూవుం పోరాడుం పోదు
అమ్మాడి అమ్మాడి ఎన్నుం నెంజం ॥పరమేశ్వరి॥



పలికింది. 'మూనా' అంటే 'ము'. ఇత్తు అంటే 'త్'. తానా అంటే'త'. ఇమ్ము అంటే చివరి 'మ్' అనే అక్షరం. వెరసి 'ముత్తం'. 'అచ్చారం' అంటే ముందుగా చెల్లించవలసిన రుసుము అని అర్థం.

పల్లవిలో 'గుండోదరి' అనే మాటకు లావుగా ఉండే స్త్రీ అని అర్థం చెప్పుకోవాలి. తమిళంలో 'లావు' అనడానికి 'గుండు' అంటారు. ఈ మాట వెనుక ఒక కథ ఉంది. పరమేశ్వరుడు మీనాక్షిని పెళ్లాడడానికి మదురై వెళ్లాడట. పెళ్లికొడుకు పక్షాన ఎందరో వస్తారని పెద్ద ఎత్తున వంటలు చేశారట. 'ఈ వంటకాలు ఏం కావాలి' అని అడిగితే సుందరేశ్వరుడు - కుండోదరుడనే వాణ్ణి అప్పటికప్పుడు సృష్టించాడట. కుండోదరుడు వంటకాలన్నీ తిని దాహానికి నీళ్లు కావాలంటే ఆ దాహాన్ని తీర్చడానికి కావలసినంత నీళ్లు మధురానగరంలో లేవని తెలిసింది. అప్పుడు ఈశ్వరుడు కుండోదరుడితో 'వై కై' అన్నాడట. 'వై' అంటే పెట్టు (లేదా పట్టు) అని అర్థం. 'కై' అంటే చెయ్యి అని అర్థం. ఈశ్వరుడు సిగపాయ సడలించి గంగను కుండోదరుడి చేతిలోకి స్రవింప జేశాడట. అలా 'వై గై' నది ఏర్పడిందని పురాణ కథ. లావుగా ఉండే పురుషుణ్ణి గుండోదరుడనీ లావుగా ఉండే స్త్రీని 'గుండోదరి' అనీ తమిళులు వాడుతూ ఉంటారు. తెలుగు పాటలోనూ 'గుండోదరి' అనే మాట వచ్చినప్పుడు నాయకుడు చేతులు వెడల్పు చేసి 'లావు'ను సూచిస్తాడు.

తమిళగీతం అప్పటి ప్రణయగీతాలకన్నా కొంత భిన్నంగా సాగిందని చెప్పుకోవచ్చు. తెలుగుపాటలో పెళ్లిచూపుల ప్రస్తావన లేదు. తెలుగు పాటలో ముద్దు ముచ్చటగా ఉంది. తమిళంలో ముద్దు ముచ్చట ఘాటుగా ఉంది. తెలుగు పాటలో ప్రేమ చాలదన్న తపన కాక కళ్లలో నిండి గుండెలో ఉండి పోవాలనే కోరిక ఉంది.

తమిళగీతాన్ని అనుసరించకుండా, అనుకరించకుండా ఈ తెలుగు పాట తన మాటను బాటనూ ప్రత్యేకంగా తీర్చిదిద్దుకొంది!

- పి.ఎస్.గోపాలకృష్ణ

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

హైదరాబాద్ నారాయణగూడాలోని ఆంధ్ర బాలానంద సంఘం ఆవరణలో 31.07.04 శనివారం సాయంత్రం జరిగిన 'హాసం క్లబ్' కార్యక్రమం ఆహ్లాదభరితంగా సాగింది. రెండున్నర గంటలపాటు సాగిన ఈ కార్యక్రమంలో నిర్వాహకుల కోరిక మేరకు సభికులే ముందుకు వచ్చి జోక్స్‌తో, పాటలతో, పాటల విశ్లేషణతో సభను రక్తి కట్టించడం విశేషం. టి.వి. కారణంగా మానవ సంబంధాలు క్షీణిస్తున్న ఈ రోజుల్లో కుటుంబ సమేతంగా అందరూ పాల్గొని ఆహ్లాదాన్ని పంచుకోవడంతో బాటు కమ్యూనికేషన్ స్కిల్స్ పెంపొందించుకోవాలన్న ఉద్దేశ్యంతో ఈ క్లబ్ స్థాపించామని కన్వీనర్ ఎస్.వి.రామారావు తొలిపలుకులలో చెప్పిన దానికి అనుగుణంగానే అన్నట్టు చిన్నపిల్లలనుండి గృహిణుల దాకా, యువకుల నుండి రిటైర్డ్ ఉద్యోగుల దాకా, ప్రొఫెషనల్స్ నుండి ఔత్సాహికులదాకా మొత్తం 36 మంది - ముందుకు వచ్చి జోక్స్ చెప్పారు, పాటలు పాడారు. అత్తా కోడళ్లు కలిసి యుగళ గీతం పాడడం ఓ విశేషం కాగా, చి॥ చైత్ర పాడిన 'ఏ శ్వాసలో చేరితే', గౌరీ శంకర్ పాడిన 'నీలగగన మేఘ శ్యామా', ప్రత్యూష 'పియా తో సే నైనా లాగే', అంజనా ప్రియాంక 'రేయి మించెనోయి రాజా', హరిప్రియ 'మనసే కోవెలగా', ఎ.విశిష్ట 'వెన్నెల కురిసే శారద రాత్రి', మణికుమారి 'పిబరే రామరసం', కమల 'చిన్నమాట ఓ చిన్నమాట' రేణుక 'నీవుండేదా కొండపై' తో సంగీత విభాగంలో హైలెట్స్‌గా నిలవగా, హాస్య విభాగంలో శ్రీనివాసాచారి ఉషా ఉతుప్ ప్యారడీ పాట, అనిల్‌కుమార్ చేసిన మిమిక్రీ, కామేశ్వరరావు 'గోడ పద్యం', కావేరి రాం 'హాసం సీసం' హైలెట్‌గా నిలిచాయి. మెహమూద్ జీవిత విశేషాలను 'హాసం' మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్ వివరించగా జులై నెలలో పుట్టిన కళాకారుల వివరాలను ఎస్వీరామారావు తెలియబరిచారు. సభా ప్రారంభంలో అల్లు రామలింగయ్యకు శ్రద్ధాంజలి ఘటించడం జరిగింది. వచ్చే కార్యక్రమం ఆగస్టు 28 సాయంత్రం 6-30 గంటలకు ఆంధ్ర బాలానంద సంఘంలోనే జరుగుతుంది.






'హాసం క్లబ్'లో చదివిన కవిత

## గోడ గోడు

చందమామనుండైనా కానవస్తానని గర్వం - చైనా గోడగా !
కూలుతున్నా ఆత్మీయులను కలిపేనన్న ఆనందం - బెర్లిన్ గోడగా !
గృహానికైనా, కారాగృహానికైనా ప్రహరీగా పహరా - నేనే !
పచ్చదనం, పరిశుభ్రం, ఎయిడ్స్ - ప్రకటన ఏదైనా, ఆసరా - నేనే !
పల్లెపడుచు నా ముఖాన పేడగొట్టినా ఆరబెట్టి అందించేది - నేనే !
ఘన చరిత గల నన్ను చదువు నేర్వని కుక్క కాలెత్తి తడిపినా భరిస్తున్నా
చదువు నేర్చిన ఎందరో ఆ పని చేస్తుంటే మౌనంగా రోదిస్తున్నా !

- కె.యల్. కామేశ్వరరావు





## 'ఆలోచిస్తూ' ముందడుగేస్తున్న

# బబుల్ సుప్రియో!

**త**నిష్టపడే గాయకుడిని అనుసరిస్తూ, అనుకరిస్తూ పాడటం ప్రతి వ్యక్తీ చేసే పనే..! అదే పని బబుల్ సుప్రియో కూడా కెరీర్ ప్రారంభంలో చేయటం ఓ రకంగా వరమూ, మరో రకంగా శాపమూ అయ్యాయి.

ఘంటసాల గొప్పగాయకుడిగా జన నీరాజనం అందుకుంటున్న రోజుల్లో ఎందరెందరో 'మేమూ ఆయనలా పాడతాం' అని సంగీత దర్శకుల్ని, అడిగితే- 'ఆయనలా పాడేట్టయితే మీరెందుకు? ఆయనే వున్నారు కదా!' అన్నది సదరు సంగీత దర్శకుల సమాధాన మయ్యేది. ఘంటసాలలా బాల సుబ్రహ్మణ్యం పాడలేదు కాబట్టే ఇవాళ ఆయన ఆ స్థానానికి వెళ్ళగలిగాడు.

### గాన వారసత్వం...

ముఖ్యంగా సినిమా రంగంలో ఒక ముద్రపడిన తర్వాత దానిని తప్పించుకోవటవం చాలా కష్టం. 'కుమార్‌సాను' లా పాటలు పాడతాడు అనే ముద్రనుండి ఇప్పుడిప్పుడే బబుల్ సుప్రియో బైటపడుతున్నాడు. శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకోకపోయినా తను చిన్నతనం నుండి సంగీతాన్ని అభ్యానం చేశానని బబుల్ చెబుతున్నాడు. "నా అసలు పేరు బబుల్ బొరల్. మాది కోల్‌కటా. మా తాతయ్య మణికాంత బొరల్ బెంగాలీలో గొప్ప గాయకుడు, సంగీత దర్శకుడు. మా నాన్నగారు రామ్ చంద్ బొరల్ కూడా గాయకుడే. కానీ తాతయ్యలా ఆయన సంగీతాన్ని వృత్తిగా స్వీకరించలేదు. ఎందుకంటే తాతయ్య ఎంత గొప్ప విద్వాంసుడైనా ఆయన సంపాదించింది లేదు. సంగీత పరిజ్ఞానం వల్ల పేరొచ్చింది తప్పితే కాసులు రాలేదు. గంగానది ఒడ్డున వున్న ఇంట్లో నన్ను కూర్చోబెట్టి ఆయన సంగీత సాధన చేయిస్తుండేవారు. అలా గీతాలాపనతో నాకు సంబంధం ఏర్పడింది. చిన్నతనం నుండే తాతగారి దగ్గర పాడటం నేర్చుకున్నాను కదా! ఆ పాండిత్యం అంతా కిషోర్ కుమార్ పాటలకు జత చేసేవాడిని. అదే ఆ తర్వాత నా కెరీర్‌కి ఉపయోగపడింది" అన్నారు బబుల్ సుప్రియో!

### బ్యాంక్ వుద్యోగానికి తిలోదకం !

"చదువు పూర్తయ్యాక స్టాండర్డ్ చార్టెర్డ్ బ్యాంక్‌లో ఉద్యోగం వచ్చింది. కొద్దిరోజులు పనిచేశాను. కానీ రోజంతా డబ్బులు లెక్కపెట్టే ఆ ఉద్యోగంలో నాకు తృప్తి లభించలేదు. ఓ సంవత్సరం శలవు పెట్టి గాయకుడిగా నా అదృష్టాన్ని పరీక్షించుకునేందుకు కోల్‌కటా నుండి ముంబాయి వచ్చాను. చాలామంది గాయనీ గాయకుల మాదిరే కెరీర్ ప్రారంభంలో కొన్ని కష్టాలు నేనూ పడ్డాను. అయితే అవన్నీ తీయని బాధలే ! ..గమ్యం చేరడానికి ఆ మాత్రం కష్టపడాలనిపించేది సంగీత దర్శకుడు లక్ష్మీకాంత్‌ను ప్రసన్నం చేసుకోవడానికి ఆయన డ్రైవర్‌కి సిగరెట్లు ఇస్తుండేవాడిని. నదీమ్‌ని కలవటానికి ముందు ఆయన సెక్రటరీతో స్నేహం చేయాల్సివచ్చింది. మొత్తం మీద నేను ముంబాయి చేరిన కొద్ది రోజులకే టీ సీరిస్, వీనస్ సంస్థలు కిషోర్ కుమార్ గీతాల కవర్ ఆల్బమ్ కోసం నాతో పాటలు పాడించారు. కళ్యాణ్-జీ- ఆనంద్‌జీలచే విదేశాలలో సంగీత కార్యక్రమాలకు నన్ను తీసుకెళ్ళి పాటలు పాడించారు. అలా ముంబాయి సంగీత దర్శకుల మనసుల్లో చోటుచేసుకున్నాను " అని చెప్పారు.

### రెండేళ్ళ నిరీక్షణ తర్వాత....

"స్కూల్, కాలేజీ రోజుల్లో గాయకుడిగా ఎన్నో బహుమతులు గెలుచుకున్నా- సినీ సంగీతానికి వచ్చేసరికి....ఇక్కడ పోటీవేరు. ముంబాయి వచ్చాక నలుగురైదుగురు సంగీత దర్శకుల మ్యూజికల్ నైట్స్‌లో పాల్గొన్నా - నాకు గాయకుడిగా తొలి అవకాశం వచ్చింది. 'ప్రేమ్ యోగ్'లో! 1992 లో ముంబాయి వస్తే రెండేళ్ళ తర్వాత 1994 లో బప్పీలహరి 'ప్రేమ్ యోగ్'లో 'జిందగీ చార్ దిన్ కీ' అనే పాట పాడే అవకాశం ఇచ్చారు. ఆ తర్వాత కొన్ని సినిమాలకు పాడినా గుర్తింపు 1998 లో వచ్చిన ఎబిసిఎల్ సంస్థ చిత్రం 'సాత్ రంగ్ కే స్వప్నే' కి వచ్చింది. నదీమ్ - శ్రావణ్ సంగీతం సమకూర్చిన ఈ చిత్రంలో 'ఆతీ హై తో చల్..' అనే పాట పాడేను. ఆ తర్వాత 'హలో బ్రదర్' లో పాడిన 'హటా సావన్ కీ ఘటా ...! 'కహోనా ప్యార్ హై' కోసం పాడిన 'దిల్‌నే దిల్ కో పుకారా....'పాటలు బాగా గుర్తింపు తెచ్చాయి" అని అన్నారు.

### ఇండీ-పాప్‌లోకి...

సహగాయని అల్కా యాజ్ఞిక్‌తో కలిసి 'కోయా కోయా చాంద్' అనే ఇండీ -పాప్ ఆల్బమ్ కోసం పాటలు పాడాడు బబుల్ సుప్రియో. సాజిత్ -వాజిద్ ద్వయం సంగీతం సమకూర్చిన ఈ ఆల్బమ్‌ని టిప్స్ సంస్థ విడుదల చేసింది. ఆ ఆల్బమ్ విజయం అందించిన స్ఫూర్తితో ఈసారి తానొక్కడే 'సోచ్ తా హూఁ' అనే ఇండీ-పాప్ ఆల్బమ్‌ను విడుదల చేశాడు. యూనివర్శల్ సంస్థ రూపొందించిన ఈ ఆల్బమ్‌లోని పాటల్ని ఫాయిజ్ అన్వర్ రాయగా ఒక్కపాట మినహా మిగిలిన వాటిని సమీ - మరూఫ్ స్వరపరిచారు. 'కహీ.... కంగ్నా...' అనే పాటను సలీఫ్ స్వరపరిచారు. ప్రస్తుత మార్కెట్‌లో వున్న ఇండీ-పాప్ ఆల్బమ్స్‌కు భిన్నంగా సాంప్రదాయ రీతిలో సాఫీగా సాగిపోయేలా ఇందులోని పాటలు వుండటం ఓ విశేషం.

'ఈ తొలి సోలో ఆల్బమ్‌కూ విమర్శకుల నుండి ప్రశంసలు రావడంలో ఇప్పుడు మరో ఆల్బమ్ రూపొందించే పనిలో వున్నామని బబుల్ సుప్రియో చెబుతున్నారు.

### నామీద నాకున్న నమ్మకమే కారణం

తన మీద తనకున్న నమ్మకమే ఈ గుర్తింపుకు, విజయానికి కారణమని బబుల్ చెబుతున్నాడు. "మా తాతయ్య గొప్ప సంగీత దర్శకుడు, గాయకుడు అయినా నేనెప్పుడూ ఆయన పేరును ముంబాయ్‌లో పెట్టుబడిగా ఉపయోగించలేదు. అలానే వచ్చిన ప్రతి అవకాశాన్ని వినియోగించు కోవడానికే ప్రయత్నించాను. ఉదిత్ నారాయణ్, కుమార్‌సాను పాడిన అనేక గీతాలకు ట్రాక్ నేనే పాడేవాడిని. ఆ తర్వాత ఆ ట్రాక్ మీదనే వాళ్ళు ఎంత గొప్పగా పాడుతున్నారో గమనించే వాడిని. వారి స్థాయిని చేరడానికి ఎంతో సాధన చేశాను. ఇప్పటికీ రోజూ రెండు గంటలు సంగీత సాధన చేస్తాను. ఇదిగో ఇప్పుడు నాతో మా పాప షర్మీలీ కూడా గొంతు కలుపుతోంది"అని అన్నాడు బబుల్. 'మీ అమ్మాయినీ గాయనిగా సినిమారంగానికి పరిచయం చేస్తారా' అని అంటే - 'ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొని నేనీ స్థాయికీ వచ్చాను. చిన్న వయసులో మా అమ్మాయి ఆ ఇబ్బందుల్ని ఎదుర్కోవటం ఇష్టంలేదు. ముందు గాయనిగా నిష్ణాతురాలైతే- అప్పుడు తప్పక ప్రోత్సాహిస్తానంటాడీ' యువగాయకుడు.

- వి.అరుణ సత్యవతి



అ: వినరో భాగ్యము విష్ణుకథ వెనుబలమిదివో విష్ణుకథ
వినరో భాగ్యము విష్ణు కథ వెనుబలమిదివో విష్ణుకథ
వినరో భాగ్యము విష్ణుకథ....
ఆ: చేరి యశోదకు శిశువితడు
ధారుణి బ్రహ్మకు తండ్రియునితడు
చేరి యశోదకు శిశువితడు
ధారుణి బ్రహ్మకు తండ్రియునితడు
చేరి యశోదకు శిశువితడు.....
అ: అణువేణు పరిపూర్ణమైన రూపము
అణివారి సిరి అంజనాద్రి వీని రూపము
అణువేణు పరిపూర్ణమైన రూపము
అణివారి సిరి అంజనాద్రి వీని రూపము
అణువేణు పరిపూర్ణమైన రూపము
ఆ: ఏమని పొగడుదుమే ఇక నిను ఆమని సొబగుల
అలమేల్ మంగా.... ఏమని పొగడుదుమే
అ: వేడుకొందామా.... వేడుకొందామా....
వేడుకొందామా వేంకటగిరి
వేంకటేశ్వరుని వేడుకొందామా
వేడుకొందామా వేంకటగిరి
వేంకటేశ్వరుని వేడుకొందామా
ఎలమికోరిన వరాలిచ్చే దేవుడే
ఎలమికోరిన వరాలిచ్చే దేవుడే
వాడు అలమేల్మంగ.... వాడు అలమేల్మంగ
శ్రీ వెంకటాద్రి నాథుడే వేడుకొందామా
వేడుకొందామా వేంకటగిరి
వేంకటేశ్వరుని వేడుకొందామా
వేడుకొందామా... వేడుకొందామా....
వేడుకొందామా... వేడుకొందామా..
అ: ఏడుకొండలవాడా వెంకట రమణా
గోవిందా.... గోవింద
ఆ: ఏడుకొండలవాడా వెంకట రమణా
గోవిందా.... గోవింద
అ: ఇందరికి అభయంబులిచ్చు చేయి
కందువగు మంచి బంగారు చేయి
ఇందరికి అభయంబులిచ్చు చేయి
ఇందరికి అభయంబులిచ్చు చేయి

కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామికి భూలోకంలో పూజలు జరుగుతున్నాయి. అక్కడ.... అలవైకుంఠపురిలో.... నగరిలో.... ఆ మూల సౌధంబులో... పద్మావతి, భూదేవి సమేతుడైన శ్రీనివాసుడు అవన్నీ కనులు మూసుకుని ఆలకిస్తున్నాడు. "అన్ని భాషల కీర్తనలు వింటున్నాం. ఆదమరుస్తున్నాం. తెలుగుగడ్డపై ఉంటూ తెలుగుపాట వినడానికి మాత్రం నోచుకోలేకపోతున్నాం" అంది పద్మావతి బాధగా. "ఆ ముచ్చట తీరే సమయం ఆసన్నమైంది దేవీ.... పాటతో ప్రపంచాన్ని పావనం చేయడానికి అనతికాలంలోనే ఆంధ్రావనిలో సంకీర్తనాచార్యుడిగా అవతరించనున్నాడు మన నందకుడు" అంటూ తన నందక ఖడ్గాన్ని భూలోకానికి పంపాడు. శ్రీనివాసునితో పాటు పద్మావతి, భూదేవి, బ్రహ్మసరస్వతులు, శివపార్వతులు, నారద తుంబురులు, సప్తమహర్షులు.... వీరందరి దీవెనలనూ అందుకున్న నందకఖడ్గం - సంతానం కోసం అలమటిస్తూ వేంకటేశ్వర స్వామిని కన్నీళ్లతో ప్రార్థిస్తున్న లక్కమాంబ గర్భాలయంలో ప్రవేశించింది. ఆధ్యాత్మ శృంగార రసవీధులలో స్వేచ్ఛగా విహరిస్తూ పద కవితలకు పట్టాభిషేకం కట్టిన వాగ్గేయకారుడు అన్నమయ్య జన్మించాడు.

అ: ఓం...ఓం..
తెలుగు పదానికి జన్మదినం ఇది జానపదానికి జ్ఞానపథం
ఏడు స్వరాలే ఏడు కొండలై
వెలసిన కలియుగ విష్ణుపదం
అన్నమయ్య జననం.... ఇది అన్నమయ్య జననం
ఇది అన్నమయ్య జననం
అరిషడ్వర్గము తెగ నరికే హరి ఖడ్గమ్మిది నందకము
బ్రహ్మ లోకమున బ్రహ్మ భారతి
నాదాశీస్సులు పొందినదై
శివలోకమున చిద్విలాసమున
ఢమరుధ్వనిలో గమకితమై
దివ్యసభలలో నవ్య నాట్యముల
పూబంతుల చేమంతిగ ఎగసి
నీరద మండల నారద తుంబుర
మహతీ గానపు మహిమలు తెలిసి
స్థిత హిమకందర యతిరాట్సభలో
తపఃఫలమ్ముగ తళుకుమని
ఓం.....
తల్లితనముకై తల్లడిల్లు ఆ లక్కమాంబ గర్భాలయమ్ములో
ప్రవేశించె ఆ నందకము
నందనానంద కారకము
అన్నమయ్య జననం.... ఇది అన్నమయ్య జననం
ఇది అన్నమయ్య జననం
ఆ : పద్మావతియే పురుడు పోయగా
పద్మాసునుడే ఉసురుపోయగా
అ: విష్ణు తేజమై నాద బీజమై
ఆంధ్ర సాహితీ అమర కోశమై
అవతరించెను అన్నమయ
అసతోమా సద్గమయ
అవతరించెను అన్నమయ
అసతోమా సద్గమయ
పాపడుగా నట్టింట పాకుతూ భాగవతము చేపట్టెనయా
హరినామమ్మును ఆలకించక అరముద్దలనే ముట్టడయా
తెలుగు భారతికి వెలుగు హారతై
ఎద లయలో పద కవితలు కలయ
తాళ్లపాకలో ఎదిగే అన్నమయ
తమసోమా జ్యోతిర్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
తమసోమా జ్యోతిర్గమయ







చిన్నతనంలో వేదశాస్త్రాలను ఏక సంధాగ్రాహిగా నేర్చిన అన్నమయ్య సంగీత సాహిత్యాల్లాంటి తన ఇద్దరి మరదళ్లతో ఆడుతూ పాడుతూ పెరిగాడు. తనతో పాటు వేదం చదువుకున్న స్నేహితుల ఆహ్వానం మీద కత్తి యుద్ధాలు, మల్ల యుద్ధాలు జరిగేచోటుకి వెళ్లాడు. అక్కడ కత్తి యుద్ధంలో ఎందర్నో ఓడించిన ఓ యోధుడు విసిరిన సవాలుకి జవాబుగా తను కూడా కత్తి పట్టి రంగంలోకి ఉరికాడు.

వైకుంఠంలో పద్మావతి ఆశ్చర్యపోయింది. "కత్తి అంశతో జన్మించిన వాడు కదా.... పూర్వజన్మ సువాసనలు అంత త్వరగా పోతాయా.... ఒక్కటొక్కటిగా మనమే పోగొట్టాలి" అన్నాడు శ్రీనివాసుడు నర్మగర్భంగా....

ఇక్కడ కత్తియుద్ధంలో అన్నమయ్య జయించాడు. తన మనసుని మరదళ్ల మనసుల్లో పాట ద్వారా లయించాడు.

అ ఏలే ఏలే మరదలా
ఆ: వాలే వాలే వరసలా
అ: నచ్చింది నచ్చింది నాజూకు
ఆ: నీకే ఇస్తా సోకులు
అ: ఇచ్చేయి పచ్చాని సొగసులు
ఆ: చాలు నీ తోటి.... అహ...
చాలు నీ తోటి సరసాలు బావా
అ: ఏలే ఏలే మరదలా
ఆ: వాలే వాలే వరసలా
అ: గాఁటపు గుబ్బలు గదలఁగఁ గులికేవు
మాటలఁ దేటల మరదలా
ఆ: వెంటరి చూపులు విసురుతు మురిసేవు
వాటపు వలపుల వరదలా
చీటికి మాటికిఁ జెనకేవు.....
చీటికి మాటికిఁ జెనకేవు
వట్టి బూటకాలు మానిపోయే బావా
అహ చాలు నీతోటి....
అహ చాలు నీతోటి సరసాలు బావా అ: ॥ఏలే॥
అ: కన్నుల గంతకు కవితలు చిలికేవు
నా ఎద చాటున మరదలా
ఆ: పాడని పాటల పైటల సదిరేవు పల్లవి పదముల దరువులా
కంటికి ఒంటికి కదిపేవు....
కంటికి ఒంటికి కదిపేవు....ఎన్ని కొంటె లీలాలెందుకోలో బావా
అ: అహ పాడుకో పాట
జంట పాడుకున్న పాట జాజిపూతోట ॥ఏలే॥

అన్నమయ్య తన మరదళ్లకు వేద పఠనం అలవరుస్తున్నాడని ఆగ్రహించిన కులపెద్దలు అతని తండ్రి నందనునితో అన్నమయ్యను కట్టడిలో ఉంచమని శాసించారు. ఆ ప్రకారం మరదళ్లను కలవొద్దని తెలిపిన తండ్రి మాటలకు తలవొగ్గి వారికి దూరంగా ఉంటాడు అన్నమయ్య. కానీ సర్వకాల సర్వావస్థలలోనూ వారే అతనికి గుర్తొస్తుంటారు. అతడు తన మనసుని నిగ్రహించుకోలేడని తెలిసిన లక్కమాంబ " మీ నాన్నగారు కూడా నన్ను పెద్దలమాట కాదనే పెళ్లిచేసుకున్నార"ని చెప్పి మరదళ్ల దగ్గరికి పంపిస్తుంది. దాంతో నిత్యాగ్నిహోత్రానికి నీళ్లొదిలిన అన్నమయ్య మరదళ్ల సోయగాల హోమగుండంలో ఆరని తాపాగ్నిలో అంగాంగవర్ణనల మంత్రోచ్ఛాటనతో శృంగార యజ్ఞాన్ని యథేచ్ఛగా సాగించసాగేడు.

ఓం.... శ్రీ పద్మావతే భూదేవే సమేతస్య
శ్రీ మద్వేంకట నాయకస్య నిత్యషోడశోపచార
పూజాం చ కరిష్యే ఆవాహయామి
అ: పదహారు కళలకు ప్రాణాలైన
నా ప్రణవ ప్రణయ దేవతలకు ఆవాహనం...
బృందం: ఓం ఆసనం సమర్పయామి
అ: పరువాల హొయలకు పైయ్యెదలైన
నా ఊహల లలనలకు ఊరువులాసనం
బృందం: ఓం ధ్యానం సమర్పయామి
అ: చిత్తడి చిరు చెమటలా చిందులు చిలికే
పద్మినీ కామినులకు పన్నీటి స్నానం
బృందం: ఓం గంధం సమర్పయామి
అ: ఘలం ఘలన నడల వలన అలసిన
నీ గగన జఘన సొబగులకు శీతల గంధం
బృందం: ఓం నైవేద్యం సమర్పయామి
అ: రతి వేద వేద్యులైన రమణులకు
అనుభవైక వేద్యమైన నైవేద్యం
బృందం: ఓం తాంబూలం సమర్పయామి
అ: మీ తహతహలకు తపనలకు తాకిళ్లకు
ఈ కొసరి కొసరి తాంబూలం
బృందం: ఓం సాష్టాంగ వందనం సమర్పయామి
అ: ఘనం ఘరంగఁ భంగిమలకు
సర్వాంగ చుంబనాల వందనం

"సంకీర్తనలు రచించి ప్రపంచాన్ని పావనం చేయటం అంటే ఇదేనా?" అంటూ విస్తుపోయింది పద్మావతి. "కామిగాక మోక్షగామికాడు అంటారుగా... ఆ దారిలో పడ్డాడు.... ఇక దారి మళ్లించడమే తరువాయి" అంటూ శ్రీనివాసుడు స్వయంగా యతి వేషంలో దిగివచ్చి అన్నమయ్యను ఢీకొన్నాడు.

"అడ్డదారిలో పడి వెనక్కి నడిచేవాళ్లని అదిలించి ముందుకు నడిపేవాణ్ణి... అని ముందు ముందు నీకే తెలుస్తుందిలే... ఈ మాత్రం సౌందర్యానికే ఇంత దాసుడవై పోయావే... ఇంతకన్నా లోకోత్తరమైన సౌందర్యాన్ని చూస్తే ఇంకేమైపోతావో" అన్నాడు. "ఇంతకన్నా సౌందర్యమా.... ఉండదు కాక ఉండదు" అన్నాడు అన్నమయ్య. "నా వెంట రా చూపిస్తాను" అన్నాడా స్వామి. ఆ గుడిపై శృంగార భంగిమలలో ఉన్న శిల్పాలను చూసి "మరి ఇదేంటి?" అన్నట్టు అడిగాడు అన్నమయ్య హేళనగా.... "సకల ప్రపంచానికి ఆధారమైన సృష్టియజ్ఞాన్ని చేస్తున్న తలిదండ్రులు వారు" అని సమాధానమిచ్చాడు స్వామి. తొలిసారి అన్నమయ్యలో కలవరం రేగింది. ముందెన్నడు తనలో కలగని పవిత్రమైన ఊహ అది. సృష్టిలోని శృంగారాన్ని ఆ కోణంలో చూడని అతని అంతర్నేత్రం విచ్చుకుంది. స్వామితో గుడిలో అన్నమయ్య అడుగుపెట్టగానే దీపాలు వెలిగాయి..... గంటలు మ్రోగాయి. ఎదురుగా నున్న విగ్రహం దివ్య తేజస్సుతో భాసిల్లింది. అన్నమయ్యలో ఏదో తెలియని ఉద్వేగం.... అనిర్వచనీయమైన అలజడి... మాటలకందని రసావిష్కరణ గుండెల్లో తన ప్రమేయం లేకుండానే జరిగిపోతోంది. పంచభౌతికమైన అతని శరీరం వాటన్నిటికీ అతీతమైన బ్రహ్మానందాన్ని తట్టుకోలేకపోయింది. అన్నమయ్య స్పృహ కోల్పోయాడు. భక్తి బీజాన్ని అతనిలో అంకురింపజేసిన స్వామి చిరునవ్వుతో అంతర్ధానమయ్యాడు.



స్పృహ తప్పి పడున్న అన్నమయ్యను ఇంటికి తీసుకువచ్చారు. "ప్రభూ... ప్రభూ..." అంటూ ఆ దేవదేవుణ్ణే కలవరిస్తున్నాడు. మధ్యలో ఉలిక్కిపడి లేస్తున్నాడు. "ఏం జరిగింది నాయనా?" అంటూ ఆందోళనగా ప్రశ్నించిన తలిదండ్రులకు తన అనుభూతిని తెలియజేశాడు.

ప: కలగంటి కలగంటి
ఇప్పుడిటు కలగంటి - ఎల్లలోకములకు
అప్పడగు తిరువేంకటాద్రీశుఁగంటి
కలగంటి కలగంటి
ఇప్పుడిటు కలగంటి - ఎల్లలోకములకు
అప్పడగు తిరువేంకటాద్రీశుఁగంటి
ఇప్పుడిటు కలగంటి
చ: అతిశయంబైన శేషాద్రిశిఖరము గంటి
ప్రతిలేని గోపుర ప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుఁగఁగంటి
చతురాస్యు( పొడగంటి
చతురాస్యు( పొడగంటి - చయ్యన మేలుకొంటి
ఇప్పుడిటు కలగంటి
చ: అరుదైన శంఖచక్రాదు లిరుగడఁగంటి
సరిలేని అభయ హస్తమును గంటి
తిరువేంకటాచలాధిపుని చూడఁగ కంటి
హరిఁ గంటి గురుఁగంటి
హరిఁ గంటి గురుఁగంటి - అంతట మేలుకొంటి
కలగంటి కలగంటి
ఇప్పుడిటు కలగంటి - ఎల్లలోకములకు
అప్పడగు తిరువేంకటాద్రీశుఁగంటి
ఇప్పుడిటు కలగంటి
ఇప్పుడిటు కలగంటి

అలా తన్మయత్వంలో మునిగిపోయిన అన్నమయ్య అన్నం నీళ్లు ముట్టడం మానేశాడు. ఎన్ని రోజులైనా ఉలుకూలేదు పలుకూలేదు. ఏదైనా పనిలో పెడితేనైనా మన దారిలో పడతాడేమోనని దర్భలను కోసుకురమ్మన్నారు. దర్భలను కోస్తుండగా చేయి తెగింది. రక్తం బొట్లుబొట్లుగా ప్రవిస్తోంది. వేంకటేశ్వరస్వామి దర్శనానికై తిరుపతికి వెళుతున్న భక్తుల గోవిందనామాలు అతని చెవికి సోకాయి. చేయి చూసుకున్నాడు. పక్కనే ఉన్న రాతిపై రాలిన రక్తపుధారలు శంఖుచక్రాల ఆకృతిలో రూపుదిద్దుకున్నాయి. అన్యాపదేశంగా గమ్యనిర్దేశం అయింది. ఆ భక్తులతో పాటు తను కూడా పయనించాడు అన్నమయ్య. మార్గమధ్యంలో అలసిన వారంతా ఆహారాన్ని స్వీకరిస్తున్నా అన్నమయ్య మాత్రం ఒంటరిగా కూర్చుని ఉన్నాడు అశాంతితో. అంతలో ఓ వృద్ధ బ్రాహ్మణుడు చేతిలో ఓ తంత్రీ వాద్యంతో అక్కడికొచ్చి ఏమీ తినడం లేదేమని అడిగాడు. "ఆ హరివాసం చేరేవరకూ ఉపవాసం చేయదలుచుకున్నాను. ఆ స్వామి గురించి చేసే యాత్రలో అలసిపోయినా, అసలుపోయినా పోయేదేముంది" అన్నాడు అన్నమయ్య. "ఆత్మానందాన్ని కలిగించే మాటన్నావయ్యా" అంటూ పొంగిపోయాడా వృద్ధ బ్రాహ్మణుడు. "ఆ స్వామివారు నారదుడితో ఓసారి స్వయంగా అన్నారట - నారదా... నేను వైకుంఠంలోనూ ఉండను. యోగుల హృదయాల్లోనూ ఉండను. 'ఎక్కడ నా భక్తులు పాడుతూ ఉంటారో అక్కడ తిష్టవేసుకుని కూచుంటాను'- అని.... ఆ ప్రభువుకి గానం అంటే అంత ప్రాణం. ఆ గానానికి నువ్వు ప్రాణం పొయ్యాలి. పాటలతో పరమపదానికి బాటలు వెయ్యాలి. శ్రీనివాస కృపాకటాక్ష సిద్ధిరస్తు" అంటూ తన చేతిలోని తంత్రీవాద్యాన్ని అన్నమయ్య చేతిలోనుంచి, ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు. అతడు వేరెవరో కాదు... బ్రహ్మ మానస పుత్రుడు... నాదబ్రహ్మ.... నారదుడు.

చేతిలోని తంత్రీవాద్యాన్ని విస్మయంగా చూసుకుంటూ ఓ తీగెను మీటాడు అన్నమయ్య. దూరాన తిరుమలలో స్వామి వారి గుడిలో గంటలు గణగణమని నినదించాయి. ఏడుకొండలూ మారుమ్రోగాయి. వెంటనే నారదుని తల్లి సరస్వతి గానం రూపంలో అన్నమయ్య గళసీమనుండి వెలువడింది.

బృందం: ఏడుకొండలవాడా వెంకట రమణా గోవిందా గోవింద
అ: అదివో...ఓ...ఓ...ఓ.....
బృందం: గోవింద గోవింద గోవింద గోవింద గోవింద ॥2॥
అ: అదివో అల్లదివో శ్రీహరివాసము ॥2॥
పదివేలు శేషుల పడగలమయము ॥ అదివో॥
బృందం: ఏడుకొండలవాడా వెంకట రమణా గోవిందా గోవింద
ఏడుకొండలవాడా వెంకట రమణా గోవిందా గోవింద
చ: అదె వేంకటాచలమఖిలోన్నతము
అదివో బ్రహ్మాదులకపురూపము
అదివో నిత్య నివాస మఖిలమునులకు
బృందం: వెంకట రమణ సంకట హరణా ॥2॥
నారాయణా నారాయణా
అ: అదిగో నిత్యనివాసమఖిలములకు
అదే చూడుఁడు అదె మ్రొక్కుఁడు
ఆనందమయము
అదే చూడుఁడు అదె మ్రొక్కుఁడు
ఆనందమయము
అదివో అల్లదివో శ్రీహరివాసము
బృందం: వడ్డీకాసులవాడా వెంకటరమణా గోవిందా గోవింద
ఆపదమొక్కుల వాడా అనాథ రక్షక గోవిందా గోవింద
అ: కైవల్యపథము వేంకటనగమదివో
శ్రీ వేంకటపతికి సిరులైనది
భావింప సకల సంపద రూపమదివో... అదివో...అదివో
బృందం: వెంకట రమణ సంకట హరణ
అ: భావింప సకల సంపద రూపమదివో...
పావనముల కెల్లఁ పావనమయము
అదివో అల్లదివో శ్రీహరివాసము
శ్రీహరివాసము....శ్రీహరివాసము
వెంకటేశా నమో... శ్రీనివాసా నమో ॥2॥
అదివో.... అదివో... అదివో....అదివో...

అలా పాడుకుంటూ ఏడుకొండలు ఎక్కి ఆ శ్రీనివాసుని చేరాలనుకున్న అన్నమయ్య మోకాళ్లపర్వతం చేరకముందే నేలకొరిగాడు. అతనితో పాటు పయనించిన భక్తులందరూ అన్ని కొండలూ ఎక్కి స్వామివారి దర్శనం చేసుకున్నారు. అక్కడ వైకుంఠంలో శ్రీనివాసుడు, పూజారులు నైవేద్యంగా పెట్టిన లడ్డును పద్మావతి, భూదేవితో కలిసి భుజిస్తున్నాడు. ముగ్గురూ





తలా వైపునా కోరికారు. ఇంతలో "ఏడుకొండలవాడా" అంటూ అలమటిస్తున్న అన్నమయ్య పిలుపువినిపించింది. తల్లి పద్మావతి హృదయం కరిగింది. స్వామి వారి చేతిలో నున్న లడ్డుని తీసుకుని భూలోక మార్గం పట్టింది. "పరమ పవిత్రమైన ఈ కొండకు పాదరక్షలతో రావటమే నీ దీక్షలోనిలోపం. ఆ పాదరక్షలు విప్పి చూడు సాలగ్రామమయమై, అణువణువునా ఆ పరమాణు స్వరూపుడు నిండి నిబిడీకృతుడై ఉన్న ఈ తిరుమల కొండ మహిమ నీకే తెలుస్తుంది" అన్నది. అన్నమయ్య తన తప్పును తెలుసుకున్నాడు. పాదరక్షలను పారవేశాడు. వెంటనే అక్కడ సెలయేటి గలగలలలో 'హరి హరి' అంటూ వినిపించింది. ఎందరెందరో మహర్షుల ప్రతిరూపంగా వెలసిన అక్కడున్న చెట్టుచేమాలోంచి ఓంకారనాదం హృదయాన్ని తాకింది. అఖిల క్షేత్రాలు, అన్ని పుణ్యనదులూ అన్నీ తానై అలరారిన ఆ కొండ మహిమను తెలిపిన పద్మావతి తన చేతిలోని లడ్డుని "ఇంద ఈ ప్రసాదాన్ని స్వీకరించు" అంటూ అందించింది. సాక్షాత్తూ స్వామి వారు తనదేవేరులతో ఎంగిలిపడిన ప్రసాదం..... అన్నమయ్యలో మధురరసాలను చిందించింది. పద్మావతి అంతర్థానమయింది.

తిరుమల కొండనెక్కిన అన్నమయ్య శుచిగా స్నానంచేసి, కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామి దివ్యమంగళ రూపాన్ని కనులారా చూసుకున్నాడు. పులకరించిపోతూ తన ప్రాణబంధుడిపై తనివితీరా గానం చేశాడు.

అ: పురుషోత్తమా.... పురుషోత్తమా.... పురుషోత్తమా...
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ముఎడయకవయ్యా కోనేటి రాయఁడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ముఎడయకవయ్యా కోనేటి రాయఁడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
చ: కోరి మమ్ము నేలినట్టి కులదైవమా చాల
నేరిచి పెద్దలిచ్చిన నిధానమా
గారవించి దప్పిదీర్చు కాలమేఘమా...
గారవించి దప్పిదీర్చు కాలమేఘమా...
గారవించి దప్పిదీర్చు కాలమేఘమా...
మాకు చేరువఁ జిత్తములోని శ్రీనివాసుడా ॥పొడ॥
చ: చెడనీక బ్రతికించే సిద్ధమంత్రమా...
ఓం నమో వెంకటేశాయ.... ఓం నమో వేంకటేశాయ
చెడనీక బ్రతికించే సిద్ధమంత్రమా....
రోగాలడఁచి రక్షించే దివ్యౌషధమా
బడిఁ బాయక తిరిగే ప్రాణ బంధుఁడా
బడిఁ బాయక తిరిగే ప్రాణ బంధుఁడా
బడిఁ బాయక తిరిగే ప్రాణ బంధుఁడా మమ్ము
గడియించినట్టి శ్రీవేంకటనాథుఁడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
మమ్ముఎడయకవయ్యా కోనేటి రాయఁడా
పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా
పురుషోత్తమా.... పురుషోత్తమా.... పురుషోత్తమా...

శ్రీనివాసుడు కటాక్షించాడు. నుదుటనున్న తిరునామం అభయహస్తాన ప్రకాశించి అన్నమయ్య ఫాలభాగాన సాక్షాత్కరించింది.

అన్నమయ్య కోసం బెంగపెట్టుకున్న తలిదండ్రులకు అతని ఉనికి తెలియజేయాలనుకున్నాడు ఆ స్వామి. ఎరుక గలిగిన ఆ దేవుడు ఎరుకల వానిగా సతీసమేతుడై వారింటికి వచ్చాడు. తిరుమల కొండలలోనే అన్నమయ్య ఉన్నాడని చెప్పాడు. "అతడు మీ నోముల పంట కాదు పాటల పంట..." అంటూ

" నారాయణతే నమో నమో నారద సన్నుత నమో నమో,
అన్ని మంత్రములు ఇందె ఆవహించెనూ
వెన్నతో నాకు కలిగె వేంకటేశ మంత్రము"

అంటూ అన్నమయ్య రాసిన పాటల గురించి చెబుతూ "ఓంకారం కంటే ఇంకేదో ఉన్నట్టనిపిస్తుంది ఆ పాటలో" అని తెలిపాడు. "మా పెనిమిటికి మీ బిడ్డ పాటలంటే ఎంతో ఇష్టం" అంటూ వత్సాసుపలికారు పద్మావతిదేవి, భూదేవి.

తలిదండ్రులు, మరదళ్లు, అత్తమామలు, స్నేహితులు అందరూ తిరుమలకు ప్రయాణం కట్టారు. అక్కడ అన్నమయ్య స్వామి సేవలో మునిగి ఉన్నాడు. మేలుకొలుపు నుండి పవళింపు సేవ వరకూ ప్రతి సేవా అతని గానామృత రసధారలతో తరించిపోతోంది.

అ: విన్నపాలు వినవలె వింత వింతలు
విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా
విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా
విన్నపాలు వినవలె వింత వింతలు....

కంటి శుక్రవారము గడియలేడింట
అంటి అలమేలు మంగ అండనుండే స్వామిని
కంటి శుక్రవారము గడియలేడింట
అంటి అలమేలు మంగ అండనుండే స్వామిని
కంటి.....

పిడికిట తలంబ్రాల పెండ్లికూతురు
సొంత పెడమరనీ నవ్వీ నీ పెండ్లికూతురు ॥పిడికిట॥
పేరుగల జవరాలీ పెండ్లికూతురు
పెద్దపేరున ముత్యాల మెడ పెండ్లికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు
మిగు పేరు గుచ్చ సిగ్గువడి పెండ్లికూతురు

అ: అలర చంచలమైన ఆత్మనందుండ నీ
అలవాటు చేసెనీ ఉయ్యాల
బృందం: అలరచంచలమైన ఆత్మనందుండ నీ
అలవాటు చేసెనీ ఉయ్యాల
అ: పలుమారు ఉచ్ఛ్వాస పవనముందుండ
నీ భావమ్ము తెలిపెనీ ఉయ్యాల
బృందం: పలుమారు ఉచ్ఛ్వాస పవనముందుండ
అం: నీ భావమ్ము తెలిపెనీ ఉయ్యాల
అ: ఉయ్యాల.. బృందం: ఉయ్యాల...
అ: ఉయ్యాల.... బృందం: ఉయ్యాల...
అ: ఉయ్యాల... బృందం: ఉయ్యాల...
అ: ఉయ్యాల.. బృందం: ఉయ్యాల...



"నా జీవితం స్వామి సేవకే అంకితం... నన్నీ సంసార బంధాలలో ఇరికించకండి" అంటూ తనను తీసుకువెళ్లడానికి వచ్చిన తలిదండ్రులతో కచ్చితంగా చెప్పాడు అన్నమయ్య. కానీ ఆ స్వామి ఊరుకుంటాడా... సతీసమేతంగా మారు వేషంలో సాక్షాత్కరించాడు. "నువ్వు కొలిచే ఆ స్వామికి ఇద్దరు పెళ్లాలయ్యా.... వైవాహిక సుఖంలేని జీవితం, సున్నంలేని ఆకు పండవు" అన్నాడు. స్వామి కళ్లలో,మాటల్లో గల మహత్తుకి అన్నమయ్య మెత్తపడి కరిగిపోయాడు. పెళ్లికి సరేనన్నాడు. స్వామి దగ్గరుండి పౌరోహిత్యం వహించి పెళ్లి జరిపాడు. " ఇద్దరు మరదళ్లకు విడివిడిగా తాళికట్టు. ఒకటిగా చూసుకో" అన్నాడు. అంతే కాదు అన్నమయ్య ఊరేగుతున్న పల్లకిని భుజానకెత్తుకున్నాడు. "ఏమిటీ విపరీత చర్య" అని ఆశ్చర్యపోయింది పద్మావతి. "విపరీతమూ లేదు... వింతా కాదు. శబరి భక్తికి మెచ్చి ఆమె ఇచ్చిన ఎంగిలి పళ్లను తృప్తిగా తిన్నాను. యశోదాదేవి అనురాగానికి ముగ్ధుణ్ణై తన్నులుతిన్నాను. తన మధురమైన కీర్తనలతో మా మనసుని దోచుకున్న ఈ వాగ్గేయకారుడి పాటలకు పరవశిస్తాం. పల్లకీ మోస్తాం. ఇంతకన్నా ఇంకేం చేయగలం దేవీ!?" అన్నాడా శ్రీనివాసుడు పులకించిపోతూ. పద్మావతి కంటనీరు గిర్రున తిరిగింది. తృప్తిగా తల ఆడించింది. భూదేవి తన రెండు చేతులూ జోడించింది ఆ స్వామి ఆపేక్షకు, ఆప్యాయతకు.

అన్నమయ్య సంసార జీవితంలో అడుగుపెట్టాడు. ముగ్గురూ ఒకటై జీవనాన్ని కొనసాగించసాగేరు.

అ: మూసిన ముత్యాలకేలే మొరఁగులు

ఆశల చిత్తాని కేలే అలవోకలు ॥మూసిన॥

ఆ: మూసిన ముత్యాలకేలే మొరఁగులు

ఆశల చిత్తాని కేలే అలవోకలు

బృందం: ఊఁ...ఊఁ...ఊఁ...ఊఁ...ఊఁ...ఊఁ..

అ: కందులేని మోమున కేలే

ఆ: కస్తూరి

అ: చిందు నీ కొప్పున కేలే

ఆ: చేమంతులు

బృందం: గమపప పపప నిపమ గసని

సగమమ మమమ గపద మపని దనిస

అ: మందయానమున కేలే మట్టెలమోతలు

మందయానమున కేలే మట్టెలమోతలు

గంధమేలే పై కమ్మని నీ మేనికి

ఆ: మూసిన ముత్యాలకేలే మొరఁగులు

ఆశల చిత్తాని కేలే అలవోకలు

ఆ: ముద్దు ముద్దు మాటల కేలే

అ: ముదములు

ఆ: నీ అద్దపుఁచెక్కిలి కేలే

అ: అరవిరి

అ: ఒద్దిక కూటమికే లే...

ఏలే...ఏలే...ఏలేలే

ఒద్దిక కూటమికేలే వూర్పులు

నీకు అద్దమేలే తిరువేంకటాద్రీశుగూడి

ఇ: మూసిన ముత్యాలకేలే మొరఁగులు

ఆశల చిత్తాని కేలే అలవోకలు

ఇద్దరు కుమారులకు తండ్రి అయిన అన్నమయ్య తన శేష జీవితాన్ని స్వామివారి పాదాల చెంత గడపడానికి భార్యలతో సహా తిరుమలకి వెళ్లాడు. పెనుగొండరాజైన సాళ్వనరసింహుడు అవివాహితుడు. పొరుగు రాజ్యాల రాకుమార్తెల చిత్ర పటాలను చూసి ఒకామెను పరిణయమాడాలని కలగన్నాడు.

అ: అస్మదీయ మగటిమి తస్మదీయ తకధిమి

రంగరించు సంగమాలు భంగభంగారే భంగా

ఆ: వలపే ఇక తొలుపే చెలి వయ్యారంగా

కథలే ఇక నడిపే కడు శృంగారంగా

అ: పెనుగొండ ఎదనిండా రగిలింది వెన్నెలా.... హలా

అస్మదీయ మగటిమి తస్మదీయ తకధిమి

రంగరించు సంగమాలు భంగభంగారే భంగా

ఆ: ఆ...ఆ...రంగరించు సంగమాలు భంగభంగారే భంగా

బృందం: సాపమ సామగ సాగసనిపస

సాపమ సామగ సమగ గమప మపని పసనిప

ఆ: నీ పని నీ చాటు పని రసలీలలాడుకున్న రాజసాల పని

అ: నా పని అందాల పని ఘనసాళ్వవంశ రసికరాజు కోరు పని

ఆ: ఎపుడెపుడని ఎద ఎద కలిపే ఆ పని

అ: రేపని మరి మాపని క్షణమాపని నా పని

ఆ: పప్పప్ప పని పనిసగమని పని

అ: మమ మని

ఆ: మపనీ

అ: ఆ పని ఏదో ఇపుడే తెలుపని

ఆ: వలపని

అ: అస్మదీయ మగటిమి తస్మదీయ తకధిమి

రంగరించు సంగమాలు భంగభంగారే భంగా ఆ: ఆ...

బృందం: ససససనిస .....సససససనిస ..... ససససనిస .....

అ: ఓ సఖి రాకేందుముఖి

ముద్దులాడు యుద్ధరంగాన ముఖాముఖి

ఆ: ఓ.... సఖా మదనుని జనక

ఈ సందిట కుదరాలి మనకు సంధి ఇక

అ: ఋతువునకొక రుచి మరిగిన మనసైన సఖి

ఆ: మాటికి మొగమాటకు సగమాటలు ఏటికి

అ: పపప పని పనిసగమని మని

ఆ: మమ మని

అ: మ పని

ఆ: పెళ్లికి పల్లకి తెచ్చే వరసకి.... వయసుకి

అ: అస్మదీయ మగటిమి

తస్మదీయ తకధిమి

రంగరించు సంగమాలు

భంగభంగారే భంగా

ఆ: ఆ...ఆ... రంగరించు సంగమాలు భంగభంగారే భంగా

ఆ రాకుమార్తెను వివాహమాడిన సాళ్వుడు అన్నమయ్య కీర్తి విని తిరుగు ప్రయాణంలో అతని వద్ద ఆగాడు. ఆ సమయానికి అన్నమయ్య కొండలలో నెలకొన్న కోనేటి రాయుడైన శ్రీనివాసునిపై గానం చేస్తున్నాడు. పక్కనున్న భార్య ఆ కీర్తనను అక్షరబద్ధం చేస్తున్నది.





కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు
కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు
కొండలంత వరములు గుప్పెడువాడు
కొండలంత వరములు గుప్పెడువాడు
కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు
కొండలంత వరములు గుప్పెడువాడు
కొండలలో నెలకొన్న ..... ఆ..... కొండలలో నెలకొన్న.. ఆ.....
కొండలలో నెలకొన్న కోనేటిరాయుడు వాడు

ఆ గానానికి ముగ్ధుడై ఆస్థాన గాయకుడిగా రమ్మని ఆహ్వానించాడు సాళ్వనరసింహుడు. "మీరు రచించిన కీర్తనలు ప్రజలకు అందాలంటే ప్రచారం కావాలి. అందుకు రాజాశ్రయం ఉండాలి. ఇది శ్రీనివాసుని సంకల్పమేమో" అని అన్నమయ్యకు సలహానిచ్చారు భార్యలు. సరేనన్నాడు అన్నమయ్య. ఎందరెందరో కొలువుతీరిన ఆ నిండు సభలో శ్రీనివాసునిపై శృంగార కీర్తనను గానం చేశాడు అన్నమయ్య.

గోవిందా నిశ్చలానంద మందార మకరంద
నీ నామం మధురం నీ రూపం మధురం
నీ సరస శృంగార కీర్తనలు మధురాతి మధురం స్వామి...
ఆహో

ప: ఏమొకో.... ఏమొకో చిగురుటధరమున
యెడనెడఁ కస్తూరి నిండెనో
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు కదా
ఏమొకో.... ఏమొకో చిగురుటధరమున
యెడనెడఁ కస్తూరి నిండెనో

చ: కలికి చకోరాక్షికిఁ కడ కన్నులు కెంపైతోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరే చెలులు
నలువునఁ ప్రాణేశ్వరుపై నాటిన ఆ కొన చూపులు
నలువునఁ ప్రాణేశ్వరుపై నాటిన ఆ కొన చూపులు
నిలువునఁ పెరుకఁగనంటిన నెత్తురు కాదు గదా
ఏమొకో.... ఏమొకో చిగురుటధరమున
యెడనెడఁ కస్తూరి నిండెనో.... ఆ.... ఆ..

చ: జగడపు చనవుల జాజర సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర....
మొల్లలు కురుముల ముడిచిన బరువున
మొల్లకు సరసపు మురిపెమున
జల్లన పుప్పొడి జారగ పతిపై జల్లేరతివలు జాజర
జగడపు చనవుల జాజర సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర....
భారపు కుచముల పై పై కడు
సింగారము నెఱపెడి గంధమొడి
చేరువ పతిపై చిందగ పడతులు సారెకు జల్లేరు జాజర
జగడపు చనవుల జాజర
సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర....
బింకపు కూటమి పెనమిటి చెమటల
పంకపు ఊహల పరిమళము
వేంకటపతిపై వెలదును నించేరు
సంకుమ దమ్ముల జాజర

బృందం:జగడపు చనవుల జాజర
సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర
సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర
సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర
సఖినల మంచపు జాజర
జగడపు చనవుల జాజర
జగడపు చనవుల జాజర
జగడపు చనవుల జాజర

ఒక సంవత్సరం గడిచింది.

వేంకటేశ్వరుడు - పద్మావతిపై కీర్తనలను రచించినట్లు తనపైనా తన పట్టమహిషి పైనా సంకీర్తనలను వ్రాయమని కోరాడు సాళ్వుడు. తిరస్కరించాడు అన్నమయ్య.

ఆగ్రహంతో అన్నమయ్యను సంకెళ్ల వేయించి కొరడాలతో కొట్టించాడు సాళ్వుడు. నృసింహస్వామి అవతారాన్నెత్తిన వేంకటేశ్వరుని వేంకట నరసింహునిగా కీర్తించాడు అన్నమయ్య.

ప: ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా
కేళీవిహార లక్ష్మీనారసింహా...లక్ష్మీనారసింహా...

చ: ప్రళయ మారుత ఘోరభస్త్రికా పూత్కార
లలిత నిశ్వాసడోలారచనయా
కులశైలకుంభినీ కుముదహిత రవిగగన
చలన విధి నిపుణ నిశ్చలనారసింహా....
నిశ్చలనారసింహా....
దారుణోజ్జ్వల ధగద్ధగిత దంష్ట్రానల
వికార స్ఫులింగ సంగక్రీడయా
వైరిదానవ ఘోర వంశ భస్మీకరణ
కారణప్రకట వేంకటనారసింహా...
వేంకటనారసింహా...వేంకట... నారసింహా...

ఫెళఫెళార్భటాలతో చెరసాల కదిలిపోయింది.
స్థంబాలకు నిప్పంటుకుంది.
సంగతి తెలుసుకున్న సాళ్వుడు కారాగారానికి వచ్చాడు.
అప్పటికే జ్వాలలు మిన్నుముట్టాయి.
అన్నమయ్య మీదుగా వెలువడిన ఒక జ్వాల సింహగర్జన చేస్తూ నృసింహరూపంలో కనిపించింది.
అన్నమయ్య సంకెళ్ల తెగిపడ్డాయి.
సాళ్వునికి కనువిప్పయింది. తన అజ్ఞానాన్ని మన్నించమని వేడుకున్నాడు.
అతడిని, అతడి రాజ్యాన్ని వదిలి స్వామి సన్నిధికి తరలిపోయాడు అన్నమయ్య.
రాజాశ్రయం ద్వారా లభించిన భోగభాగ్యాలను ప్రజలకు పంచి అతనిని అనుసరించారు అతని భార్యలు.
ఓ రోజు కవలలైన ఆ భార్యల పుట్టినరోజు వచ్చింది.
" ఈ రోజు మీ పాట వింటూ కన్నుమూయాలని... అదే... నిద్ర పోవాలని ఉందని " కోరారు. ముగ్గురూ కలిసి గానాన్ని ఆలపించసాగేరు.

ఆ: ఊ...ఊ...నిగమ నిగమాంత వర్ణిత మనోహరరూప
నగరాజ ధరుడా శ్రీ నారాయణా...
అ: నిగమ నిగమాంత వర్ణిత మనోహరరూప
నగరాజ ధరుడా శ్రీ నారాయణా...
నారాయణా.... శ్రీమన్నారాయణా
నారాయణా... వేంకట నారాయణా...ఆ...ఆ...
అ: దీపించు వైరాగ్య దివ్యసౌఖ్యంబియ
లోకటగా నన్ను నొడబరుకుచు పై పై...
ఆ: పై పైనే సంసార బంధముల కట్టేవు
నా పలుకు చెల్లున నారాయణా
ఇ: పై పైనే సంసార బంధముల కట్టేవు
నా పలుకు చెల్లున నారాయణా
అ: నిగమ...
ఆ: గమదని సగమగసని
ఇ: నిగమ నిగమాంత వర్ణిత మనోహరరూప
నగరాజ ధరుడా శ్రీ నారాయణా...
నారాయణా.... శ్రీమన్నారాయణా
నారాయణా... లక్ష్మీ నారాయణా...ఆ...ఆ...
అ: ని సా గాస గాస గాస గాసగా
గనిసగమగ సనిగస నీసాగా
సగమ గమద మదనీ దనిసా మగసానీద మగస
అ: వివిధ నిర్బంధముల.....
ఆ: వివిధ నిర్బంధముల ఎడలగ్రోయక నన్ను
భవ సాగరముల దడ బడజేతురా
అ: దివిజేంద్ర వంద్య శ్రీ తిరువేంకటాద్రీశా.... హరే...
ఆ: హరే....
ఇ: హరే... దివిజేంద్ర వంద్య శ్రీ తిరువేంకటాద్రీశా...
నవనీత చోర శ్రీ నారాయణా....
అ: నిగమ
ఆ: సగమగసని దమదని నిగమ
అ: గసమగ దమ నిద సని
ఇ: నిగమ నిగమాంత వర్ణిత మనోహరరూప
నగరాజ ధరుడా శ్రీ నారాయణా...
నారాయణా.... శ్రీమన్నారాయణా
వేద నారాయణా... వేంకట నారాయణా...
ఆ: తిరుమల నారాయణా అ: హరే....
కలియుగ నారాయణా... హరి హరి నారాయణా
ఆదినారాయణా...... లక్ష్మీనారాయణా...
శ్రీమన్నారాయణా... శ్రీమన్నారాయణా... శ్రీమన్నారాయణా....
అ: హరే....హరే.....

పాడుతూ పాడుతూ ఆ కవలలు చెరో వైపునుండి అన్నమయ్య ఒడిలోకి ఒరిగిపోయి శాశ్వతనిద్రలోకి జారుకున్నారు.అన్నమయ్య ఒంటరివాడై పోయాడు. "భక్తులందరినీ ఇంత కఠినంగా పరీక్షిస్తారేంటి ప్రభూ..." అన్నది భూదేవి - శ్రీనివాసునితో. "నిప్పులో కాల్చి పుటం వేస్తేనే వన్నె చేకూరుతుంది బంగారానికి. బాధల సముద్రంలో మునిగి తేలితేనే వైరాగ్యరస సంపద సమకూరుతుంది. శృంగార ఆధ్యాత్మిక సంకీర్తనలని అపురూపంగా రచించిన అన్నమాచార్యుడు ఇకపై వైరాగ్య శిఖరాలను చేరుకోబోతున్నాడు" అంటూ అన్నమయ్య అవతార పరమార్థాన్ని తెలియజేశాడా స్వామి. హరి నామాన్ని కీర్తిస్తూ అన్నమయ్య తన తీర్థ యాత్రను కొనసాగించ సాగాడు.

గోవిందాశ్రిత గోకుల బృంద
పావన జయ జయ పరమానంద ॥గోవిందా॥
హరినామమే కడు ఆనందకరము
మరుగవో మరుగవో మరుగవో మనసా
హరినామమే కడు ఆనందకరము
మరుగవో మరుగవో మరుగవో మనసా
బృందం: హరినామమే కడు ఆనందకరము
అ: రంగా .... రంగా... రంగ రంగ రంగ పతి రంగనాథ
నీ సింగారాలె తరచాయ శ్రీ రంగనాథా
రంగరంగ రంగపతి రంగనాథ
నీ సింగారాలే తరచాయ శ్రీ రంగనాథా
బృందం: రంగనాథ శ్రీ రంగనాథా రంగనాథ శ్రీ రంగనాథా

ఆ: రాముడు రాఘవుడు రవికులుడితడు
భువిజకు పతియైన పురుషనిధానము
రాముడు రాఘవుడు రవికులుడితడు
భువిజకు పతియైన పురుషనిధానము
రాముడు రాఘవుడు రవికులుడితడు
బృందం: రాం రాం సీతారాం రాం రాం సీతారాం
రాం రాం సీతారాం రాం రాం సీతారాం

అ: పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడూ...
పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడూ...
పరగి నానా విద్యలో బలవంతుడు...
బృందం: పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడూ...

అ: వేదములు నుతింపగా వేడుకలు దైవారగా
ఆదరించి దాసుల మోహన నారసింహుడు...
బృందం: మోహన నారసింహుడూ...
అ: మోహన నారసింహుడూ...

ఆ: చక్కని తల్లికి ఛాంగుభళా...
తన చక్కెర మోవికి ఛాంగుభళా...
చక్కని తల్లికి ఛాంగుభళా...
తన చక్కెర మోవికి ఛాంగుభళా...
చక్కని తల్లికి ఛాంగుభళా...
చక్కని తల్లికి ఛాంగుభళా...

బృందం: గోవిందా గోవింద
అ: కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టెలాయ మహిమలే తిరుమలకొండా... తిరుమలకొండా
కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టెలాయ మహిమలే....
బృందం: తిరుమలకొండా... తిరుమల కొండా...
తిరుమలకొండా... తిరుమల కొండా..





అ: తిరువీధుల వెలిసి ఈ దేవదేవుడు
బృందం: గోవిందా... గోవింద.... గోవిందా...గోవింద
అ: తిరువీధుల వెలిసి ఈ దేవదేవుడు
గరిమల మించిన సింగారముల తోడను
తిరువీధుల వెలిసి ఈ దేవదేవుడు.... దేవదేవుడు....

వృద్ధాప్యం సమీపించింది అన్నమయ్యకి.

తన కీర్తనల ద్వారా అన్ని కులాలవారూ ఒకటేనని చాటాడు

అ: బ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
బ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
పరబ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
బృందం: తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన
అ: పరబ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
బృందం: భళా తందనాన.. భళా తందనాన...
అ: నిండార రాజు నిద్రించు నిద్రయునొకటే
అండనే బంటు నిద్ర అదియూనొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమియొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమియొకటే
ఛండాలు డుండేటి సరి భూమియొకటే
బ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
పరబ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
కడఁగి యేనుగు మీదఁగాయు యెండొకటే
పుడమి శునకముమీఁదఁ పొలయు ఎండొకటే
కడుఁ పుణ్యులను పాపకర్ములను సరిగావ
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే
కడుఁ పుణ్యులను పాపకర్ములను సరిగావ
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే
బ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
పరబ్రహ్మ మొక్కటే.... పరబ్రహ్మ మొక్కటే....
బృందం: తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన
అ: పరబ్రహ్మ మొక్కటే.... బృందం : భళా తందనాన
అ: పరబ్రహ్మ మొక్కటే.... బృందం : భళా తందనాన
అ: పరబ్రహ్మ మొక్కటే.... బృందం : భళా తందనాన
అ: పరబ్రహ్మ మొక్కటే.... బృందం : భళా తందనాన

అన్నమయ్యపై ఆగ్రహించిన కులపెద్దలు అతని కీర్తనలను మంటలకు ఆహుతి చేశారు. "నన్ను కూడా కబళించి నీ ఆకటిమంట చల్లార్చుకో" అంటూ అగ్ని దేవుణ్ణి ప్రార్థించి చితిలో ప్రవేశించాడు అన్నమయ్య. మంటలు చల్లారాయి. అన్నమయ్యకు ఏమీ కాలేదు. అలాగే కీర్తనలు కూడా సురక్షితంగా ఉన్నాయి.

అవి శాశ్వతంగా ఉండాలంటే రాగి రేకులపై చెక్కించాలని, ఆ భాగ్యం తనకు దక్కించమని ప్రార్థించాడు సాళ్వ నరసింహుడు. సరేనన్నాడు అన్నమయ్య.

ఆ ప్రకారం 32వేల కీర్తనలు రాగి రేకులను పునీతం చేశాయి. అది చూసిన అన్నమయ్య తృప్తితో సాళ్వుని ఓ కీర్తన తీసి చదవమన్నాడు.

ప: నానాటి బదుగు నాటకము
కానక కన్నది కైవల్యము
నానాటి బదుగు నాటకము... నాటకము
చ: పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమీ పని నాటకము
యెట్టనెదుటఁ గలదీ ప్రపంచము
కట్ట కడపటిది కైవల్యము

సాళ్వుడు తన్మయుడై పాడుతుండగా అన్నమయ్య చేతినున్న తంత్రీవాద్యపు తీగ తెగిపోయింది. అన్నమయ్యకు అర్థమైపోయింది - కైవల్యం గురించి ఆలోచించవలసిన సమయం ఆసన్నమయిందని! ఆ దేవ దేవుడు తనతో రాయించుకున్న కీర్తనలను తీసుకుని స్వామి సన్నిధానానికి బయలుదేరాడు. శరీరం వృద్ధాప్యం చేత పట్టు పోతున్నది. చేతి కర్ర జారిపడిపోయింది. ఓపిక నశించిన శరీరాన్ని కూడదీసుకుంటూ తూలిపడిపోబోతున్న అన్నమయ్యని శ్రీనివాసుడు పట్టుకున్నాడు.

సాక్షాత్కరించిన తన స్వామిని చూసి పులకించిపోయి అన్నమయ్య "స్వామీ ! ఈ సాక్షాత్కారం కలకాదు కదా!? కల్పన కాదు కదా!? ఆపద మొక్కులవాడా... అన్ని భయాలను పోగొట్టే అభయ హస్తాలతో కరుణామృత ధారలు కురిపించే అదే హస్తంతో నన్ను కౌగిలించుకున్నావా.... నా తల్లులిద్దరికీ నిలయమైన నీ గుండెలపైకి నన్ను చేర్చుకున్నావా!? నాతో పలికించుకున్న నీ కీర్తనలకు ప్రతిఫలంగా ఇంత పెద్ద కూలీ ముట్టజెప్పావా? నా జన్మ తరించింది..... చరితార్థమయింది.... ఏడుకొండలవాడా.... ఇదిగో.. ఇదిగో ... నీ సొమ్ము.... ముప్పై రెండు వేల సంకీర్తనలు... ఈ చిరుకానుకను నీ హృదయ భాండాగారంలో దాచుకో....

దాచుకో నీ పాదాలకు తగ నే చేసిన పూజలివి
పూచీ నీ కీరితి రూప పుష్పములివె అయ్యా
దాచుకో...
దాచుకో...
దాచుకో...

అంటూ గుండె ద్రవించిపోయేలా వేడుకున్నాడు.

ఆ స్వామి తన చల్లని చూపులతో అన్నమయ్య దగ్గరకొచ్చి "దాచుకుంటాన్లే గానీ.... ఏవిటీ అప్పుడే లెక్కలు అప్పజెప్పుతున్నావ్" అన్నాడు.

"అప్పుడే ఏంటి స్వామీ.... ఈ కట్టెపుట్టి తొంభై అయిదు సంవత్సరాలు గడిచింది" అన్నాడు అన్నమయ్య.

"పోయిన ఆ కాలాన్ని వెనక్కి తిప్పి, అఖిల సృష్టి ధర్మాలను అధిగమించి, నీ ఆయుష్షుని పెంచుతాను. మాలాగా ఎప్పుడూ యవ్వనంతో ఉండే వరం ప్రసాదిస్తాను" అన్నాడు చరాచర జగత్తుని శాసించే ఆ సర్వాంతర్యామి.

అన్నమయ్య నవ్వుకున్నాడు "నటన సూత్రధారీ...." అంటూ.. "నీ పరమ పదపు సోపానపు ఆటలో కోర్కెల నిచ్చెనలు ఎక్కించటం, ఆశల పాములతో మింగించటం మాకు కొత్తేమీ కాదులే... ఇంకా ఈ దేహంపై మోహం ఉందా, పోయిందా అని పరీక్షిస్తున్నావు కదూ గోవిందా...." అన్నాడు భక్తితో చనువుగా.

"ఇది పరీక్ష కాదు" అన్నాడు స్వామి



"కాకపోతే ఏమిటి మరి" అడిగాడు అన్నమయ్య ఆశ్చర్యంగా

"నీ కీర్తనలపై నా వ్యామోహం. పాటతో మా హృదయ సామ్రాజ్యాన్ని పరిపాలించిన కవి మహారాజువు నువ్వు. నీ పాటలు విని నేనెంత పులకించానో... ఎంత పరవశించానో ఎలా చెప్పను !? ఒకనాడు.... ఒకనాడు.. నువ్వు నా ఏకాంత సేవా సమయంలో

**జో అచ్యుతానంద జో జో ముకుందా**

**లాలి పరమానంద రామగోవిందా జో జో**

అంటూ అన్నమయ్య రాసి రాగం కట్టిన వరసలోనే గానం చేశాడా స్వామి. అన్నమయ్యకి గుండె చెరువైపోయింది. సృజనాత్మక చరిత్రలో చారిత్రాత్మక ఘట్టం అది. తన గుండెల్లో పురుడుపోసుకున్న కళారూపాలు.... ఆ గుండెల్లో ఊపిరి నింపిన పరమాత్ముని నోట పలుకులై ప్రవహిస్తుంటే పరవశించి పరవళ్ళు తొక్కని కవి హృదయం ఉంటుందా!? 'నా పాట మీ నోట ...' అన్నాడు గుండె గొంతుకలోన కొట్లాడుతూ ఉండగా..

"ఒక్క పాటేమిటి ఇంకొక నాడు మా దేవేరులకు మంగళ నీరాజనాలను సమర్పిస్తూ మరో అద్భుత కీర్తన ఆలపించావు.... ఆ కీర్తన.." అంటూ తడుముకున్నాడు స్వామి. అన్నమయ్య రచించిన ఎన్నో కీర్తనలు జ్ఞాపకాలను చుట్టుముడుతుంటే ఉక్కిరిబిక్కిరి అవుతూ "పద్మా... పద్మా... ఏమిటది" అని అడిగాడు. ఆ కీర్తనల మాధుర్యాన్ని చవి చూచిన తల్లిగుండె ఉప్పొంగింది. క్షీరధారలు గానామృత రూపంలో పెల్లుబికాయి.

**"ఆ... ఆ... క్షీరాబ్ధి కన్యకకు శ్రీ మహాలక్ష్మికిని**

**నీరజాలయమునకు నీరాజనమ్ నీరాజనమ్ నీరాజనమ్"**

అంటూ తను కూడా అన్నమయ్య చేసిన వరసలోనే ఆలపించింది పద్మావతి. ఆ మాధుర్యానికి మై మరచిపోతూ

"ఆహా... ఆ కీర్తనలకు ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం" అన్నాడు శ్రీనివాసుడు.

అన్నమయ్య గుండెల్లో తీపి జలదరింపు..... గొంతు మూగపోయింది... భరించలేనంత తృప్తి అతడిని ఉద్వేగానికి గురిచేస్తుంటే అటు వైపు తిరిగి గుండెను చిక్కపట్టుకున్నాడు.

"నమ్మడం లేదు కదూ... పద్మా.... భూదేవీ... చెప్పండి.... మీరైనా చెప్పండి.... ఆ సంకీర్తనలంటే మాకెంత మక్కువో" అన్నాడు స్వామి ప్రాధేయపడుతున్న స్వరంతో.

"అవును అన్నమయ్యా.. ఆ సంకీర్తనల కోసమే స్వామి వారు యతిగా మారి ఏడుకొండలూ దిగివచ్చి నిన్ను ఢీకొని నీ దారి మళ్ళించారు" అంటూ గుర్తు చేసింది పద్మావతి.

అన్నమయ్య హృదయ సంద్రంలో ఓ జ్ఞాపకాల అల ఉవ్వెత్తున ఎగసి మనసు పొరలను ఢీకొంది.

"ఆ సంకీర్తనల కోసమే స్వయంగా పురోహితులై నీ పెళ్లి జరిపించారు" అంది భూదేవి.

మరో అల మళ్లీ మనసు పొరలను అభిషేకించింది.

"అనంత ప్రకృతి మండలాలను మోసే పావన భుజ స్కందాలపై నీ పల్లకి మోశారు" అంది పద్మావతి.

తడిసి ముద్దయిపోయిన మనసు పొరలు అలల తాకిడికి చివికిపోసాగాయి.

"నువ్వెళ్లిపోతే అలా ఎవరు పాడతారు, ఎవరు మమ్మల్ని ఆడిస్తారయ్యా" అన్నాడు స్వామి రుద్ధ కంఠంతో గాద్గదిక స్వరంతో... అలా అంటున్నది పరమాత్ముడు కాదు పరమాప్తుడు. అన్నమయ్య గుండెకు చిల్లుపడిపోయింది.

"ఆహా.... నా పాటలు లోకాలను ఆడించే మిమ్మల్ని ఆడించాయా... వాటిని మీరు గుర్తుంచుకుని మళ్లీ పాడి వినిపించేంతగా అలరించాయా.... చాలు స్వామి చాలు.... నాకు పట్టలేని అలిసిపోయేంత ఆనందం కలుగుతోంది" అన్నాడు అన్నమయ్య చిల్లుపడినా బరువెక్కి పోతున్న తన గుండెను మోయలేక మోయలేక మోస్తూ.

"అమ్మా ... అమ్మా... ఈ ఆనందం నాకు దూరం కాకముందే మోక్షలోకం అనుగ్రహించమని చెప్పండమ్మా.... చెప్పండమ్మా..." అంటూ అర్థించాడు తల్లుల వంక చేరి.

ఆయుష్షుని, శక్తివంతమైన యవ్వనాన్ని ప్రసాదిస్తానంటుంటే ఇతగాడేమిటి ఇలా అడుగుతున్నాడని చిన్నబుచ్చుకున్నాడు స్వామి.

"వినరు... ఈ భక్తులు మా మాట వినరు... వాళ్లు చెప్పిందే మేం వినాలి..." అన్నాడు చిరు అలకతో... అంతలోనే మెత్తబడ్డాడా భక్తసులభుడు. అన్నమయ్య ఎవరు... తన సృష్టికాదూ... తన మీదే తను అలగడమా... కరిగిపోయాడు.... "వింటాం... కానీ అంతకుముందు మనసారా ఇంకొక్క కీర్తన వినాలనుంది" అంటూ రాగాల గారాలతో అడిగాడు - 'నిన్ను నాలో కలుపుకునే ముందు - నాముందు ఒక్కసారి అమృతాన్ని ఆవిష్కరించ' మన్నట్టు.

అమృతాన్ని పంచిన ఆ జగన్మోహనుడు 'నీవు పంచినదే అమృతం' అంటుంటే ఆ ఆత్మానందానికి అవధులు ఉంటాయా !?

"అవును స్వామీ.... " అంటూ పతిని సమర్థించి "ఒక్కపాట పాడవా అన్నమయ్యా" అని అన్నమయ్య గడ్డం పట్టుకు బ్రతిమాలింది పద్మావతి.

అన్నమయ్యకు కళ్లూ, గుండె ఏకకాలంలో సప్తసముద్రాలైపోయాయి.

"అమ్మా... అమ్మా... ఎంత దయ చూపిస్తున్నారమ్మా... ఈ జన్మకు ఇంతకన్నా ఇంకేం కావాలమ్మా... మీరు ప్రత్యక్షం కావటం, ప్రశంసించడం, పాడమని శాసించడం... ఇదిగాక సౌభాగ్యమిదిగాక తపము మరి ఇదిగాక వైభవమ్మింకొకటి కలదా...." అంటూ కన్నీళ్లెట్టుకున్నాడు.

"పాడతాను తల్లీ.. పాడతాను" అంటూ అంతరాలెరుగని ఆ అంతర్యామిని అంతరంగమంతటా చివరిసారి తనివిదీరా నింపుకుంటూ, నిలుపుకుంటూ గాన రసగంగతో అభిషేకించ సాగేడు.

**అంతర్యామి అలసితి సొలసితి**

**ఇంతట నీ శరణిదే చొచ్చితినీ...**

**అంతర్యా...మి... అలసితి... సొలసితి...**

**కోరిన కోర్కులు కోయని కట్లు**

**తీరవు నీవవి తెంచక...**

తూలిపోతున్న అన్నమయ్యను పట్టుకుని తనవంతుగా తన గొంతును కలిపాడు శ్రీనివాసుడు.

**కోరిన కోర్కులు కోయని కట్లు**

**తీరవు నీవవి తెంచక...**

**భారపు పగ్గాలు పాప పుణ్యములు**

ఆవేదనతో అంతర్యామి గుండె కూడా బరువెక్కింది. గమనించిన పద్మావతి






భారపు పగ్గాలు పావ పుణ్యములు
మేలుకొన పోవు నీవు వద్దనక
అంటూ అందుకుంది.
అన్నమయ్య మళ్ళీ ఊపిరి కూడదీసుకుంటూ
అంతర్యామి అలసితి సొలసితి
ఇంతట నీ శరణిదే చొచ్చితినీ...
అంతర్యా...మి...
అంటూ కొనసాగించాడు.
దగ్గరలో ఉన్న పూలను స్వామి పాదాలపై ఉంచాడు. మళ్ళీ తూలిపోయాడు. పక్కనే ఉంచిన ప్రమిద క్రిందపడి పగిలిపోయింది. నేలపై ఒలికిన కొద్దిపాటి చమురుతో ఒత్తి మిణుకు మిణుకుమంటూ వెలుగుతోంది - అన్నమయ్య ప్రాణదీపంలా...
మదిలో చింతలు మైలలు మణుగులు
వదలవు నీవవి వద్దనక
అంటూ పాడుతుండగా మధ్యలో గుండెలవిసిపోయాయి అన్నమయ్యకి. ఈ సారి శ్రీనివాసుడు పాట భారాన్ని సతీసమేతంగా గొంతుకెత్తుకున్నాడు
మదిలో చింతలు మైలలు మణుగులు
వదలవు నీవవి వద్దనక
ఆఖరు ప్రయత్నంగా అన్నమయ్య శక్తినంతటినీ కూడదీసుకుని
ఎదుటను శ్రీవేంకటేశ్వరా... వేంకటేశా...
శ్రీనివాసా.... ప్రభో....
అంటూ చేతులు జోడించి గుండెను, గొంతును ఏకం చేశాడు
ఎదుటను శ్రీవేంకటేశ్వరా... నీవదే
అదనుగాచితివి అట్టిట్టనక
అంతర్యామి అలసితి సొలసితి
ఇంతట నీ శరణిదే చొచ్చితినీ...
అంతర్యామి... అంతర్యామి... అంతర్యామి... అంతర్యామి... అంతర్యామి...
అంతర్యామి... అంతర్యామి... అంతర్యామి... అంతర్యామి... అంతర్యామి...

అంటుండగా పద్మావతి, భూదేవి, శ్రీనివాసుడిలో కలిసిపోయారు. ఆ దివ్యమంగళ స్వరూపం అన్నమయ్య ఎలుగెత్తి పిలుస్తున్న కొద్దీ ఎదిగిపోసాగింది. విశ్వమంతా ఆక్రమించుకున్న ఆ విరాట్ రూపాన్ని చూస్తూ
అలసితి...
అన్నాడు అన్నమయ్య. అతనిలోని దివ్యజ్యోతి నందక ఖడ్గమై ఓంకార సహితమై దేవదేవునిలో ఐక్యమైంది.

బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము దానెనీ పాదము
బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము దానెనీ పాదము
బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము దానెనీ పాదము
బ్రహ్మ కడిగిన పాదము
చెలఁగి వసుధ గొలిచిన నీ పాదము
బలి తలమోపిన పాదము
తలఁకక గగనము తన్నిన పాదము
తలఁకక గగనము తన్నిన పాదము
బలరిపుఁ గాచిన పాదము
బ్రహ్మ కడిగిన పాదము
పరమ యోగులకుఁ పరిపరి విధముల
వరమొసఁగెడి నీ పాదము
తిరువేంకటగిరి తిరమని చూపిన
పరమపదము నీ పాదము
బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము దానెనీ పాదము
బ్రహ్మ కడిగిన పాదము

## సర్వేజనా స్సుఖినో భవంతు

### తారాగణం

అక్కినేని నాగార్జున, డాక్టర్ మోహన్‌బాబు, సుమన్, రమ్యకృష్ణ, రోజా, భానుప్రియ, కస్తూరి, శ్రీకన్య, బ్రహ్మానందం, గుండుహనుమంతరావు, కోట శ్రీనివాసరావు,తనికెళ్లభరణి, బాలయ్య, సుత్తివేలు, మల్లికార్జునరావు, శుభ, శివపార్వతి తదితరులు

**అతిథి నటులు**
ఏవీయస్, బాబూ మోహన్






## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ - మాటలు | : జే.కే. భారవి |
| పాటలు | : తొలి తెలుగు వాగ్గేయకారుడు అన్నమయ్య, వేటూరి సుందరరామమూర్తి (తెలుగు తనానికి, ఏలే ఏలే మరదలా, అస్మదీయ మగటిమి), జే.కే. భారవి (పదహారు కళలకు) |
| నేపథ్యగానం | : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, నాగూర్‌బాబు, యం.యం.కీరవాణి, చిత్ర, సుజాత, సింధు, శ్రీలేఖ, అనురాధా శ్రీరామ్, గంగాధర్, శ్రీ వేదవ్యాస ఆనంద భట్టార్ |
| సంగీత సహకారం | : శ్రీ వేదవ్యాస ఆనంద భట్టార్, జెమినీ రావు, శ్వేతనాగ, గిరిజాపతి, కళ్యాణ రమణ |
| మేకప్ | : మల్లికార్జునరావు, వెంకట్, సుబ్బారావు, రామకృష్ణ, వేంకటేశ్వరరావు, మోహన్, భాస్కర్ |
| నాగార్జున పర్సనల్ | : బొమ్మదేవర రామచంద్రరావు (మేకప్), శేఖర్‌బాబు(కాస్ట్యూమ్స్), పాండు (విగ్) |
| ప్రెస్ రిలేషన్స్ | : బి.ఎ.రాజు(మద్రాసు), వినాయకరావు (హైదరాబాద్) |
| డబ్బింగ్ | : ప్రసాద్ థియేటర్ |
| ప్రాసెసింగ్ & ప్రింటింగ్ | : ప్రసాద్ ఫిలిం లేబరేటరీస్ (హైదరాబాద్) |
| పబ్లిసిటీ డిజైన్స్ | : ఈశ్వర్ |
| స్టిల్స్ | : సెబాస్టియన్ బ్రదర్స్ |
| స్టూడియోస్ | : అన్నపూర్ణ, పద్మాలయ, రామకృష్ణ |
| నృత్యాలు | : డి.కె.యస్. బాబు (ఏలే ఏలే మరదలా, అస్మదీయ మగటిమి) ముక్కురాజు (బ్రహ్మ మొక్కటే) సుచిత్ర (జగడపు చనువుల జాజర) |
| చీఫ్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : దుద్దుకూరు యోగానంద్ |
| చీఫ్ కో - డైరెక్టర్ | : జి.సి.శేఖర్ |
| పోరాటములు | : రాజు |
| కళ | : భాస్కరరాజు |
| సహదర్శకుడు | : ఎ. సత్యరవీంద్రబాబు |
| ఎడిటర్ | : ఎ.శ్రీకర్ ప్రసాద్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ & స్పెషల్ ఎఫెక్ట్స్ | : విన్సెంట్, అజయ్ విన్సెంట్ |
| సంగీతం | : యం. యం. కీరవాణి |
| నిర్మాత | : వి. దొరస్వామి రాజు |
| దర్శకత్వం | : కె. రాఘవేంద్రరావు బి.ఏ. |


వి.దొరస్వామి రాజు


కె.రాఘవేంద్రరావు


యం.యం.కీరవాణి


వేటూరి


యస్.పి.బాలసుబ్రహ్మణ్యం


చిత్ర

కూర్పు : వరదా సాయికుమార్, పర్లాకిమిడి (ఒరిస్సా), టి.నవీన్, హైదరాబాద్



# సరిగపదమని



25

## చిరంజీవి స్పెషల్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ● | 3 | 4 | | ● | 5 |
| | ● | | ● | ● | | ● | 6 | |
| | ● | | ● | 7 | ● | 8 | ● | |
| ● | 9 | ● | 10 | | 11 | ● | 12 | ● |
| 13 | | ● | | ● | | ● | 14 | |
| ● | | ● | | 15 | ● | 16 | ● | ● |
| 17 | ● | 18 | | ● | 19 | | | 20 |
| | ● | | ● | 21 | ● | | ● | |
| 22 | | ● | 23 | | | ● | 24 | |

**అడ్డం:-**

1. '......... కలిసిన నవరాత్రి సిగ్గుపడితే శివరాత్రి' హిట్లర్ చిత్రంలోని గీతం (3)
3. 'సిగ్గు ......... విరిసే సీతామాలచ్చి' స్వయంకృషి చిత్రంలోని పాట (3)
6. 'అబ్బో నీ ...... గొప్పదే అందం పోగేసి కన్నదే' (2)
8. 'తమ్ముడూ అరె తమ్ముడూ ...... తికమక తెగులే ప్రేమంటే' చిరంజీవి పాడిన పాట (1)
10. 'సయ్యారే సయ్య ......... అన్నయ్య'(3)
13. 'తరలిరాదా తనే వసంతం ...... దరికి రాని వనాలకోసం' 'రుద్రవీణ' చిత్రంలోని గీతం (2)
14. 'యమహో నీ............. అందం' 'జగదేకవీరుడు - అతిలోక సుందరి చిత్రం లోని పాట (2)
15. '...... చిరంజీవా జగదేకవీరా'ఇది కూడా జగదేకవీరుడు అతిలోకసుందరి చిత్రం లోని గీతమే (1)
18. '......... గోరింకతో ఆడందిలే బొమ్మలాట' (3)
19. 'రగులుతోంది మొగలి......' ఖైదీ చిత్రంలోని గీతం (2)
22. 'మళ్ళీ మళ్ళీ ఇది రాని ...... మల్లెజాజి అల్లుకున్న.......'(2)
23. '......... కొట్టాలిరా సిక్స్ కొట్టాలి ఆడితే ఆడాలిరా రఫ్ ఆడాలి' (3)
24. 'అబ్బబ్బ ఇద్దూ ........రేలా ముద్దు (2)

**నిలువు:-**

1. 'యమహా ....... కలకత్తాపురి' 'చూడాలని వుంది చిత్రంలోని గీతం (3)
2. 'అమ్మనీ తియ్యనీ దెబ్బ ఎంత ....... వుందిరోయబ్బా' (3)
4. '....... చామంతీ ముద్దాడుకున్నాయిలే' (2)
5. 'బొరా .......చల్లా అలకించి నమ్మడమెల్లా' ఆపద్బాంధవుడిలో పాట (3)
7. 'ఈ పేటకు ..... మేస్త్రీ నిరుపేదలపాలిట పెన్నిధి' ముఠామేస్త్రి చిత్రంలోని పాట(2)
9. 'అరె ఏమైంది ఒక.........కి రెక్కలొచ్చి ఎక్కడికో ఎగిరింది' (3)
10. '......... సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి అహుతిచ్చాను' (2)
11. '...... చిలకమ్మా ప్రేమా మొలకమ్మా' (2)
12. 'కాశ్మీరు......లో కన్యాకుమారిలో ఓ చందమామ' పసివాడి ప్రాణం చిత్రంలోని గీతం (2)
16. 'శుభలేఖ రాసుకున్నా........... ఎపుడో' కొండవీటి దొంగ చిత్రంలోని పాట (3)
17. 'అత్తో అత్తమ్మ.......' అల్లుడా మజాకా లోని పాట (3)
18. 'అడ్డం ఇరవైనాలుగు నిలువు ఒకటి లోని పాటలను చిరంజీవితో తీసిన దర్శకుని పేరులో తొలి సగం'(2)
20. '........ మల్లెచెండు నచ్చింది గర్ల్ ఫ్రెండు' (3)
21. 'బంగారు ......పెట్ట వచ్చెనండి' ఘరానా మొగుడు చిత్రంలోని పాట (2)

పంపినవారి పేరు :.......................................................................

వయసు :........... వృత్తి :.......................................................................

చిరునామా :.......................................................................

.......................................................................

..................................................ఫోన్ :.......................................

**పజిల్, కూపన్ 31-08-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని'అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరువిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.




This feature is sponsored by :




మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)





# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 19

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి బావమరిది హనుమంతు కొడుకు గోపాలంతో సహా వచ్చి అమెరికానుండి వచ్చామని కోతలు కోస్తాడు. అశ్వినిని గోపాలానికి ఇవ్వడానికి విష్ణుమూర్తి నిశ్చయిస్తాడు. కానీ అశ్విని ఆత్మహత్యకు ప్రయత్నించడంతో మనసు మార్చుకుంటాడు. గోపాలం జైల్లో తనకు పరిచయమైన బాషా అనే రౌడీ ద్వారా శ్రీరామ్‌ను చంపించడానికి ప్లాను వేస్తాడు.

- ఇక చదవండి

ఒకప్పుడు అధికార పక్షంలో కూర్చుని అరగంటకోసారి హామీలు గుప్పిస్తూ చట్టాలు చేసినవాళ్లు- ఆ తర్వాతెప్పుడో ప్రతిపక్షానికి 'రివర్సయి'పోయి 'కుడి ఎడమైతే గ్రహపాటేనోయ్' అని కొత్త పాటలు పాడుకోక తప్పదు. 'ఓడలు బండ్లు-బండ్లు ఓడలూ' అవుతాయని అనుభవజ్ఞులు అవివేకంతో చెప్పలేదు....

ఇప్పుడు వీరభద్రం పరిస్థితి అలాగే వుంది!..ఒకనాడు కాళ్ళదగ్గర కొచ్చిన బేరాన్ని- కళ్ళుమూసుకుని తన్నిపారేశాడు...ఇపుడు అదే 'సరుకు'కోసం కాళ్లీడ్చుకుంటూ మరీ వచ్చాడు.

శ్రీరామ్‌ని తన కూతురు గాఢంగా ప్రేమించిందనీ- వాళ్ళిద్దరికీ పెళ్లి జరిపించి ఓ ఇంటి వాళ్ళను చేద్దామనీ-ఆరోజు విష్ణుమూర్తి పనిగట్టుకొని తన ఇంటికొచ్చి ప్రాధేయపడ్డాడు. 'ప్రేమించటాలూ, కామించటాలూ-తమ సంప్రదాయానికి విరుద్ధమనీ'అసలు తన కొడుకు సాక్షాత్తు పురాణకాలంనాటి శ్రీరామచంద్రుడు లాంటి వాడనీ, తండ్రిమాట జవదాటడనీ-పైగా 'ప్రేమ'అనే పదానికి అర్థం, తాత్పర్యం వగైరాలు తెలియవనీ -ఎట్టిపరిస్థితుల్లోనూ తన కొడుక్కి వాళ్ళమ్మాయితో పెళ్లి జరగదనీ' విర్రవీగిపోతూ

సమాధానం చెప్పాడు.

అంతటితో ఆగినా ఫర్వాలేకపోయేది.

'తను తల్చుకుంటే-తన కూతురుకి అరగంటలో అమెరికా అల్లుణ్ణి కొనగలన'ని విష్ణుమూర్తి శపథం చేస్తే-అమెరికాలో 'ఎయిడ్స్' రోగం తీవ్రంగా వుందనీ - ఆ రాబోయే అమెరికా అల్లుడికి అలాంటిదేదైనా సంక్రమించి వుందేమో-రక్తపరీక్ష చేయించి తెలుసుకొమ్మనీ, పెడసరాలు పోయాడు...

ఇప్పుడు కొడుకు చేసిన ప్రతిజ్ఞకీ-చిదంబరం ఇచ్చిన సలహాకీ, అర్థంతరంగా వచ్చిన గుండెపోటుకీ-తలవంచి విష్ణుమూర్తిని ఆశ్రయించేందుకు రాక తప్పలేదు వీరభద్రానికి.. మధ్యవర్తిగా వుండి మాట సాయం చేయటానికీ, వ్యవహారాన్ని సజావుగా నడిపించటానికీ చిదంబరాన్ని వెంట తెచ్చుకున్నాడు.

ఇద్దరూ-విష్ణుమూర్తి బంగళాముందు టాక్సీ దిగి-హాల్లో అడుగుపెట్టారు.. అక్కడెవరూ కనిపించకపోయేసరికి -గుమ్మంలోనే నిలబడిపోయారు..'ఏ నౌకరైనా హాల్లోకి రాక పోతాడా' అని చిదంబరం ఎదురు చూస్తూంటే-మహారాజుల సభామందిరాన్ని తలపింప చేస్తున్న -ఆ హాలు అందాన్ని విస్మయంగా గమనిస్తున్నాడు వీరభద్రం.

సరిగ్గా అదే సమయంలో మేడమీది బాల్కనీలోకి వచ్చిన అశ్విని వాళ్ళిద్దర్నీ చూసింది.

"రండి - అంకుల్...కూచోండి!" అంటూనే మెట్లుదిగి వచ్చింది.

అప్రయత్నంగా అటు తిరిగి ఇద్దరూ ఆమె వైపు చూశారు.

"మన శ్రీరామ్ ప్రేమించింది ఆ పిల్లనే అయ్యుంటుందిరా"-అన్నాడు చిదంబరం వీరభద్రానికి మాత్రమే వినిపించేలా.

"కావచ్చును!.. చందమామంతటి ఎత్తు అందముగా వుండునని-ఆరోజు విష్ణుమూర్తి గారి వెంట వచ్చిన పెద్దమనిషి చెప్పివున్నాడు. ఈ పిల్ల అట్లే వున్నది!" కళ్లు పెద్దవిగా చేసుకుని ఆమె వైపు విస్మయంగా చూస్తూనే చెప్పాడు వీరభద్రం.

"అది సరే !..నువ్వు ఆ గ్రాంథికాన్ని కాసేపు మర్చిపోయి....వ్యవహారికంలో వ్యవహరించు.. లేకపోతే ఆ పిల్ల బెదిరిపోతుంది!" నెమ్మదిగా హెచ్చరించాడు.

"అట్లే...అట్లే...!"

"అదిగో..మళ్లీ!"

"సరే...సరే!"

"రాజుపాలెం నించే వస్తున్నారా అంకుల్"? -వాళ్ళను చేరుకున్న అశ్విని అడిగింది చిరునవ్వుతో.

ఆ ప్రశ్న విని కొంచెం ఆశ్చర్యంగా చూశాడు వీరభద్రం.

"మేం..తమరికి...అదే ...నీకు తెలుసా?" అడిగేడు.

"తెలుసంకుల్! మీ అబ్బాయి తన మనీ




పర్సులోంచి మీ ఫొటో ఓసారి తీసి చూపించాడు... అదీగాక, మీరూ ఈ చిదంబరం గారూ కలిసి అక్కడ టాక్సీలో బయల్దేరగానే-నాకు శ్రీరామ్ ఫోన్ చేసి చెప్పాడు"- కొంచెం గర్వాన్నీ ఇంకొంచెం బిడియాన్ని ఒలకపోస్తూ బదులిచ్చిందామె. వీరభద్రం,చిదంబరం ఒకరికొకరు చూసుకున్నారు.

"ఈ కాలం పిల్లలు ఎంత 'ఫాస్టు'గా వుంటున్నారో చూశావా?" -అన్నాడు చిదంబరం కనుబొమలు ఎగరవేస్తూ...

"రండి...కూర్చోండి అంకుల్....మా డాడీని పిలుస్తాను!" -అంటూ లేడిపిల్లలా పక్కగదిలోకి పరుగెత్తింది అశ్విని....

అయినా కూర్చోటానికి ధైర్యం చాలక -అలాగే నిలబడిపోయాడు వీరభద్రం. ఆనాడు విష్ణుమూర్తి తన ఇంటి కొచ్చి కూర్చుంటే 'ముందకాళ్ళంచి లేవండి' -అంటూ ఆయనపై మండిపడి, దారుణంగా అవమానించి తిప్పిపంపేసిన దృశ్యాన్ని -తన మనోనేత్రాల ముందు మరోసారి ప్రదర్శించుకున్నాడు. ముఖం ముచ్చెమటలు పోశాయి...

పరిస్థితిని అర్థం చేసుకున్న చిదంబరం -అతని భుజం తట్టి ధైర్యం చెప్పాడు-"నువ్వు భయపడకురా భద్రం..ఆ విష్ణుమూర్తి నీ మీద హిరణ్య కశిపుడిలా విరుచుక పడకుండా నేను అడ్డం పడతాను!... అయినా విషయాలన్నీ నేను మాట్లాడతానుగా ..నువ్వు నిశ్చింతగా వుండు!"

పైమీది కండువాతో ముఖానికి పట్టిన చెమటలు తుడుచుకున్నాడు వీరభద్రం... అంతలో పక్కగదిలోంచి విష్ణుమూర్తి రానేవచ్చాడు...

"అదేమిటీ అలా నిలబడే వున్నారు?... .రండి...కూచోండి!"-అంటూ వాళ్ళిద్దర్నీ సాదరంగా ఆహ్వానించాడు.

వీరభద్రానికి కొంచెం మనస్థిమితం కలిగింది.

"నమస్కారం!" -అంటూ న్యూలు పిల్లాడిలాగా భయభక్తులతో చేతులు జోడించాడు.. విష్ణుమూర్తి ప్రతినమస్కారం చేశాడు. అందరూ సోఫాల్లో స్థిరపడ్డారు..

"మీరు బయల్దేరి వస్తున్నట్లు -మీ-అబ్బాయి-మా అమ్మాయికి ఫోన్ చేసి చెప్పాట్ట.. లేదంటే నేనే రావాలనుకున్నాను!" మర్యాద పూర్వకంగా చూస్తూ వీరభద్రంతో అన్నాడు విష్ణుమూర్తి.

"ఆ మధ్య ఓసారి మీ అంతట మీరుగా ఈ 'ప్రపోజల్' తో వచ్చారు..అప్పుడు మా భద్రం మూర్ఖంగా ప్రవర్తించి మీ మనసు నొప్పించాడు.. అందుకే ఇప్పుడు స్వయంగా కలిసి -మీ చేతులు పట్టుకుని క్షమాపణ చెప్పుకోవాలని వచ్చాడు".

పనిమనిషి అందించిన మంచినీళ్లు తాగి-



చెప్పాడు చిదంబరం...

"ఇంతకీ మీరు....?" - చిదంబరం వైపు ప్రశ్నార్థకంగా అడిగేడు విష్ణుమూర్తి.

"ఓ!...పరిచయం చేసుకోలేదు కదూ! -సారీ.. నాపేరు చిదంబరం..వీడికి ఆత్మీయ మిత్రుణ్ణి!.. బెజవాడలో ప్రాక్టీసు చేస్తూంటాను.. క్రిమినల్ లాయర్ని!"

"చాలా సంతోషం..!" -అంటూ అతనికి షేక్ హ్యాండిచ్చాడు విష్ణుమూర్తి...

మరి కాసేటికి కాఫీ ఫలహారాలు పూర్తయ్యాయి...

"విధి ఎంత చిత్రమైందో చూశారా చిదంబరంగారూ...! వీరభద్రంగారేమో వారి సుపుత్రుడికి-వారి మేనకోడల్నిచ్చి పెళ్లి జరిపించాలనుకున్నారు...నేనేమో,మొన్నీ మధ్యనే అమెరికా నించి వచ్చిన మా మేనల్లుడికి- మా బేబీనిచ్చి చెయ్యాల నుకున్నాను... చివరకు మేమిద్దరం దారుణంగా ఫేలయ్యాం..." మాటల మధ్యలో - చిదంబరానికి చెప్పాడు విష్ణుమూర్తి.

"మొత్తానికి వాళ్ళిద్దరూ ప్యాసయ్యారుగా !... అది చాలు మనికి..!"

"మరి ఆలస్యం దేనికీ? ..తొందరలోనే ముహుర్తం పెట్టించండి..ఇక కట్నకానుకల విషయం అంటారా-మీరు ఎలా చెప్తే అలా జరిపిస్తాను"

"అబ్బే..అలాంటివాటి ప్రస్తావన మావాడి దగ్గర తీసుకురాకండి... మండిపడతాడు... మీకు తెలీదేమో... మా భద్రుడు జిల్లా మావల సంఘానికి అధ్యక్షుడు!.... వాళ్ళ సంఘం కట్టుబాట్ల ప్రకారం కట్నాలు ఇవ్వటంకాని, పుచ్చుకోవటం గాని ఘోరమైన నేరం!..." చెప్పాడు చిదంబరం...

"అయినా ఆడపిల్ల తండ్రిగా నా బాధ్యత నేను నిర్వర్తించాలి కదా...? మీకు తెలుసు...! మా బేబీ నాకు ఒక్కతే సంతానం..! చిన్నప్పుడే వాళ్ళమ్మ చనిపోతే - దానికి తల్లిని కూడా నేనే




అయి పెంచాను.. రేపు నా తర్వాత... ఈ బంగళా, నా వ్యాపారం, నా ఆస్తిపాస్తులూ - అన్నీ దానికే చెందుతాయి.. ఇకపోతే.." అంటూ చెప్పబోతున్న విష్ణుమూర్తిని వారిస్తూ మధ్యలోనే కల్పించుకున్నాడు వీరభద్రం-

"ఇంక చాలింపుడు!...మాది రావుబహుద్దర్ల వంశం... మా తాత ముత్తాతల నాటి ఆస్తీ ఐశ్వర్యములు అంతగా మిగలకపోయినా - అన్నవస్త్రాలకు కొదువ లేదు. మా సుపుత్రుడు కూడా చదువుసంధ్యలు నేర్చుకున్నవాడు!... స్వాభిమానాన్ని మరింతగా కూర్చుకున్నవాడు!... ఏదో ఒక ఉద్యోగమున చేరి తన అర్థాంగిని సుఖపెట్టగలుగుతాడు..మీ భోగభాగ్యాలతో వానికి పనిలేదు,... కనుక ఆ విషయమును మీరిక పక్కనపెట్టి -కళ్యాణ మహోత్సవానికి ఏర్పాట్లు ప్రారంభించండి... మేం మా పురోహితుల్ని సంప్రదించి - త్వరలోనే ముహుర్తాన్ని నిశ్చయింపచేసి మీకు తెలియపరుస్తాం"!- అంటూ లేచాడు...

అతని భాషా ధోరణికి విష్ణుమూర్తి విస్తు పోతాడేమోనని-చిదంబరం కొంచెం భయ పడ్డాడు....

అయితే అంతకు ముందే ఆ వింతధోరణితో పరిచయం వున్న విష్ణుమూర్తి యధాలాపంగా నవ్వేసి-మర్యాదపూర్వకంగా తాను కూడా సోఫాలోంచి లేచి నిలబడ్డాడు...

"అన్నట్టు ఎల్లుండి...ఏకాదశీ గురువారం! ....మా అల్లుణ్ణి ...అయ్‌మీన్..మీ అబ్బాయిని ఓసారి పంపించండి. అతనూ మా అమ్మాయీ కలిసి-షాపింగ్‌కి వెళ్లొస్తారు"!- అన్నాడు.

"అట్లే కానిండు"- అన్నాడు వీరభద్రం.

అతని గ్రాంథిక భాష అట్లాగే కొనసాగితే విష్ణుమూర్తి ఎక్కడ చిరాకుపడి మనసు మార్చుకుంటాడోనన్న భయంతో -పక్కనే వున్న చిదంబరం, అతని చేతి మీద చిన్నగా గిల్లాడు.

విషయం అర్థంచేసుకున్న వీరభద్రం సర్దుకుని -మామూలు ధోరణిలో విష్ణుమూర్తికి మళ్ళీ చెప్పాడు.

"అలాగే కానివ్వండి!...మా వాణ్ణి ఎల్లుండి తప్పకుండా పంపిస్తాను!"

ఆ తర్వాత ఆయన దగ్గర శలవు తీసుకుని ఇద్దరూ టాక్సీ ఎక్కేరు..

వేడమీదవున్న తన గదిలోంచి బయటకొచ్చి-బాల్కనీలో చాటుగా నిలబడి... అంతవరకూ వాళ్ళమాటలన్నీ విన్న గోపాలానికి ఏదో ఆలోచన వచ్చింది...

* * *

పెళ్లిలో అశ్విని ఏ చీరలు కట్టుకుంటే -అద్భుతంగా కనిపిస్తుందో ఆ చీరల్ని శ్రీరామ్ ఎంపిక చేశాడు.

'రిసెప్షన్' లో ఏ సూటు వేసుకుంటే శ్రీరామ్ అందంగా కనిపిస్తాడో ఆ సూటుని అశ్విని సెలక్ట్ చేసింది.....

ఆ తర్వాత నగల దుకాణంలోకి వెళ్లి-శ్రీరామ్ కోసం డైమండ్ ఉంగరాన్ని తన కోసం నెక్లెస్సూ, గాజులూ తీసుకుంది.

షాపింగ్ పూర్తయ్యాక ఐస్‌పార్లర్‌లో-ఐస్‌క్రీం తిన్నారు.. ఆ తర్వాత మొదటాట సినీమా చూశారు.. సినీమా వదిలింతర్వాత హోటల్లో డిన్నర్ కూడా పూర్తిచేసుకుని కారెక్కారు...

రోడ్లు నిర్మానుష్యంగా వున్నాయి..అందుకే డ్రైవర్ కారుని వేగంగా పోనిస్తున్నాడు..

"అంత స్పీడెందుకూ?.....నెమ్మదిగా పోనీయ్..ఫరవాలేదు!" -శ్రీరామ్ ఛాతిపై తలపెట్టుకుని తన్మయంలో వున్న అశ్విని డ్రైవర్ని హెచ్చరించింది.

కారువేగం తగ్గింది..

కొంచెం దూరంలో -కారునే అనుసరించి



వస్తున్న మోటారుసైకిళ్ల వేగం మాత్రం తగ్గలేదు.

'సైడ్ మిర్రర్' లోంచి అప్రయత్నంగా వాటిని చూసిన డ్రైవర్-కొంచెం గాభరాగా అన్నాడు-

"మధ్యాన్నం మనం ఇంటిదగ్గరనించి బయల్దేరినప్పటినుంచీ మన కారుని? ఎవరో ఫాలో అవుతున్నారు మేడం!"

"ఫాలో అవుతున్నారా?"- ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"యస్ మేడం.! అప్పుడు నేను అంతగా పట్టించుకోలేదు.. కానీ ఇవ్వుడు కూడా-మోటారు సైకిళ్ల మీద వాళ్లే మన కారుని వెంబడిస్తున్నారు... చూడండి!" సైడ్ మిర్రర్‌లో చూస్తూనే చెప్పాడతను.

కొంచెం ఉలికిపాటుతో -అశ్విని వెనక్కి చూసింది.

తమ కారునే వెంబడిస్తూ వస్తున్న ఆ రెండు వోటారు సైకిళ్ళ మిదా నలుగురున్నారు. అసలే చీకటి..పైగా హెల్మెట్లు పెట్టుకున్నారు... అందుకే వాళ్ళ ముఖాలు కనిపించటంలేదు.

"వాళ్లెవరో రౌడీల్లాగా వున్నారు శ్రీరామ్"- భయంగా చూస్తూ చెప్పింది అశ్విని.

శ్రీరామ్ వెనక్కి తిరిగి చూసేలోగానే మోటారు సైకిళ్లు దూసుకుంటూ ముందుకొచ్చి కారుకి అడ్డంగా నిలబడ్డాయి..

కారు సడెన్ బ్రేకుతో కీచుమని శబ్దం చేస్తూ ఆగింది..

''మనం నగలు కొనటం వాళ్లు చూసుండాలి!.. వాటి కోసమే వెంట పడుతున్నారు!"-అన్నాడు శ్రీరామ్.

"ఇప్పుడెలా?" భయంగా చూసిందామె.

"నా జేబులో సెల్‌ఫోనుందిగా! మీ డాడీకి ఫోన్ చేస్తాను.. పోలీసుల్ని తీసుకొస్తారు'' -జేబులోంచి ఖంగారుగా ఫోను బయటకు తీస్తూ చెప్పాడు,శ్రీరామ్.




"నర్లే! నువ్ ఫోన్‌చేసి-ఆయనగారు పోలీసులతో వచ్చేసరికి-ఇక్కడ వీళ్లు మనభరతం పట్టేస్తారు..ఎలా వున్నారో చూడు.. ఇందాక మనం చూసిన సినీమాలో విలన్లలాగా!" మోటారు సైకిళ్లకు -స్టాండువేసి-కారు దగ్గరకు వస్తున్న ఆ రౌడీలను చూస్తూ అతని భుజాన్ని -భయంతో గట్టిగా పట్టుకుంది.

అప్పుడు అతని చొక్కా లోపల-దండకు కట్టుకున్న 'తాయెత్తు' ఆమె చేతికి తగిలింది. వెంటనే ఉత్సాహంగా చెప్పింది-

"వెరీగుడ్!రసూల్ బాబా ఆరోజున ఇచ్చిన తాయెత్తు నీ చేతికి వుండగా మనకేం భయంలేదు!"

దాన్ని తను కూడా తడివి చూసుకున్నాడు శ్రీరామ్-ఒక్కసారిగా వెయ్యేనుగుల బలం ఏదో-అతని ఒంట్లోకి విద్యుత్తులాగా వ్యాపించి నట్లనిపించింది.

"యస్!...ఆరోజు రోడ్డుమీద నన్ను రౌడీలు కొట్టబోతే-ఆడపిల్లవి నువ్వే -ఈ తాయెత్తు మహత్యంతో-వాళ్లను మట్టి కరిపించావ్.,. .. ఇప్పుడు నీకు సాయం నేను కూడావున్నాను. ...కమాన్... ఇద్దరం కల్సి వాళ్ళను ఓ ఆట ఆడిద్దాం!" అంటూ కారు డోర్ తెరిచాడు.

"కానీ నేను మొన్ననే మెడలోంచి నా తాయెత్తు తీసేశాను...ఎలా?" -భయంగా చూస్తూ అడిగింది.

"తీసేశావా! అయ్యో.. ఎందుకు తీసేశావ్"?

"దాని స్థానంలో నువ్వు పవిత్రమైన మంగళ సూత్రాన్ని కట్టబోతున్నావ్ కదా అని!... నువ్వు నా వక్క నుంటే-ఇంక నాకు భయమెందుకు ?..అందుకే తీసేశాను. అయినా నీ చేతికి వుందిగా.. భయంలేదు.. నీకు సాయంగా మా డ్రైవర్ కూడా వున్నాడు....వాళ్ళ అంతు చూసేయ్.. ఈ లోగా నేను మా 'డాడీ'కి ఫోన్ చేస్తాను!". అంటూ అతని చేతిలో వున్న సెల్‌ఫోన్ తీసుకుంది అశ్విని.

శ్రీరామ్ కారుదిగి నిలబడ్డాడు.

వాళ్లు నలుగురూ 'స్లోమోషన్'లో అతని వైపు వస్తున్నారు.

శ్రీరామ్ చొక్కా చేతులు మడతపెట్టి -'ఫైటింగ్'కి రెడీ అయ్యాడు..

-(ఇంకావుంది)

# జధ్యా మారుత

5

## నాలుగు స్థంభాలాట



శోభన్‌బాబులాంటి సీనియర్ హీరో చేయాల్సిన కథని తీసుకుని.... సరిగ్గా మీసాలు కూడా మొలవని ఇద్దరు టీనేజ్ కుర్రాళ్ల మీద సినిమాగా వండించటం తలవండిన దర్శకుడికైనా కత్తిమీద సాముకిందే లెక్క. కానీ జంధ్యాల సునాయాసంగా ఈ సాహసాన్ని పూర్తి చేసి విజయాన్నందుకున్నారు.

ఆ సాహసప్రక్రియే 'నాలుగు స్థంభాలాట'.

ఈ మధ్య యువతరాన్ని ఉర్రూతలూగించి ట్రెండ్ సెట్టర్స్‌గా నిలిచిన టీనేజ్ లవ్‌స్టోరీలు 'చిత్రం', 'నువ్వునేను'లాగే అప్పట్లో యూత్‌లో ఓ హాట్(ర్ట్) డిస్కషన్‌గా మారిన చిత్రం 'నాలుగుస్థంభాలాట'. జంధ్యాల ఓ ఇరవై ఏళ్లు అడ్వాన్స్ అయిపోయి ఈ సినిమా తీసారేమో ! అందుకే ఈ తరం కుర్రకారుకి కూడా నచ్చే సన్నివేశాలు, పాటలు బోలెడన్ని వున్నాయని చెప్పొచ్చు.

'నాలుగు స్థంభాలాట' గురించి నాలుగు ముక్కల్లో చెప్పాలంటే

'ఇద్దరమ్మాయిలు+ ఇద్దరబ్బాయిలు = ప్రేమాట+పెళ్ళాట'.

ఇదే నాలుగు స్థంభాలాట మెయిన్ థీమ్.

ఒకబ్బాయి పేరు నరేష్. నచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకోలేక పెద్దల బలవంతం మేరకు వెంటపడి వేధించే మరదలినే పెళ్ళాడి విలపిస్తాడు. ఇంకొక అబ్బాయి ప్రదీప్. స్నేహితుని ప్రేమకు రాయబారిగా నిలిచాడు. చివరికి ఆ ప్రేమ కోసమే సంసారిగా మారాడు.

శారద చక్కని చుక్క. చిదిమి దీపం పెట్టుకోవచ్చు. తన గుండె గూట్లోకి ఈ వెలుగు కావాలని ఓ కుర్రాడు వెంటపడితే మనసుతో పాటు వయసు కూడా రాసిచ్చింది. తీరా అతను కాస్తా చీకట్లోకి పారిపోతే, అతని స్నేహితుడు తన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు పంచాలనుకున్నాడు. అయితే ఆ దీపం కొడిగట్టి పోయింది.

ఇక మరో అమ్మాయి పేరు కమల. బావంటే పంచప్రాణాలు. బావని రోజూ చూడాలని కాలేజీయే మార్చేసుకుంది. బావ పరాయి అమ్మాయితో కనపడితే ముఖం మాడ్చేసుకుంది. చివరకు బావను సాధించుకుంది. తన మనసు పండలేదని అతన్ని వేధించుకుతింది.

ఇలా ఒక్కొక్కరిదీ ఒక్కో క(వ్య)థ.

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| నరేష్ | : నరేష్ |
| ప్రదీప్ కుమార్ | : ప్రదీప్ |
| శారద | : పూర్ణిమ |
| కమల | : తులసి |
| గాయత్రి | : రోహిణి |
| వీరభద్రం | : వీరభద్రరావు |
| నరేష్ అన్నయ్య | : విజ్జిబాబు |
| కమల నాన్న మూర్తి | : శంకర్ |
| గుర్నాధం | : వేలు |
| జానకమ్మ | : జానకి |
| అన్నపూర్ణ | : కాకినాడ శ్యామల |
| నరేష్ వదిన | : అన్నపూర్ణ |
| డాక్టర్ | : కృష్ణ చైతన్య |
| మూగబ్బాయ్ | : మాస్టర్ అలీ |
| లెక్చరర్ | : థమ్ |
| స్టూడెంట్ | : బాలాజీ |

మరియు

సుందరలక్ష్మి, సత్తిబాబు, వల్లం నరసింహారావు, యం.యస్.యన్.రాజు, ప్రకాశరావు, తాతబాబు, శ్యాంప్రసాద్, కళాధర్, మాస్టర్ ప్రసాద్, బేబి లలితా సుబ్బులక్ష్మి, బేబి బబిత, బేబి పద్మ, బేబిరాజీ.



ఈ నలుగురితోనూ, విధి ఆడిన వింత ఆటే 'నాలుగు స్థంభాలాట'.

స్టోరీ లైన్ చెప్పుకుంటే చాలా ఈజీగాను, క్రేజీగానూ అనిపించొచ్చుగానీ, ఏమాత్రం లేజీగా వున్నా మొత్తం డామేజీ అయిపోయేంత సెన్సిటివిటీ వుందీ సినిమాలో.

దర్శకుడిగా జంధ్యాలకి, హీరోగా ప్రదీప్‌కి ఇది మూడో సినిమా. ప్రఖ్యాత నటి, దర్శకురాలు విజయనిర్మల తనయుడు నరేష్ ఈ సినిమా ద్వారా కథానాయకునిగా పరిచయం అయ్యారు. ఆ పరిచయక్రమాన్ని ఇక్కడ వివరంగా చెప్పుకుందాం -

'పండంటి కాపురం', 'దేవదాసు', 'సంతానం- సౌభాగ్యం', 'కవిత' (మలయాళం) (దర్శకురాలిగా విజయనిర్మలకు ఇదే తొలిచిత్రం) తదితర చిత్రాలలో బాలనటుడిగా చేసిన నరేష్‌కి చిన్నప్పట్నించే నటన మీద విపరీతమైన మక్కువ ఉంది. తనకు పదిహేడేళ్ల వయసులో 'సీతాకోకచిలుక'లో హీరోగా ఆఫర్ వచ్చింది. అయితే దర్శకుడు భారతీరాజా అంతకుముందే మురళి(కార్తీక్)కి మాటివ్వడంతో ఆ అవకాశం మిస్సయ్యింది. తరువాత నరేష్‌ని హీరోగా పరిచయం చేస్తూ విజయనిర్మల 'ప్రేమ సంకెళ్లు' అనే సినిమా మొదలుపెట్టారు.

ఆ రోజు కె.విశ్వనాథ్‌తో కలిసి ఓ డ్యాన్స్ స్కూల్‌కు వెళ్లారు జంధ్యాల. అక్కడో చాకులాంటి కుర్రాడు జంధ్యాల దృష్టిని ఆకర్షించాడు. ఆరా తీయగా అతను విజయనిర్మల గారబ్బాయని తెలిసింది. దాంతో జంధ్యాల ఆవిడని కలిసి, తన 'నాలుగు స్థంభాలాట' సినిమా ద్వారా నరేష్‌ని హీరోగా పరిచయం చేస్తానని అడిగారు. నరేష్ తొలి సినిమా బయటి బ్యానర్‌లో వస్తేనే బాగుంటుందని భావించిన విజయనిర్మల తన 'ప్రేమ సంకెళ్లు'ని పక్కన పెట్టేసి జంధ్యాలకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చారు.

ఇక్కడ మరో ముఖ్యవిషయం చెప్పుకోవాలి. సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు విజయనిర్మల ఫ్యామిలీకి అత్యంత సన్నిహితుడు. జంధ్యాల సినిమాలకు అత్యధిక శాతం సంగీతం సమకూర్చింది కూడా ఈయనే. జంధ్యాలతో ఆయనకు మొదటినుండీ మంచి స్నేహం ఉంది. ఆయనే నరేష్‌ని జంధ్యాలకు పరిచయం చేశారు. అంతకుముందు 'ముద్దమందారం'లో కూడా నరేష్‌ని హీరోగా పెడితే బాగుండునని ఆయన అనుకున్నారు. అయితే అప్పటికే జంధ్యాల, ప్రదీప్‌ను ఎంపిక చేసుకున్నారు. మొత్తానికి ఆ సినిమా మిస్ అయినా, ఈ సినిమాలో నరేష్‌కు అవకాశం రావటంతో రమేష్‌నాయుడు చాలా ఆనందపడిపోయారు.

ఈ సినిమా ద్వారా పరిచయం కావటం తన అదృష్టంగా భావిస్తారు నరేష్. " ఈ సినిమాతో జంధ్యాల అనే ఇనిస్టిట్యూట్‌లోకి ప్రవేశించాను. అప్పటికి నాకు నటనలో 'అఆ' లు కూడా రావు. అప్పుడు నేను +2 చదువుతున్నాను. చిన్నప్పట్నించీ మద్రాస్‌లోనే ఉండటం వల్ల తెలుగు మాట్లాడటం మీద అంత అధికారం రాలేదు. జంధ్యాల దగ్గర నేను నటనతో పాటు తెలుగుభాష, నుడికారం నేర్చుకున్నాను. అందుకే ఇండస్ట్రీలో ఆయనొక్కరినే నేను గురువుగా భావిస్తాను" అని గురువుపట్ల తనకున్న అభిమానాన్ని ప్రదర్శిస్తారు నరేష్.

అప్పట్లో తెలుగు సినిమాలు ఎక్కువగా సెట్స్‌లోనే రూపొందేవి. ఆ పద్ధతికి విరుద్ధంగా జంధ్యాల తన సినిమాలను ఎక్కువశాతం అవుట్‌డోర్‌లోనే చిత్రీకరించేవారు. వైజాగ్ అంటే ఆయనకు ప్రాణం. మన రాష్ట్రంలో ముఖ్యంగా కోనసీమ, వైజాగ్ ప్రాంతాల్లో అందాలన్నీ కొలువు తీరినట్టుగా అనిపిస్తాయి. కోనసీమది పల్లె అందాల గుబాళింపైతే, వైజాగ్‌ది పల్లె, పట్టణాల జిగిబిగి. అందుకే జంధ్యాల తన సినిమాలన్నింటికీ వైజాగ్‌నే వేదికగా తీసుకున్నారు. నరేష్‌కి కూడా వైజాగ్‌మీద విపరీతమైన మమకారం ఉంది. "నేను రెండు

## హైలైట్స్

1. వైజాగ్‌కి చెందిన వై. అప్పారావు, యస్.వి. రామారావు, వి. బాబురావు, బాబన్నలు ఈ చిత్ర నిర్మాణశ్రమలో నాలుగు స్థంభాలుగా నిలిచారు.
2. 'సుత్తి' అనే పదం ఈ సినిమాతోనే పాపులరైంది.
3. 'నిన్ను-ఈ దేశాన్ని బాగు చేయడం నా వల్లకాదు'అనేది ఈ చిత్రంలో వీరభద్రరావు ఊతపదం.
4. 'మల్లెపందిరి'లో హీరోగా నటించిన విజ్జిబాబు ఇందులో నరేష్‌కు అన్నయ్యగా నటించారు.
5. 'ముద్దమందారం'లో లాగానే ఇందులో కూడా (శంకర్‌కి) జంధ్యాల డబ్బింగ్ చెప్పారు.



6. సినిమా ప్రారంభంలోనూ, ఇంటర్వెల్ లోనూ, క్లైమాక్స్‌లోనూ కనబడే 'విధి' గా ఇ.వి.వి. నటించారు.' విధి' పాత్రకు పెద్ద పర్సనాలిటీ ఉన్న వ్యక్తి కావల్సిరావటంతో, ఆ సినిమాకు అసోసియేట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్న ఇ.వి.వి.సత్యనారాయణతోనే ఆ పాత్రను వేయించారు. "విధి ఎప్పుడూ మాతోనే ఉంది." అని ఇప్పటికీ ఇ.వి.వి.(నేటి ప్రముఖ దర్శకుడు)తో జోక్ చేస్తుంటారు నరేష్.
7. ఈ సినిమాకు ప్రదీప్‌కి 15 వేల రూపాయల పారితోషికం ఇస్తే, ఆ డబ్బుతో స్కూటర్ కొనుక్కున్నారాయన.
8. ఈ సినిమాలో వేషానికి సుత్తివేలు అందుకున్న పారితోషికం వెయ్యి నూట పదహార్లు.

## పాటలు

రాగమో -అనురాగమో
గీతమో - సంగీతమో
నరేష్, పూర్ణిమ అభినయించారు.

చినుకులా రాలి-నదులుగా సాగి
వరదలై పోయి కడలిగా పొంగు నీ ప్రేమ
నరేష్, పూర్ణిమ అభినయించారు

కలికి చిలకరా కలిసి కులకరా
నరేష్, ప్రదీప్ తదితరులు అభినయించారు.

కొబ్బరాకు గాలి ముద్దు కేసింది,
ఉలికి పడ్డ ముద్దు ఉరిమి చూసింది
ప్రదీప్,పూర్ణిమ, నరేష్, తులసి
తదితరులు అభినయించారు.

దొరలనకు కనులనీరు
దొరలదీ లోకం
మగ దొరలదీ లోకం
పూర్ణిమ, తులసి, నరేష్, ప్రదీప్ తదితరులు
అభినయించారు.

సార్లు పుట్టాను. మనిషిగా మద్రాస్‌లో.. నటునిగా వైజాగ్‌లో. అందుకే వైజాగ్ అంటే నాకు చాలా ఇష్టం. అంత అందమైన ప్లేస్‌ని నేను ఇంతవరకూ చూడలేదు. స్విట్జర్లాండ్‌కు తీసుకెళ్లినా నాకు అంత ఫీల్ రాదు. నా కెరీర్‌లో సూపర్‌హిట్ సినిమాలన్నీ వైజాగ్‌లోనే రూపొందాయి. నన్ను కలిసినప్పుడల్లా రామోజీరావుగారు తమాషాగా 'వైజాగ్ హీరో' అని పిలుస్తుండేవారు. ఒకానొక దశలో నేను వైజాగ్‌లో సెటిల్ అయిపోవాలనుకుని పెంట్ హౌస్ ఒకటి కొనాలనుకున్నాను. ఈలోగా తెలుగు సినిమా పరిశ్రమ మద్రాస్ నుండి హైదరాబాద్‌కు షిఫ్ట్ అవడంతో నా ఆలోచనకు అక్కడితో ఫుల్‌స్టాప్ పడిపోయింది" అని చెప్పారు నరేష్.

ఈ చిత్రంలో నరేష్ ఇంట్రడక్షన్ షాట్‌ని చాలా గమ్మత్తుగా చిత్రీకరించారు జంధ్యాల. నరేష్‌ని శీర్షాసనం వేయమని చెప్పి తలకిందులుగా ఆ షాట్ తీశారు. "నా మీద ఇలా తలకిందులుగా షాట్ తీస్తుంటే మా మేనమామ రవికుమార్ 'ఏంట్రా, ప్రారంభమే ఇలాంటి

**రిలీజ్**
1982

**నిర్మాణప్రాంతాలు**
వైజాగ్, అరకులోయ,
భీమిలీ,యారాడ
తదితరప్రదేశాలు

**నిర్మాణవ్యయం**
12 లక్షల
రూపాయలు

**వర్కింగ్ డేస్**
సుమారు 50 రోజులు

షాట్' అని చాలా భయపడ్డారు. కానీ నాకు జంధ్యాల గారి మీద బాగా నమ్మకం ఉంది.


పూర్ణిమ,నరేష్


ప్రదీప్, నరేష్, తులసి, పూర్ణిమ

ఆయనది ప్రయోగశీల మనస్తత్వం."అని తొలి షాట్‌ని గుర్తుచేసుకున్నారు నరేష్. ఈ షాట్ గురించి ఇండస్ట్రీలో కూడా కొందరు కామెంట్లు చేశారు. హీరో ఇంట్రడక్షన్ ఇలా చేయటం ఏంటని జంధ్యాలను ఆడిపోసుకున్నారు. కానీ జంధ్యాల ఇవేమీ పట్టించుకోలేదు. 'నేనొక దుర్గం నాదొక స్వర్గం అనితర సాధ్యం నా మార్గం' అని శ్రీశ్రీ రాసినట్టు తన మాట తనదే. తన బాట తనదే.

కొత్త ఆర్టిస్టులతో పనిచేయటానికి చాలామంది దర్శకులు నిరుత్సాహ

**చిత్రం : నాలుగు స్థంభాలాట  సంగీతం : రాజన్-నాగేంద్ర  రచన : వేటూరి  గానం : పి.సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**

అ: చినుకులా రాలి నదులుగా సాగి వరదలైపోయి
కడలిగా పొంగు నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
నదివి నీవు కడలి నేను మరచిపోకుమా మమత నీవే సుమా
ఆ: చినుకులా రాలి నదులుగా సాగి వరదలైపోయి
కడలిగా పొంగు నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
అ: ఆకులు రాలే వేసవిగాలి నా ప్రేమ నిట్టూర్పులే
కుంకుమపూచె వేకువ నీవై తేవాలి ఓదార్పులే
ఆ: ప్రేమలుకోరే జన్మలలోనే నే వేచి వుంటానులే
జన్మలుదాటే ప్రేమను నేనై నే వెల్లువౌతానులే
అ: నే నావనవుతానులే
ఆ: హిమములా రాలి సుమములై పూచి ఋతువులై నవ్వి
మధువులై పొంగు నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
శిశిరమైనా శిథిలమైనా
మరచిపోకుమా విరహమైపోకుమా
ఆ: తొలకరి కోసం తొడిమను నేనై అల్లాడుతున్నానులే
పులకరమూగే పూవులకోసం వేటాడుతున్నానులే
అ: నింగికి నేల అంటిసలాడే ఆ పొద్దు రావాలిలే
పున్నమి నీవై రేపటి నీడై ఆ ముద్దు తీరాలిలే
ఆ: తీరాలు చేరాలిలే
అ: నవ్వులై విరిసి గానమై పిలిచి కలలలో కలిసి
గగనమై ఎగసి నీ ప్రేమ నా ప్రేమ తారాడే మన ప్రేమ
కువలయమైన గగనమైన
ప్రేమ మనమే సుమా
ప్రేమ మయమే సుమా ॥చినుకులా॥


నరేష్, ప్రదీప్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| బేనర్ | : నవత ఆర్ట్స్ |
| సంగీతం | : రాజన్-నాగేంద్ర |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : యస్.గోపాలరెడ్డి |
| ఎడిటింగ్ | : జి.జి. కృష్ణారావు, గౌతంరాజు |
| నిర్వహణ | : యన్.అచ్యుతరామరాజు |
| పాటలు | : వేటూరి |
| ప్లేబ్యాక్ | : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల యస్.జానకి |
| కళ | : కళాధర్ |
| సహాయకుడు | : రాజు |
| కెమెరామెన్ | : యమ్.వి. రఘు |
| సహాయకులు | : దివాకర్, సుబ్బారావు. |
| కో-డైరెక్టర్ | : యు.వి.పాణి |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : ఇ.వి.వి. సత్యనారాయణ, బి.యస్.నిష్టల |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : బి.రామకృష్ణ, శేఖర్‌బాబు |
| నృత్యం | : శివ-సుబ్రహ్మణ్యం |
| స్టిల్స్ | : సి. హెచ్. శ్యాంప్రసాద్ |
| కాస్ట్యూమ్స్ | : బాబురావు |
| మేకప్ | : అర్జునరావు, సుబ్బారావు, రాజేంద్రప్రసాద్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : లంక భాస్కర్ |
| అవుడోర్ యూనిట్ | : శ్యాంప్రసాద్ ఆర్ట్స్ |
| రీ-రికార్డింగ్ | : ఎస్.పి.రామనాథన్ (ప్రసాద్ స్టూడియోస్) |
| నిర్మాత | : యన్. కృష్ణంరాజు |
| రచన - దర్శకత్వం | : జంధ్యాల |

## కథాంశం

క్లాస్‌మేట్స్ అయిన నరేష్, ప్రదీప్‌లు ప్రాణస్నేహితులు. ప్రదీప్ ఇంట్లో అద్దెకు వుంటున్న శారదను తొలిచూపులోనే ప్రేమిస్తాడు నరేష్. నరేష్, శారదల ప్రేమకు ప్రదీప్ రాయబారం నడుపుతాడు. ప్రదీప్, శారదల సాన్నిహిత్యాన్ని అపార్థం చేసుకున్న పెద్దలు వీళ్ళ పెళ్ళి నిశ్చయిస్తారు. ఓరోజు అనుకోకుండా శారదను నరేష్ లొంగదీసుకుంటాడు. నరేష్ మేనమామ కూతురు కమలకి బావంటే పంచప్రాణాలు. శారద మెళ్ళో పసుపుతాడు కడితే, తన మెడకి ఉరితాడు వేసుకుంటానని నరేష్‌ అన్నయ్య బెదిరిస్తాడు. దాంతో నరేష్, కమలని పెళ్ళాడతాడు. శారద గర్భవతి అని తెలుసుక్ను ప్రదీప్ ఆమె పరువు నిలపడం కోసం తానే ఆమెను పెళ్ళాడతాడు. అయితే నాలుగు గోడల మధ్య ఆమెని తన చెల్లెలులాగా చూస్తూంటాడు. శారద ఆడపిల్లని ప్రసవిస్తుంది. పాపకి నరేష్ తల్లి మహాలక్ష్మి పేరు పెడతాడు ప్రదీప్. ఈ రెండు జంటలు తిరుపతికి వెళ్తూ కలుసుకుంటారు. చివరికి కమల మానసిక క్షోభను గమనించి శారద నిద్రమాత్రలు మింగి నరేష్ ఒళ్ళోనే కన్నుమూస్తుంది.

పడిపోతారేమో కానీ, జంధ్యాల మాత్రం చాలా ఉత్సాహంగా ఉండేవారు. వాళ్లతో కలిసిపోయి వాళ్ల నటనలో కొత్త ఎనర్జీ కనబడటానికి రకరకాలుగా ప్రయత్నించేవారు. తనకు నటనానుభవం లేకపోవటాన్ని మాటిమాటికీ గుర్తుకు తెచ్చుకుంటున్న నరేష్‌కు చాలాసార్లు ధైర్యాన్నిచ్చారు. "నేను చెప్పినట్టు చెయ్ చాలు" అనేవారు. అందుకేనేమో ఈ సినిమాలో నరేష్ నూనుగు మీసాలతో ఫ్రెష్‌గా, ఎనర్జిటిక్‌గా తొలి సినిమా చేస్తున్న తడబాటు లేకుండా కనిపిస్తాడు. అయితే నరేష్ పాత్రకి వినిపించే గొంతు మాత్రం అతనిది కాదు. ప్రముఖ గాయకుడు యస్.పి.బాల సుబ్రహ్మణ్యం వాయిస్ ఈ పాత్రకి మంచి గ్రేస్‌ని, గ్లామర్‌ని తీసుకువచ్చింది. ఈ ప్రక్రియలో చాలా పెద్ద తతంగమే జరిగింది. అదెలాగంటే.... షూటింగ్ అంతా పూర్తయ్యాక జంధ్యాల, నరేష్‌ని పిలిచి " నీవు నీ పాత్రకు బాగానే డబ్బింగ్ చెప్పుకోగలవు. కానీ ఇది చాలా మెచ్యూరిటీ ఉన్న కారెక్టర్. బాలసుబ్రహ్మణ్యం నీ పాత్రకు డబ్బింగ్ చెబితే ఖచ్చితంగా నువ్వు పదేళ్లు వెనక్కి తిరిగి చూసుకోనవసరం లేదు. నీ కెరీర్‌కు నాది గ్యారంటీ" అని చెప్పారు. బాలు లాంటి ప్రముఖ వ్యక్తి తన పాత్రకు డబ్బింగ్ చెప్తారనగానే నరేష్‌లో ఓ పక్క ఆనందం ఉన్నా, మరో పక్క విజయనిర్మల ఏం అంటారోనన్న భయం. ఎందుకంటే ఏ ఆర్టిస్ట్‌కైనా సొంత గొంతు ఉంటేనే వారి నటనకు సార్థకత లభిస్తుందని గట్టిగా నమ్మే వ్యక్తుల్లో విజయనిర్మల ఒకరు. అందుకే నరేష్‌తో రోజూ తమ స్వంత డబ్బింగ్ థియేటర్‌లో డబ్బింగ్ ప్రాక్టీస్ చేయించేవారామె.

నరేష్ కోరిక మేరకు విజయనిర్మలను కలిసి విషయం అంతా వివరించారు జంధ్యాల. అయితే విజయనిర్మల తొలుత అంగీకరించలేదు. "మీ సినిమా ఆపి మరీ, మీ అబ్బాయిని నాకు అప్పగించారు. అందుకే నేను కూడా చాలా మనస్ఫూర్తిగా పనిచేస్తున్నాను. ఈ ఒక్క అవకాశం నాకు ఇవ్వండి." అని జంధ్యాల గట్టిగా పట్టుబడటంతో విజయనిర్మల అంగీకరించక తప్పలేదు.

ఇప్పటివరకూ నరేష్ సుమారు 90 సినిమాల్లో నటించారు. ఈ ఒక్క సినిమా మినహా అన్ని సినిమాలకు ఆయనే స్వయంగా డబ్బింగ్ చెప్పుకున్నారు. "అప్పుడు బాలూగారు నాకు డబ్బింగ్ చెప్పటాన్ని ఇప్పటికీ నా అదృష్టంగా భావిస్తుంటాను" అని గర్వపడతారు నరేష్.

ఇలా 'నాలుగు స్థంభాలాట' చిత్రం నరేష్ కెరీర్‌లో ఓ ల్యాండ్‌మార్క్‌గా నిలిచిపోయింది.

అలాగే ఈ సినిమాతో నరేష్‌కి విపరీతమైన ఫాన్‌ఫాలోయింగ్ ఏర్పడింది. వైజాగ్‌లో ఓ అమ్మాయి అయితే నరేష్ పుట్టిన రోజునాడు కొత్త బట్టలు కట్టుకుని గుళ్లో పూజలు చేసేది. క్లాస్‌లో

స్వీట్స్ పంచేది.

ఇక ప్రదీప్ విషయానికొస్తే -జంధ్యాల తొలి సినిమాతోనే నటుడిగా తొలి అడుగు వేసాడు. 'ముద్దమందారం' తర్వాత, ద్వితీయ విఘ్నం వుండకూడదనే వుద్దేశ్యంతో 'మల్లెపందిరి'లో చిన్న వేషమైనా వేయాల్సివచ్చింది. 'ముద్దమందారం' హండ్రెడ్ డేస్ ఫంక్షన్ అయ్యాక ప్రదీప్ హైదరాబాద్‌కి తిరుగు ప్రయాణమవుతుండగా ఆఖరి నిముషంలో జంధ్యాల ఆయన్ని నిలిపేశారు. 'కొత్త సినిమా మొదలుకాబోతోంది. నువ్వు ఇక్కడే వుండాల్సి వస్తుంది' అని చెప్పారు.

దాంతో జంధ్యాల ఇంట్లోనే వుంటూ ప్రదీప్ సినిమాకి అవసరమైన డిస్కో డాన్స్ నేర్చుకున్నారు. 'ముద్దమందారం' లో లాగానే ఏదో లవబుల్ కేరెక్టర్ అయ్యుంటుందని భావించారు ప్రదీప్. తీరా చూస్తే బాగా బరువైన పాత్ర. ఒక రకంగా త్యాగం చేసే పాత్ర.

బాగా అనుభవజ్ఞుడైన నటుడు చేయాల్సిన పాత్ర అది. కెరీర్ తొలినాళ్ళలోనే అలాంటి పాత్ర చేసే అవకాశం లభించడం తన అదృష్టంగా భావించారు ప్రదీప్. 'ముద్దమందారం'లో బాలు గొంతు అరువు తెచ్చుకున్న ప్రదీప్ ఇందులో తనే స్వయంగా డబ్బింగ్ చెప్పుకున్నారు.

ఈ సినిమా గురించి ప్రదీప్ మరింత వివరంగా మాట్లాడుతూ "ఇందులో నా మీద ఒకే ఒక్క పాట వుంది. 'కలికి చిలకరా' అనే పాట మంచి డిస్కో వూపుతో తీశారు. ఈ పాట కోసం నిర్మాత నాకు డిస్కో డాన్స్ నేర్పించారు. నాకు చాలా మంచిపేరు తెచ్చిపెట్టింది సినిమా. ఇప్పటికీ తెలంగాణా ప్రాంతంలో నన్ను 'నాలుగుస్థంభాలాట ప్రదీప్'అనే పిలుస్తుంటారు. దాన్ని బట్టే ఆ సినిమాతో నాకెంత పేరొచ్చిందో అర్థమై వుంటుంది" అని చెప్పుకొచ్చారు.

నరేష్ చెల్లెలుగా వేసిన రోహిణికి ఈ సినిమా మంచి పేరు తీసుకువచ్చింది. ఇక పూర్ణిమ గురించి చెప్పాలంటే - పైకి అమాయకంగా కనిపించినా, నటన విషయానికొచ్చే సరికి మహా గడుగ్గాయి. యూనిట్‌లో అంతా కుర్రకారు కావటంతో ఈ అమ్మాయి అమాయకత్వాన్ని అనరాగా తీసుకుని 'తింగరి' అంటూ ఏడిపించేవారు.

అలాగే మూగబ్బాయిగా నటించిన మాస్టర్ అలీ గురించి ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి. అంత చిన్న వయసులో కూడా అలీ చాలా షార్ప్‌గా ఉండటం గమనించి యూనిట్‌లో అందరూ ఆశ్చర్యపోయేవారు. "అలీ ఎప్పటికైనా మంచి పొజిషన్‌కు వస్తాడని నేను అప్పుడే అనుకున్నాను" అని ఈ సందర్భంగా చెప్పారు నరేష్.

'నాలుగుస్థంభాలాట'లో ఒక క్లిష్టమైన సమస్యను సీరియస్‌గా చర్చిస్తూనే, మరోవైపు 'సుత్తి' కొట్టిన ఘనుడు జంధ్యాల. ఇందులో వీరభద్రరావు, వేలు జంటకు సుత్తి జంటగా నామకరణం చేశారాయన. ఈ సినిమా తర్వాత ఈ సుత్తిజంట ఎంత పాపులరయ్యారంటే, చాలా సినిమాల్లో వీరి కోసం ప్రత్యేకంగా పాత్రలు సృష్టించడం జరిగింది. హీరో,హీరోయిన్లు ఎవరైనా గానీ, వీరు మాత్రం బాక్సాఫీస్ హిట్ పెయిర్ అయ్యారు.

మామిళ్ళపల్లి వీరభద్రరావు కాస్తా ఈ సినిమాతో సుత్తి వీరభద్రరావు అయిపోయారు. 'జాతర'(1980)చిత్రంతో తొలిసారిగా వెండితెరపై కనిపించిన వీరభద్రరావుకి నటునిగా బ్రేక్ నిచ్చింది జంధ్యాలే. నిజానికి వీరభద్రరావు హాస్యరసమే కాదు, మిగతా రసాలను కూడా చక్కగా పోషించగలరని జంధ్యాలే నిరూపించారు. ఉదాహరణకి ఈ చిత్రం క్లైమాక్స్‌లో -తన కొడుకు అంతటి త్యాగాన్ని ఎందుకు చేశాడో తెలుసుకుని అతన్ని అభినందిస్తూ-'ఇప్పుడు నా కళ్ళకి ఎంతో ఎత్తుకు ఎదిగి పోయినట్టు కనిపిస్తున్నావురా' అంటూ అక్కున చేర్చుకునే దృశ్యం ఒక్కటే చాలు-వీరభద్రరావు నటనాపటిమకు అద్దం పట్టడానికి. ఈ సీన్ అంటే నరేష్‌కు కూడా చాలా ఇష్టం.


వేలు

ఇక 'వేలు' గురించి చెప్పాలంటే అదో పెద్ద కథ. వేలు అనబడే కురువద్దాలి లక్ష్మీనరసింహారావు అప్పట్లో వైజాగ్ నావల్ డాక్ యార్డ్స్‌లో ఉద్యోగం చేస్తుండేవారు. జంధ్యాల వైజాగ్‌లో 'ముద్దమందారం' సినిమాతీస్తూ ఓ సన్నివేశంలో అవసరమై 'మనిషి నూతిలో పడ్డాడు' నాటకాన్ని షూట్ చేశారు. ఆ నాటకంలో వేలు కూడా ఓ పాత్రధారి. ఆ నాటకం సినిమాలో ఎడిట్ చేసేశారు గానీ, అందులో నటించిన వేలుతో మాత్రం లాడ్జి రిసెప్షనిస్ట్ వేషం వేయించారు. అదే వేలు తొలి సినిమా, ఆ తర్వాత 'మల్లెపందిరి'లో కూడా వేలుతో వేషం వేయించారు.

'నాలుగు స్థంభాలాట' షూటింగ్ జరుగుతున్న సమయంలో స్నేహితుల ప్రోద్బలంతో జంధ్యాలని కలిశారు వేలు. 'నాలుగైదు రోజులు సెలవు పెట్టగలరా?' అనడిగారు జంధ్యాల. వేలు ఆనందపడిపోయి ఓకే అనేశారు. అలా ఇందులో వీరభద్రరావు 'సుత్తి' భరించే గుమాస్తా వేషం దొరికింది.

నిజానికి మొదట అనుకున్న స్క్రిప్ట్‌లో ఈ వేషం లేదు. వంటవాడి పాత్ర అనుకున్నారు. ఆ పాత్రను నత్తిబాబు అనే ఆర్టిస్ట్‌తో వేయించాలనుకున్నారు. అయితే కథకి అడ్డుపడుతుందని జంధ్యాల ఆ పాత్రని పక్కన పెట్టేశారు. వంటవాడికన్నా గుమాస్తా పాత్ర అయితే బాగుంటుందని అప్పటికప్పుడు క్రియేట్ చేశారు.

NAVATA ARTS
NAALUGU STHAMBAALATA
(TELUGU)
Music: Rajan-Nagendra
SIDE ONE Comedy Scene I
SIDE TWO Comedy Sce
DIALOGUES: Jandhayala
ARTISTES: Veerabadra Rao & Velu
P 1982
45 R.P.M. EXTD. PLAY
PRODUCED BY AVM MUSIC SERVICE
MADRAS-600 026
AVM MUSIC SERVICE
NEMANI SEETHARAM

నాలుగుస్థంభాలాట
Dialogues: JANDHAYALA
NAVATA ARTS
NAALUGU STHAMBAALAT.
MUSIC: RAJAN NAGENDRA
AVM

'నాలుగు స్థంభాలాట'లో కామెడీట్రాక్ మాత్రమే రికార్డ్‌గా రావడం జంధ్యాల డైలాగ్స్ పంచ్ పవర్‌కి నిదర్శనం. అందుకు సాక్ష్యంగా ఆ రోజుల్లో వెలువడిన రికార్డ్ యొక్క కవర్‌ని 'హాసం' కి పంపిన వారు - నేమాని సీతారాం, విజయవాడ.

ఆఖరి నిమిషంలో సృష్టించబడ్డ ఈ పాత్ర వేలు నట జీవితానికీ, ఆ సినిమాకి పెద్ద ప్లస్ అయ్యింది. ''1968 నుండి నాటకాలు వేస్తున్నాను. కానీ సినిమాల్లో నటించాలని ఎప్పుడూ పెద్దగా ప్రయత్నించలేదు. ఎందుకంటే నా దృష్టిలో సినిమా అంటే కష్టమైన ప్రక్రియ. జంధ్యాల గారి దయవల్ల వెండితెరపై ఓ వెలుగు వెలగగలిగాను. ఈ సినిమా నా జీవితాన్ని ఓ మలుపు తిప్పింది. నాటకానుభవం వల్ల నటన ఈజీగా చేసేసాను గానీ, డబ్బింగ్ చెప్పడానికి మాత్రం 8 గంటలు పట్టింది. ఇప్పటిలా డబ్బింగ్‌లో సులువైన ప్రక్రియలు అప్పట్లో లేవు. కో డైరెక్టర్ యు.వి.పాణి గారు (ఇప్పుడాయన మణిరత్నం సినిమాలకు పనిచేస్తున్నారు)నాతో చాలా ఓపిగ్గా డబ్బింగ్ చెప్పించుకున్నారు. జంధ్యాల గారి తొలి సినిమా మొదలుకుని దాదాపు అన్ని సినిమాల్లోనూ నటించే అవకాశం దక్కినందుకు నేను చాలా గర్వపడుతున్నాను" అని చెప్పారు సుత్తివేలు.

వేలు డబ్బింగ్ చెబుతున్నప్పుడు ఓ సరదా సంఘటన జరిగింది. చాలా కష్టపడి ఒక్క చిన్న బిట్ మినహా మొత్తం డబ్బింగ్ అంతా పూర్తి చేసేశారాయన. ఆఖరి బిట్‌కి డబ్బింగ్ చెబుతున్నప్పుడు నవతా కృష్ణంరాజు లోపలే ఉన్నారు. డబ్బింగ్ చెప్పేసి 'అమ్మయ్య సక్సెస్‌ఫుల్‌గా నా పని పూర్తయ్యింది' అని అనుకున్నారు. కానీ ఇంజనీర్ 'రీ టేక్' అన్నాడు.

**'నాలుగు స్థంభాలాట' సినిమాలో 'చినుకులా రాలి' పాటను జంధ్యాల 133 షాట్లతో తీశారు. అప్పుడు ఓ రికార్డుగా పరిశ్రమలో చెప్పుకునేవారు. ఆ విషయాన్ని ధ్వనికరిస్తూ అప్పట్లో పెద్ద సైజులో వచ్చే 'సినీ హెరాల్డ్' అనే పత్రికలో నేటి 'హాసం' సంపాదకుడు రాజా రాసిన ఓ తమాషా ఆర్టికల్ ఇది.** ➡

**ఈ ఆర్టికల్‌లో 'నాలుగు స్థంభాలాట' కు సంబంధించిన విషయాలను మాత్రం తిరిగి పాఠకుల కోసం ప్రత్యేకంగా ఇక్కడ పొందుపరుస్తున్నాం.**

'నాలుగు స్థంభాలాట' చిత్రంతో మొదలయింది వారి సంభాషణ.

"చిత్రం మొదటి రోజున 'జంధ్యాల బాగా సుత్తి వేసేడ్రా' అన్నారు కొంతమంది. దాంతో పిక్చర్ పోయిందనుకున్నాను" అన్నారు జంధ్యాల.

"ఒక పాటకి ఇన్ని షాట్లు తియ్యటం నా వల్ల కాదురా బాలూ' అని విశ్వం అన్నారు తెలుసా" అంటూ దర్శకుడు కె. విశ్వనాథ్ పలికిన ప్రశంసావాక్యాన్ని అందించారు బాలు.

"అవునండీ ! పాటల పిక్చరైజేషన్‌కి ఇప్పుడు జంధ్యాలనే చెప్పుకుంటున్నారు" అన్నాడు అక్కడ శ్రోతగా మిగిలిపోయిన ఒక అభిమాని.

"కరెక్టు. చినుకులా రాలి' పాటలో ఎన్ని షాట్లు ఉపయోగించారంటే... నూట ముప్పై రెండు... యా మై కరెక్ట్?" అన్నారు బాలు.

" ఒకటి తక్కువ.... మొత్తం నూట ముప్పై మూడు" అంటూ పూర్తి చేశారు జంధ్యాల.

"ఇప్పుడు జంధ్యాల పిక్చర్‌లో పాటలు ఎలా ఉన్నాయో వినడం మానేసి ఎలా తీస్తున్నారో అని చూడ్డం పెద్ద పనైపోయింది మాకు, దీనికి తోడు 'అంటిసలాడే' అంటూ రాసేరే వేటూరి... ఎలా తట్టిందండీ ఆ వర్డు ఆయనకి? అబ్బ !" అంటూ రెండు చేతులూ నుదుటికి జోడించి నమస్కారం పెట్టేశారు బాలు.

"అక్కడే కదా వచ్చింది అంత అవస్థానూ! సాధారణంగా అందరూ 'నేలకి నింగి అంటిసలాడే' అంటారు. కానీ ఈయన 'నింగికి నేల అంటిసలాడే' అని రాసేరు. ఆయన అలా రాసేరు కదాని ఆ ఒక్క షాట్ తప్ప మొత్తం పాటంతా పూర్తి చేసేసి ఆ ఎఫెక్టుకి తగ్గట్టున్న లొకేషన్ కోసం చాలా సేపు వెతికాం. పిక్చర్‌లో చూశారు కదా ఆ షాట్ ఎంత బాగా వచ్చిందో" అన్నారు జంధ్యాల.

బాలూ, జంధ్యాల, ఆదివిష్ణు, సోమయాజులుతో

"సత్రత్తిల్ ఒరు రాత్రి"





—రాజా

అప్పట్లో 'సత్రత్తిల్ ఒరు రాత్రి' అనే మలయాళ చిత్రం ఒకటొచ్చింది. శృంగారం పాళ్లు ఎక్కువగా ఉండటం, వాల్ పోస్టర్‌లో ఆ భంగిమలు అవీ బాగా ఎక్స్‌పోజ్ చేయడంతో డబ్ చేయకపోయినా, మలయాళం అర్థం కాకపోయినా ఆంధ్ర దేశమంతటా వేలం వెర్రిగా ఆ మలయాళం సినిమాను చూసేశారు. ఆ సినిమా టైటిల్‌ని ఈ ఆర్టికల్‌కి హెడ్డింగ్‌గా రాజా ఉంచడంతో - బాలు, జంధ్యాల, ఆదివిష్ణు, సోమయాజులు కలిసి పార్టనర్స్‌గా 'ఇలాంటి సినిమాని తెలుగులో తీస్తున్నారా' అని గాభరా పడి ఈ ఆర్టికల్ వెలువడిన సంచికను క్రేజీగా కొనేశారు జనం. లోపల మేటర్ చదివాక 'హమ్మయ్యా' అంటూ ఊపిరి పీల్చుకున్నారు. వారంటే ప్రజలకున్న అభిమానం అదీ !

"అలాంటి టైటిల్ పెట్టేవేంటయ్యా!?" అని అడిగాడు జంధ్యాల, రాజాని.

" ఆ రోజు మనం అంతా కలిసింది హోటల్లోనే కదండీ... హోటలంటే సత్రమేగా !? అందుకే అలా పెట్టానన్నమాట. ఆ టైటిల్ బట్టేగా ఇంత సెన్సేషన్ వచ్చింది" అంటూ బదులిచ్చారు రాజా.

"నేను కూడా తుళ్లిపడ్డానయ్యా" అంటూ "తెల్లవారు ఝాము దాకా మనం మాట్లాడుకున్న మాటలన్నీ యథాతథంగా రాసేశావు కదయ్యా... జేబులో టేప్ రికార్డర్‌లాంటిది ఏదైనా పెట్టుకుని వచ్చావా!?" అని అడిగారు జంధ్యాల.

"అలాంటిదేమీ లేదండీ... జస్ట్ మైండ్‌లో రికార్డయి పోయి ఉన్నదే రాశాను" అన్నారు రాజా.

వెంటనే రాజా తలపట్టుకుని ఊపి, నుదుటిమీద చేత్తో రాస్తూ 'అందరికీ ఇది ఫేట్ రికార్డర్ అయితే నీకు మాత్రం టేప్ రికార్డర్ అన్నమాట" అని జోక్ చేస్తూ ఆ ప్రహసనానికి ముగింపు పలికారు జంధ్యాల.

వేలు ఖంగుతిన్నారు.

విషయమేమిటంటే - వేలు ఆ బిట్‌కి డబ్బింగ్ చెబుతున్నప్పుడు నవతాకృష్ణంరాజు చప్పుడు చేసుకుంటూ 'టీ' తాగారట. ఆ శబ్దం కూడా రికార్డ్ కావడంతో మళ్లీ టేక్ చేయాల్సి వచ్చింది.



నిర్మాత నవత కృష్ణంరాజు

ఇల్లెగిరి పోయేలా అరుసర్తా వుండే వీరభద్రరావు ఇంటి వాతావరణం , అది వంటికి పడక నసుగుతూ వుండే గుమాస్తా వేలు వైఖరీ,'సుత్తి' వృత్తాంతమూ, దాని పుట్టు పూర్వోత్తరాలు జంధ్యాల మేధాశక్తికి, హాస్య చతురతకు దర్పణం పడుతుందీ చిత్రంలో.

ఏదైనా చిన్న విషయాన్ని లాగి లాగి పెద్ద విషయం చేస్తుంటే "సుత్తి' కొడుతున్నాడ్రా బాబూ" అని అనుకోవడం తెలుగువాళ్లకి పరిపాటైపోయింది. 'నాలుగు స్థంభాలాట' తో 'సుత్తి' ని తెలుగువాళ్లకి బాగా దగ్గర చేసేశారు జంధ్యాల. అసలు 'సుత్తి'తో కామెడీ ట్రాక్ చేయొచ్చుననే ఐడియా ఆయనకెలా తట్టిందో? ఏది ఏమైనా హేట్సాఫ్ టు జంధ్యాల.

డైలాగ్స్‌తో సహా ఫుల్ బౌండెడ్ స్క్రిప్ట్ రెడీ అయ్యాకనే షూటింగ్ మొదలుపెట్టారు జంధ్యాల. మొదట ఈ సినిమా చంద్రమోహన్, నూతన్‌ప్రసాద్, కొత్తహీరో సురేష్‌లతో ప్లాన్ చేశారు. తర్వాత ఎందుకనో ఆ ఆలోచన మార్చుకున్నారు జంధ్యాల.

1982 జనవరి 8న ఈ చిత్రం షూటింగ్ వైజాగ్‌లో ప్రారంభమై, సింగిల్ షెడ్యూల్‌లో పూర్తయ్యింది. వైజాగ్‌లో చెవిటి, మూగపిల్లల ఆశ్రమం వుంది. ఆ ఆశ్రమంలో ఎక్కువ భాగం షూటింగ్ చేశారు.

సినిమా ప్రారంభం రోజున " తెలుగు దేశంలో తెలుగు తారలతో తెలుగు తనంతో తెలుగువారి కోసం 'నాలుగుస్థంభాలాట' నిర్మిస్తున్నాం" అని చెప్పారు నవతా కృష్ణంరాజు.

అమెరికా అమ్మాయి, వంతులమ్మ, ఇంటింటి రామాయణం, ఓ ఇంటి భాగోతం,

## 'నాలుగు స్థంభాలాట'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

✦ గత దశాబ్దంగా తమ ఒంపు సొంపులతో, ఆటపాటలతో ఆంధ్ర ప్రేక్షకుల గుండెకాయల్ని వేరు శెనక్కాయల్లా తినేస్తున్న సోదరీమణులు జ్యోతిలక్ష్మి, జయమాలినిల గురించి మనం చెప్పుకుందాం....

✦ ఈ సోదరీమణులిద్దరూ ఆంధ్రుల పాలిట ఇష్టదైవాలు.... ఆవకాయ, గోంగూరలాంటి వారు. ఈ పచ్చళ్లలో ఏదో ఒకటి లేనిదే తెలుగు వాడి భోజనం ఎలా ఉండదో, వీరిద్దరిలో ఏ ఒక్కరూ లేకుండా తెలుగు సినిమాయే అసలు ఉండదు. నేటి యువతరానికి దేశ రాజధాని పేరేమిటో తెలియదు కానీ, జయమాలిని ఇంటి అడ్రస్, ఫోన్ నెంబరు మహబాగా తెలుసు.....

✦ ఈ డిస్టిక్ మొత్తానికి స్ట్రిక్ట్ మనిషిని నేను

✦ ఆ పాదరక్షలు ఏంటిరా ? నీ శ్రార్థం.... అసలు మనం ఎవరం... ఎవరం?

తండ్రీ కొడుకులం

నీ బొంద... భారతీయులం... మన సంస్కృతి, చట్టుబండలు ఏమైనా తెలిసి ఏడ్చిందిరా నీకు....

పైథాగరస్ ఎవరంటే ఏ జర్మనీ వాడో, ఏ రష్యావాడో అంటావ్.... వాడి అసలు పేరు గిరీశుడని, కాకినాడ లో మన పైథా వారబ్బాయ్ అని తెలుసా... ఊహు... తెలియదు. షేక్స్పియర్... షేషప్పయార్ అని తమిళుడు, రామనాథ్ జిల్లా వాడు, మన భారతీయుడు.

న్యూటన్ ఎవడు ? నూతనుడు అని బెంగాలీయుడు, మన భారతీయుడు. ఇది తెలుసా ? ఊహు.. ఆగు... అసలు మనం ఎవరం?.... ఎవరం?

భారతీయులుం

నీ బొంద... తండ్రీ కొడుకులం... ఛీ ...ఛీ..ఛీ.. ఈ వీరభద్రం కడుపున చెడబుట్టార్రా మీరు... నిన్నూ... ఈ దేశాన్ని బాగు చేయటం నావల్ల కాదురా బాబూ... నా వల్ల కాదు.

✦ సిగ్గూ ఎగ్గూ ఉన్న సన్యాసయితే ఇలా పిల్లల భోజనాల పద్దులో తలనెప్పి బిళ్లల ఖర్చు రాస్తావా? చెప్పు ఎందుకొచ్చాయివి?

అయ్యా... అవి నేను వేసుకున్నవండయ్యా

చేతులతో పని చేస్తుంటే తలకు, మొలకు నెప్పులెందుకొస్తాయయ్యా?

చేతులతో చేస్తే రాదండయ్యా... కానీ ఈ మధ్య నా చేతులకంటే నా చెవులకు పని ఎక్కువయిపోయిందండయ్యా.... మీ సుత్తి వినీ..వినీ....

ఆగక్కడ.... అందుకే ఉదయం లేవగానే సూర్యనమస్కారాలు, యోగాసనాలు వేయమన్నారు. దానితో ఏ జబ్బూ, రోగాలు నీ దరికి రాదు గాక రాదు... అసలు సూర్యనమస్కారం యొక్క ప్రాధాన్యత తెలుసా నీకు.....

✦ అదేంటిరా పొలిటిక్స్ క్లాస్‌లో చిక్కుకు పోయినవాడిలా అలా ఉన్నావేంటి?

✦ అదో పెద్ద జిడ్డుశ్రీ రా బాబూ...

✦ ఏడవనివ్వండి..... ఏడుపు ఇప్పటినుండే నేర్చుకుంటే మంచిది... ఆడపిల్ల కదా.

✦ పాఠాలకు ఎలాగూ రారు సరే... అటెండెన్స్‌కు కూడా రారా

✦ ఇది గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం మొదలు పెట్టిన రోజు సార్.... ఈ దేశానికి ఎంతో సుదినం. దేశభక్తి మీకు లేకపోవచ్చు కానీ మాకుంది. అందుకే ఇవాళ క్లాస్‌లు బహిష్కరిస్తున్నాం.

✦ ఆయన కోపిష్టి మనిషి. పుట్టగానే నర్స్ కేసి చూసి.... ష్.... సైలెన్స్ అని అరిచి... ఆ తరువాత క్యార్ మన్నాడట.

✦ ఇది విచిత్రవేషధారణ కాదు... మన తెలుగు తనం ప్రతిబింబించే వస్త్ర ధారణ.

అబ్బో వేషం వేయటమే కాదు... భాష కూడా మారిందే! మన కాలేజీ క్యాంటిన్‌లో కాఫీ గానీ తాగావా ఏంటి? వద్దు బాబూ... నువ్వు క్లాస్‌లోకి రావద్దు... నువ్వు ఇలా వచ్చి క్లాస్‌లో కూర్చుంటే సడెన్‌గా ఎవరైనా వచ్చి చూస్తే ఈ క్లాస్‌కు ఇద్దరు లెక్చరర్‌లు అనుకుంటారు.... వెళ్లు.. వెళ్లుబాబూ.. వెళ్లు.....

✦ ఆ నవ్వేమిటమ్మాయ్... ఆడపిల్ల కాలు గడపదాటకూడదు.... నవ్వు పెదవి దాట కూడదు... తెలుసా. కారణం లేని నవ్వు తోరణం లేని పందిరి, పూర్ణము లేని బూరె పనికి రాదన్నాడు శాస్త్రకారుడు. మీకివేమీ తెలియవు. మీ ఇంగ్లీషు బళ్లలో లింకన్ ఎప్పుడు పుట్టాడు... డంకన్ ఎప్పుడు చచ్చాడు.. ఇవే తప్ప... రాముడెవరు, కృష్ణుడెవరు ఇవి చెప్పి తగలడరు.

✦ విశాఖపట్నంలో సిటీబస్ ఎక్కడం, నిన్ను అర్థం చేసుకోవడం.... ఈ రెండూ నా వల్ల కావు నాయనా!

✦ ఈ దేశాన్ని బాగు చేయడానికి తమరేమన్నా మూలపురుషులా? మూల శంక పురుషులాయె.



ఈలోగా విధి ఎంటర్ కావడం తదితర సీన్లని బ్యాక్ డ్రాప్‌గా ఉపయోగించడం సినిమా పట్ల ప్రేక్షకుడికి మరింత ఆసక్తిని పెంచుతుంది.

వివాహమైన తొలిరోజున నరేష్ పక్కగదిలో పడుకుంటానని తులసితో చెప్పినపుడు - మంచం మీద అలంకరించిన పువ్వులన్నీ గాలికి చెల్లా చెదురైనట్టుగా చూపించిన షాట్ సింబాలిక్‌గా కుదిరింది.

కథానుగుణంగా నిజంగా టీనేజర్స్‌నే ఎంపిక చేసుకున్నారు జంధ్యాల. ఈ సినిమా నాటికి ప్రదీప్‌కి 19 ఏళ్ళ వయసు. నరేష్‌కేమో పదిహేడేళ్ళు, పూర్ణిమ, తులసిలకు పదహారేళ్ళు. ఈ లేత వయసు కుర్రకారు మీద త్యాగాలు,పెళ్ళిళ్ళు, గొడవలు, ఆత్మహత్యలూ... హెవీగా అనిపించాలి. కానీ జంధ్యాల టేకింగ్ వల్ల ప్రేక్షకులు నావెల్టీగా ఫీలయ్యారు.

ఈ సినిమా సక్సెస్ అవుతుందా, లేదా అని చాలామంది సందేహపడ్డారు. కానీ ఈ చిత్రం ఎనిమిది కేంద్రాల్లో శతదినోత్సవం జరుపుకుంది. హైదరాబాద్ 'దేవి' థియేటర్‌లో ఈ చిత్రం 175 రోజులు ప్రదర్శించబడటాన్ని ఆ రోజుల్లో చాలా గొప్పగా చెప్పుకునేవారు. 1982 ఆగస్టు 23న మద్రాసులోని స్వామి శంకరదాసు ఆడిటోరియంలో శతదినోత్సవ వేడుకలు జరిగాయి. "ఏటా సగటున 150 చిత్రాలు నిర్మింపడుతున్న ఈ రోజుల్లో అనేక చిత్రాలు విఫలమౌతున్న ఈ వేగంలో చిన్న తారలతో చిత్రాన్ని తీసి విజయం సాధించడం ఎంతైనా హర్షించదగ్గ విషయం. నిజం చెప్పాలంటే ఈ చిత్రానికి హీరో జంధ్యాల" అని నాటి జాతీయ చలన చిత్రాభివృద్ధి సంస్థ ఛైర్మన్ డి.వి.ఎస్. రాజు అభినందించారు. ముఖ్య అతిథిగా ప్రసిద్ధ దర్శక నిర్మాత ఎల్.వి.ప్రసాద్ పాల్గొన్నారు. కృష్ణ,విజయనిర్మల ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేసారు. "ఈనాటి ఉత్సవాన్ని చూస్తూంటే నాకు'తేనెమనసులు' రోజులు గుర్తుకొస్తున్నాయి" అన్నారు కృష్ణ. నవతా కృష్ణంరాజుగారు మంచి అభిరుచిగల నిర్మాత అని, జంధ్యాలగారు సమర్థుడైన దర్శకుడని చెప్పి, నరేష్ తొలి సినిమా వాళ్లకిస్తే బాగుంటుందని విజయనిర్మలను ఒప్పించడం జరిగిందని ఈ సందర్భంగా కృష్ణ గుర్తుచేశారు. "మా అబ్బాయి నరేష్ మొదటగా నటించిన చిత్రం విజయవంతం కావడం నాకెంతో ఆనందంగా వుంది" అని విజయనిర్మల తన సంతోషాన్ని వ్యక్తపరిచారు.

జంధ్యాల తన ప్రసంగంలో "సమర్థుడైన బిడ్డను చూసి తండ్రి, సార్థకమైన కృషిని చూసి కళాకారుడు అనుభవించే తృప్తి ఎలాంటిదో ఈనాడు అది నాకు కలిగింది" అన్నారు.

నిర్మాత కృష్ణంరాజు చెబుతూ -"ఈ చిత్రం యొక్క బాధ్యతలన్నీ జంధ్యాలే పూర్తిగా స్వీకరించారు. ఏ రోజు ఎక్కడ, ఏది షూట్ చేస్తున్నది కూడా నేను పట్టించుకోలేదు. నిశిరాత్రి, పేకువఝాము అనే తేడా లేకుండా అహోరాత్రులు ఆయన శ్రమించారు. ఈ చిత్ర విజయానికి 50 శాతం జంధ్యాల కారకులైతే, 49 శాతం కథ, నటీనటులు, టెక్నీషియన్లది, ఒక్కశాతం మాత్రం నాది" అని చాలా నిక్కచ్చిగా పేర్కొన్నారు.

రాజన్-నాగేంద్ర సంగీతం ఈ చిత్రానికి ఆయువు పట్టుగా నిలిచింది. అప్పట్లో ఈ సినిమా పెద్ద మ్యూజికల్ హిట్. 'చినుకులా రాలి నదులుగా సాగి' పాట ఇప్పటికీ పాపులరే. 'దొరల నీకు కనులనీరు' పాట చాలా మంది కళ్ళల్లో కన్నీరొలికించింది.

సన్నివేశాలు, పాటల చిత్రీకరణలో జంధ్యాలది ఒక ప్రత్యేకమైన శైలి. స్క్రిప్ట్ మీద మంచి కమాండ్ ఉన్న ఆయన లొకేషన్స్ బట్టి డైలాగులు రాసేవారు. ఒక్కోసారి ఆయన ఏం తీస్తున్నారో, ఎందుకు తీస్తున్నారో యూనిట్‌లో చాలామందికి అర్థమయ్యేది కాదు. సీనియర్ అండ్ సిన్సియర్ ప్రొడ్యూసర్ అయిన నవతా కృష్ణంరాజుకి కూడా జంధ్యాల మేకింగ్ స్టయిల్ అంతగా అంతు పట్టలేదు.

ఒకసారి ఏమయిందంటే - అది షూటింగ్ ఆఖరి రోజు. అరకులో షూటింగ్ జరుగుతోంది. యూనిట్ అంతా బస్‌లో వెళ్తున్నారు. మంచి లొకేషన్ ఉన్న చోట ఆగి షాట్స్ తీసేవారు జంధ్యాల. మధ్యాహ్నం మూడు దాటి పోయింది, అయినా లంచ్‌బ్రేక్ ఇవ్వలేదు. భోజనాలు తీసుకుని నిర్మాత వీళ్ల వెంట పడ్డారు. చివరకు నాలుగు గంటలకు వీళ్లను పట్టుకున్నా రాయన. భోజనాలు పూర్తయ్యాక జంధ్యాలను పక్కకు తీసుకెళ్లి ఏదో మాట్లాడారు నవతా కృష్ణంరాజు. ఆ తరువాత ఇద్దరూ సీరియస్‌గా కూర్చుండిపోయారు. వాళ్లు ఏం మాట్లాడుకున్నారన్నది యూనిట్‌లో ఎవరికీ తెలీదు. తరువాత ఈ విషయాన్ని నరేష్‌కి చెబుతూ "జంధ్యాల ఏం తీస్తున్నాడో, ఎందుకు తీస్తున్నాడో అర్థంకాక మొదట విసుక్కున్నాను. కానీ సినిమా చూశాక అతను ఎంత ప్రతిభావంతుడో, సినిమా మీద ఎంత కమాండ్ ఉందో అర్థమయ్యింది" అన్నారు నవతా కృష్ణంరాజు.

కె.రాఘవేంద్రరావు ప్రవేశంతో పాటల చిత్రీకరణలో ఓ కొత్త ప్రభంజనం మొదలయింది. జంధ్యాల కూడా పాటల్ని ఓ కొత్త శైలిలో చిత్రీకరించటానికి ఆసక్తి కనబరిచేవారు. ఆయన తీసిన చాలా పాటలకు కొరియోగ్రాఫర్ కూడా ఉండేవారు కాదు.

ఈ సినిమాలో ప్రతి పాటా ఓ ఆణిముత్యం.

త్యాగయ్య వంటి ఎన్నో చిత్రాలతో ఉత్తమ నిర్మాతగా పేర్గాంచిన నవతా కృష్ణంరాజు చాలా ఇష్టపడి రూపొందించిన చిత్రమిది. "త్యాగయ్య తీసి నేనెంత లాభం పొందానో అందరికీ తెలుసు! ఇవాళ నేను తిరిగి మళ్ళీ మీ ముందు నిలబడి గలిగానంటే అందుకు కారణం జంధ్యాల. 'ఈ సినిమా కూడా పోతే నువ్వు ఇంటికి వెళ్ళాల్సిందే' అన్నారెవరో నాతో. ఇంటికెందుకు వెళ్ళడం? తిన్నగా బంగాళాఖాతంలోకి వెళ్ళేవాణ్ణి" అని అప్పట్లో చెప్పారు కృష్ణంరాజు.

ఈ నాలుగు స్థంభాలేంటి? ఈ ఆట ఏంటి? అని అప్పట్లో టైటిల్ గురించి చాలామంది సెటైర్లు వేసుకున్నా, సినిమా చూశాక మాత్రం తమ కామెంట్ల నుంచి రిటైరైపోయారు.

జంధ్యాల లోని ప్రతిభా 'పాట'వాలని ఓ కొత్త కోణంలో ఆవిష్కరించిన చిత్రమిది. స్క్రీన్‌ప్లే, కథాగమనం, డైలాగ్స్, సాంగ్స్, వాటి చిత్రీకరణ, లొకేషన్స్, ఆర్టిస్టుల పెర్‌ఫార్మెన్స్‌లో ఫ్రెష్‌నెస్ వల్ల ఈ సినిమా యూత్ బేస్డ్ ఫిల్మ్ అయినప్పటికీ ఆల్‌రౌండర్‌గా అన్ని వర్గాల ప్రేక్షకులని ఆకట్టుకోగలిగింది. సీరియస్ టాపిక్ అయినా కూడా జంధ్యాల బాగా హేండిల్ చేశారు.

చిలిపి చిలిపిగా, అల్లరల్లరిగా, దొరదొరగా మొదలయ్యే ఈ సినిమా ద్వితీయార్ధానికొచ్చే సరికి కొంచెం కన్నీళ్ళు, కొంచెం సెంటిమెంట్, కొంచెం త్యాగం, కొంచెం ప్రేమ మొదలైన వాటిని మిక్స్ చేసుకుని పరిపూర్ణతను చేకూర్చుకుంది.

ఈ తరం కుర్రకారు సినిమాల్లాగానే ఈ సినిమా కూడా క్లాస్‌రూమ్‌లోనే ప్రారంభమవుతుంది. లెక్చరర్స్‌ని ఆటపట్టించడం, అమ్మాయిలకి బీట్ కొట్టడం ఇత్యాది అంశాలన్నీ చూస్తుంటే జంధ్యాల ఈ నాటి ట్రెండ్‌కి తగ్గట్టుగా ఆనాడే సినిమా తీసినట్టనిపిస్తుంది. ఈ తరం వాళ్ళకి కూడా బోర్ కొట్టని అంశాలు, పాటలు 'నాలుగు స్థంభాలాట' కి స్పెషల్ ఎస్సెట్.

టైటిల్స్ పడుతున్నప్పుడు ఇద్దరమ్మాయిలు, ఇద్దరబ్బాయిలు నాలుగు స్థంభాలాట ఆడటం,

చిత్రం: నాలుగు స్థంభాలాట సంగీతం: రాజన్-నాగేంద్ర
రచన: వేటూరి గానం: పి.సుశీల

ఆ...ఆ....ఆ..... దొరలనీకు కనులనీరు దొరలదీ లోకం
మగ దొరలదీలోకం
కనులలోనే దాచుకోవే కడలిలా శోకం
కన్నె పడుచులా శోకం
నాల్గు దిక్కుల నడుమ పుట్టి నలిగిపోయే జగతిలో....
నాల్గు దిక్కుల నడుమ పుట్టి నలిగిపోయే జగతిలో
నాలుగూ పాదాల ధర్మం నడువలేని ప్రగతిలో
నాలుగు స్థంభాలాట ఆడబ్రతుకు తెలుసుకో
దొరలనీకు కనులనీరు దొరలదీ లోకం
కనులలోనే దాచుకోవే కడలిలా శోకం
వెన్నెలే కరువైననాడు నింగినిండా చుక్కలే....॥2॥
కన్నెగానే తల్లివయితే కంటినిండా చుక్కలే
నాల్గు మొహముల బ్రహ్మ రాసిన ఖర్మ నీకిది తెలుసుకో
॥దొరల॥
కలవని నీవాళ్ల నడుమ దొంగలాగా కదిలిపో ॥2॥
అమ్మగా ఒక జన్మనిచ్చి అవని నీవై మిగిలిపో
నాలుగు వేదాల సారం అనుభవంలో తెలుసుకో
దొరలనీకు కనుల నీరు దొరలదీ లోకం
మగ దొరలదీలోకం
కనులలోనే దాచుకోవే కడలిలా శోకం
కన్నె పడుచులా శోకం....

'కొబ్బరాకు గాలి....' పాటలో ఒక్కొక్క పాట్‌ని పొయిట్రీలాగా విజువల్స్‌లో చూపించారాయన. సాధారణంగా అప్పట్లో ఒక పాట చిత్రీకరణ రెండుమూడురోజుల్లోనే పూర్తయిపోయేది. కానీ 'నాలుగు స్థంభాలాట'లో 'చినుకులా రాలి..' పాటని అరవై డిఫరెంట్ లొకేషన్స్‌లో 30 రోజులు తీశారు. అంటే 30 రోజులూ ఆ పాట ఒక్కటే తీశారని కాదు. ప్రతి రోజూ ఉదయం లొకేషన్‌కు వెళ్లగానే బ్యాక్‌లైట్‌లో చిన్న సాంగ్ బిట్ తీసి, తరువాత సీన్స్ తీసేవారు.

'కలికి చిలకరా..' పాటని రాత్రిపూట సముద్రపు ఒడ్డున చిత్రీకరించారు. 'రాగమో, అనురాగమో....' పాటలో నరేష్‌తో మోటారుబైక్ ఫీట్స్ చేయించారు.

ఈ సినిమాలోని పాటలలో తన అనుభవాల్ని నరేష్ ఇలా వివరించారు - ''ప్రేమసంకెళ్లు' మేకప్ టెస్ట్ నిమిత్తం మోటారుబైక్ జంప్స్ చేశాను. అవి చూసిన


నరేష్

జంధ్యాల 'రాగమో, అనురాగమో..' పాటలో నాతో ఈ ఫీట్స్ చేయించారు. ఆరు అడుగుల ఎత్తు కొండ మీద నుండి బైక్‌తో సహా దూకేయమన్నారు. ఉడుకురక్తం వయసు కాబట్టి భయం అనిపించలేదు. హీరో హోండా సి.బి.100 బండి మీద వెంటనే జంప్ చేశాను. అసలా ప్లేస్ జంపింగ్‌కి అనుకూలంగా లేదు. అయినా బైక్ కరెక్ట్‌గా ల్యాండ్ అయింది. నాకు తెలిసి తెలుగు సినిమాల్లో అప్పటివరకూ రియల్ మోటారుబైక్ ఫీట్స్ ఎవరూ చేయలేదు. ఈ ఫీట్ నేను చేశాక నా మీద ఆయనకు మరింత నమ్మకం పెరిగిపోయింది. నేను కూడా ఆయన ఎంత రిస్కీ ఫైట్ చేయమన్నా వెంటనే రెడీ అనేవాడ్ని. ఓసారి గోదావరిలో దూకమంటే దూకేశాను. ఆ ముందు రోజే మా యూనిట్‌లో ఒకతను గోదావరిలో మునిగి చనిపోయాడు. అయినా నేను భయపడలేదు.

'దొరలనీకు..' పాట చిత్రీకరిస్తున్నప్పుడు నాకు ఎలాంటి ఫీలింగ్ కలగలేదు. కానీ తెరమీద ఆ పాట చూసినప్పుడు మాత్రం గుండె బరువెక్కిపోయింది.

'చినుకులా రాలి...' పాట నా కెరీర్‌లో ఒన్ ఆఫ్ ది బెస్ట్ సాంగ్స్. టేకింగ్ వైజ్ కూడా నేను మరిచిపోలేని సాంగే అది. నేను ఎప్పుడైనా పెళ్లిళ్లకు వెళితే అందరూ ఆ పాటనే గుర్తు చేసుకుంటారు." అని తెలిపారు నరేష్.

ఈ పాటల చిత్రీకరణలో ఓ భయంకరమైన అనుభవం ఎదురైంది. వైజాగ్‌లో ఎర్రకొండలు బాగా ఫేమస్ ప్లేస్. అక్కడొక చోట భూమి రబ్బర్‌లా కిందకు మీదకూ కదులుతూంటుంది. భలే తమాషాగా ఉందే అని జంధ్యాల ఆ లొకేషన్‌లో నరేష్, పూర్ణిమలను నిలబెట్టి కొన్ని షాట్స్ తీశారు. ఈ లోగా ఎవరో ఆఫీసరు పరుగెత్తుకుంటూ వచ్చి "అది ఊబి సార్.. దిగబడితే మళ్లీ బయటకు రాలేరు." అని చెప్పారు. అలా ఓ పెద్ద ప్రమాదం తప్పి పోవటంతో యూనిట్ ఊపిరి పీల్చుకుంది.

యూనిట్ మొత్తం ముచ్చలవాని పాలెం(ఇప్పుడు ఎం.వి.పి. కాలనీ) లో కొన్ని ఇళ్లు అద్దె కు తీసు కుని అక్కడే ఉండేవారు. విజయనిర్మలగారబ్బాయి కావటంతో నరేష్‌ని ఓ హోటల్‌లో పెట్టారు. రెండు రోజులు ఒంటరిగా ఉండి బోర్ కొట్టేసిన నరేష్, తాను కూడా యూనిట్‌తోనే కలిసి ఉంటానంటూ ఎం.వి.పి. కాలనీ వచ్చేశాడు.

షూటింగ్‌లో ఎంత సీరియస్‌గా ఉండేవారో, షూటింగ్ అయిపోయాక అంత ఫ్రెండ్లీగా ఉండేవారు జంధ్యాల. ఖాళీ సమయాల్లో నరేష్‌ని బైక్‌మీద వైజాగ్ అంతా తిరిగి రమ్మనేవారు. అలాగే ప్రతిరోజూ సాయంత్రం యూనిట్ కోసం నాటకాలు వేయించేవారు.

ఈ సినిమాకు సంబంధించి మరో సంఘటన. షూటింగ్ పార్ట్ అంతా పూర్తయిపోయింది కానీ, నరేష్ కు మాత్రం రూపాయి కూడా రెమ్యునరేషన్ ఇవ్వలేదు. నరేష్ తొలి సినిమా అనుభూతిలో ఆ విషయాన్ని పట్టించుకోలేదు కానీ, ఇంట్లో వాళ్లు మాత్రం 'ఎంతోకొంత తీసుకో... జీవితాంతం చెప్పుకోవాలి కదా' అని అన్నారు. అయినా నరేష్ పట్టించుకోలేదు. సినిమా రిలీజైన వారం తరువాత నవతాకృష్ణంరాజు సడెన్‌గా ఇంటికొచ్చి పదివేల రూపాయల పారితోషికం ఇచ్చారు. ఆ డబ్బుల్లో మూడువేలు పెట్టి సెకండ్ హ్యాండ్ హెరాల్డ్ కారు, రెండు వేలు పెట్టి ఎ.సి. కొనుక్కున్నారు, మిగతా డబ్బు బ్యాంకులో దాచుకున్నారు నరేష్.

ఈ సినిమాకి గోపాల్‌రెడ్డి ఛాయాగ్రహణం పెద్ద ప్లస్ పాయింట్. మోటార్ బైక్ షాట్స్ అయితే డిక్కీల్లోంచి టార్చిలైట్ వేసి మరీ తీశారు. హై స్పీడ్ ఫిల్మ్ కొత్తగా వచ్చిన రోజులవి. దాన్ని ఉపయోగించేవారాయన. జంధ్యాల, గోపాల్‌రెడ్డి ఇద్దరూ బాగా చర్చించుకుని మరీ



షాట్స్ తీసేవారు. అందుకేనేమో న్యూ కాన్సెప్ట్‌తో ఫొటోగ్రఫీ అలరిస్తుంది.

ఏ సినిమా కాన్సెప్ట్ అయినా ఏడాదికో, రెండేళ్లకో పాతబడి పోతుంది. కానీ, ఈ సినిమా కాన్సెప్ట్ మాత్రం ఇప్పటికీ వేడినీ,వాడినీ తాజాదనాన్నీ అందిస్తూ నీట్‌గా హార్ట్‌ని టచ్ చేస్తూనే వుంది. అందుకే

హ్యాట్సాఫ్ టు జంధ్యాల
హర్టాఫ్ టు జంధ్యాల

- పులగం చిన్నారాయణ

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 10



- ఇంద్రగంటి జానకీబాల

మన తెలుగు సినిమా ప్రాథమిక దశలో వున్నప్పుడు, చాలా మంది ధనవంతులు సినిమా తియ్యాలని వస్తున్న రోజుల్లో వారు నటుల కోసం వెదికినట్టుగానే గాయకుల కోసం, గాయనుల కోసం కూడా వెదుకులాడేవారు.

నాగయ్యగారు నిర్మించిన త్యాగయ్య సినిమాలో 'మధురా నగరిలో' పాటను కె. జమునారాణితో కలిసి పాడారు ఏ.పి.కోమల. అదే ఆమె మొట్టమొదటి సినిమా పాట. అప్పుడామె చాలా చిన్న పిల్ల. ఏడెనిమిదేళ్లకు మించి వుండవు. ఆ పాట పాడటంలో ఆ చిన్నారి చూపించిన ప్రతిభ పెద్దల్ని ఆకట్టుకుంది.

అప్పట్లో పాడేవారి కోసం రేడియోవారు సినిమా వారిని అడగడం -అలాగే సినిమా వారు రేడియో వారినడగడం సర్వసాధారణం - ఆ రెండూ అప్పట్లో బలమైన మాధ్యమాలు.

తర్వాత రేడియోవారు చిన్నపిల్లల కార్యక్రమంలో పాడేందుకు చక్కగా పాడే పిల్ల కావాలంటే నాగయ్య ఏ.పి.కోమలను రేడియోకి పరిచయం చేశారు. ఆమె అక్కడ పాడి రేడియో కళాకారిణిగా కాంట్రాక్ట్ ఉద్యోగమే సంపాదించుకున్నారు. అది 1944 అంటే ఆమె సుమారు తొమ్మిదేళ్ళ పిల్ల.

అప్పట్నించి ఆమె కర్ణాటక శాస్త్రీయ సంగీతం నేర్చుకోవడంలోనే ఎక్కువ ఆసక్తి చూపారు. చిన్నప్పుడు రాజమండ్రిలో జి.పైడిస్వామి అనే నాదస్వర విద్వాంసుల దగ్గర సంగీతం నేర్చుకున్నారు. మద్రాసు వచ్చాక ఎస్.నర్సింహులు దగ్గర గాత్రం అభ్యసించారు.

ఆమె రేడియోలో పాడిన మొదటి భావగీతం దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి రాసిన 'ఆకులో ఆకునై -పూవులో పూవునై' అనే పాట-

ఆమె రేడియోలో వుంటూనే సినిమాలకి వచ్చి పాడుతూండేవారు. ఘంటసాల బలరామయ్య నిర్మించిన 'శ్రీ లక్ష్మమ్మకథ' (1950)లో సూర్యప్రభకి 'తాళగ జాలనురా' అనే



## కోమలగళం ఏ.పి.కోమల

ఒక జావళి పద్ధతిలోని పాట, ఫరజు రాగం తిల్లానా 'సుదతి నీకు తగిన చిన్నదిరా' అన్న సాహిత్యం గలది పాడారు. ఈ సినిమాకి సి.ఆర్. సుబ్బురామన్ సంగీతం కూర్చటంతో ఆ పాటలు అందంగానూ, పాడేందుకు కాస్త కష్టంగానూ వుండి అందర్నీ ఆకర్షించాయి.

'పరాశక్తి' అనే చిత్రంలో సుదర్శనం సంగీత దర్శకత్వంలో నాట్య గీతంగా 'మా తెనుగు తల్లికి మల్లెపూదండ' పాడారు.

ఎస్.రాజేశ్వరరావు సంగీతం చేసిన 'పెంపుడు కొడుకు' చిత్రంలో 'చిన్నారి చిట్టి పాపా! కన్నారి కనుపాపా' అనే పాట ఎంతో ప్రజాదరణ పొందింది. ఆ పాట ఆమె ఎంతో భావయుక్తంగా, ఆర్ద్రంగా పాడారు.

తర్వాత 'రక్తరేఖ'లో 'బిడియమా మనలో ప్రియతమా' పాడారు. అలాగే 'అంతా మనవాళ్ళే', 'సతీసులోచన', 'దీపావళి' చిత్రాలలో పాటలు పాడుతూ తనకున్న కర్ణాటక శాస్త్రీయ సంగీతాన్ని విడవకుండా సాధన చేస్తూ, కచేరీలు చేస్తూ వున్నారు. 'దీపావళి' చిత్రంలో ఘంటసాల సంగీత దర్శకత్వంలో యుద్ధ సన్నద్ధ అయి సత్యభామకు (సావిత్రి) ఆమె పాడిన 'సరియా మాతో సమరాన నిలువగలడా' అన్న పాట పాడిన తీరు అపూర్వం, అమోఘం. అలాగే 'చంద్రహారం' లో ఘంటసాలతో పాడిన అప్సర గీతం "నఖా... వలపుపాట వినగానే పరవశించిపోతినోయ్...." అన్నది. ఇందులో ధ్వనించిన ఆ పాత్ర రూపగర్వం గమనించదగినది.

'పెళ్ళిచేసి చూడు' చిత్రంలో 'బ్రహ్మయ్య! ఓ బ్రహ్మయ్య' పాట కె.రాణి, ఉడత సరోజినితో కలిసి పాడారు.

కన్నారి శివరావు తీసిన 'పరమానందయ్య శిష్యుల కథ' లో పి.లీలతో కలిసి పాడారు. 'రక్తకన్నీరు', 'భక్తప్రహ్లాద', 'జయసింహ', 'పిచ్చిపుల్లయ్య', 'పెళ్ళికూతురు', 'భూకైలాస్', 'భక్తమార్కండేయ', 'పుట్టిల్లు', 'ప్రేమ', 'పెద్దరైతు', 'దీక్ష', 'చండీరాణి', 'తెనాలి రామకృష్ణ', 'రహస్యం', 'వసంతసేన', 'మాయలమారి', 'పాండురంగమహాత్యం', 'పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం', లాంటి ఎన్నో సినిమాలలో ఘంటసాల, మాస్టర్ వేణు,

సుదర్శనం, ఎమ్.ఎస్.విశ్వనాథన్ మొదలైన మంచి మంచి సంగీత దర్శకుల దగ్గర పాటలు పాడి మెప్పు పొందారు. ఆమె 'బంగారు పంజరం'లో పాడిన

'పదములె చాలు రామా! నీ
పద ధూళులె పదివేలు'

అన్న పాట అందర్నీ అలరించింది. ఇది దేవులపల్లి కృష్ణశాస్త్రి రచన. ఏ.పి.కోమల మారుతున్న సినిమా పోకడలకు అనుగుణంగా మారకుండా కేవలం శాస్త్రీయ సంగీతానికి, రేడియోకి అంటిపెట్టుకుని వుండిపోయారు. ఎప్పుడైనా ఎవరైనా పిలిచి సినిమా పాట పాడమంటే తప్ప తానుగా ప్రయత్నించింది లేకుండా పోయింది.

"నాకేం బాధలేదు. నాకు శాస్త్రీయ సంగీతమంటే చాలా యిష్టం. త్యాగరాజు కీర్తనలు పాడుకోవడంలో నాకెంతో ఆనందం కలుగుతుంది. శాస్త్రీయ సంగీత కచ్చేరీకి వెళ్ళి పాడివచ్చినప్పుడు నాకెంతో తృప్తిగా వుంటుంది" అంటారామె.

నిరాడంబరంగానూ, నిర్మలంగా కనిపించే ఏ.పి.కోమల అవివాహితగానే వుండిపోయారు. ఆమె చెల్లెలు గంగ, అన్నగారు అంతా సంగీతం పాడుకుంటూ ప్రశాంతంగా వున్నట్లు ఆమె స్వచ్ఛంగా చెప్పారు. అన్నగారు చెల్లెళ్ళు వివాహం అనే ప్రసక్తి లేకుండా సంగీతమయమైన జీవితం గడుపుతున్నారు.

28.8.1935 పార్థసారథి-లక్ష్మీ దంపతులకు ముద్దులబిడ్డ ఏ.పి.కోమల. ఈమధ్యనే ఆకాశవాణి మద్రాసు కేంద్రం నుండి పదవీ విరమణ చేసి పూర్తి సమయం సంగీత సాధనలోనే వినియోగిస్తున్నారు.

"రత్నకాంతి (లతాంగి జన్యం),భవప్రియ లాంటి రాగాలు నాకు చాలా యిష్టం" అని ఆమె చెప్పారు.

"నాకు భక్తి రసమంటేనే యిష్టం. భక్తిగీతాలు పాడాలనివుంటుంది. మరీ విషాదం యిష్టపడను" అంటారు.

మనిషి సున్నితం-మాటలో మరీ లాలిత్యం. ఇప్పటికీ తంబురా మీటినట్లు పలికే గొంతు.

ఒక్కొక్క ప్రొఫెషన్‌లో రాణించడానికి వారి కున్న వ్యక్తిగత యిష్టాలు, ఆసక్తి కూడా ఎంతో దోహద పడతాయని ఏ.పి.కోమలతో మాట్లాడితే అనిపిస్తుంది. ఆమె శాస్త్రీయ సంగీతం పట్ల చూపించిన ఆసక్తి సినిమా నేపథ్య సంగీతం మీద చూపించలేదనిపిస్తుంది. అయినా, ఆమె పాడిన కొన్ని పాటలూ ఇప్పటికీ సంగీతాభిమానులకు గుర్తున్నాయన్నది నిజం. ●

**చిత్రం :దీపావళి (1960)**
**గానం : ఏ.పి. కోమల**
**సంగీతం : ఘంటసాల**
**రచన : సముద్రాల**

సరియా.... మాతో సమరాన నిలువ గలడా
సరియా.... మాతో సమరాన నిలువ గలడా
సరియా.... మాతో సమరాన నిలువ గలడా
పెదవుల వలపు సింగారమొలక
కన్ను కొనల కోపానలమెనయా ॥పెదవుల॥
యదుపతి మురియ నరకుడు వెరవ
స్థలము బలము చూపే...గా....
సరియా.... మాతో సమరాన నిలువ గలడా
దురమున ప్రబల దానవ కోటి
పరువు మాపి ఇలగూసిన మేటి ॥దురమున॥
నరహరి బెదుర నరకుని తరమా
దురుసు పలుకులాడేనా.....
సరియా.... మాతో సమరాన నిలువ గలడా
కన్నెలు మదిని సమ్మోహపడగా
దనుజలోకము కంపిలిపోవ ॥కన్నెలు॥
దనువుగని... మనోహరుని.. ॥2॥
సరసన... నిలచి... నరకుని... గెలిచి
బిరుదు గొనక మానేనా
సరియా.... మాతో సమరాన నిలువ గలడా
సరియా.... మాతో సమరాన నిలువ
సమరాన నిలువ
సమరాన నిలువ గలడా

**చిత్రం :బంగారుపంజరం (1969)**
**గానం : ఏ.పి. కోమల**
**సంగీతం : సాలూరి రాజేశ్వరరావు**
**రచన : దేవులపల్లి కృష్ణశాస్త్రి**

పదములె చాలు రామా - నీ
పద ధూళులే పదివేలు
నీ పదములె చాలు రామా
నీ పదమంటిన పాదుకలు - మ
మ్మాదుకొని ఈ జగమేలు
నీ పదములె చాలు రామా
నీ దయ గౌతమి గంగా - రామయ
నీ దాసులు మునుగంగా... రామా ....
నీ దయ గౌతమి గంగా - రామయ
నీ దాసులు మునుగంగా
నా బ్రతుకొక నావ
దానిని నడిపే తండ్రివి నీవా
పదములె చాలు రామా - నీ
పద ధూళులే పదివేలు
నీ పదములె చాలు రామా
కోవెల లోనికి రాలేను
నువు కోరిన కానుక తేలేను
నినుగానక నిముషము మనలేను
నువు కనబడితే నిను కనలేను ॥నిను॥
పదములె చాలు రామా - నీ
పద ధూళులే పదివేలు
నీ పదములె చాలు రామా

**చిత్రం : శ్రీ సత్యనారాయణ మహత్యం(1964)**
**గానం : ఏ.పి. కోమల**
**సంగీతం : ఘంటసాల**
**రచన : జూనియర్ సముద్రాల**

ఓం నమో నారాయణా
మాం పాహి శ్రీ నారాయణా
ఓం నమో నారాయణా
మాం పాహి శ్రీ నారాయణా
ఓం నమో నారాయణా
జాలి మాలి మా మొర
నీవాలకించవదేలరా
జాలి మాలి మా మొర
నీవాలకించవదేలరా
జాలమేల కావరా
కరుణాలవాల ఏలరా
ఓం నమో నారాయణా
మాం పాహి శ్రీ నారాయణా
ఓం నమో నారాయణా
జీవ జీవన కారణా భయ వారణ భవతారణా
జీవ జీవన కారణా భయ వారణ భవతారణా
దేవ దేవ పావనా మము బ్రోవరా దీనావనా
ఓం నమో నారాయణా
మాం పాహి శ్రీ నారాయణా
ఓం నమో నారాయణా
ఓం నమో నారాయణా .....
ఓం నమో నారాయణా....
ఓం నమో నారాయణా....

**చిత్రం : జయసింహ (1955)** **గానం : ఏ.పి. కోమల**
**సంగీతం : టి.వి.రాజు** **రచన : సముద్రాల**

ఓ..ఓ...ఓ...మనసైన చెలీ పిలుపు
మనసైన చెలీ పిలుపు
వినరావేల ఓ చందమామ
మనసైన చెలీ పిలుపు
వినరావేల ఓ చందమామ
మనసైన చెలీ పిలుపు
పిలిచే నిన్నే నే వలచాననా
బిగిసేరు మగవారలు
పిలిచే నిన్నే నే వలచాననా
బిగిసేరు మగవారలు
ఓ..ఓ... తలచేరులే చెలీ
నిను చూడగా
వలచేనే నను జాబిలి
ఓ..ఓ... అటు నవ్వేను ననుజూసి
అటు నవ్వేను ననుజూసి
నను కవ్వించి ఆడెను దోబూచి
అటు నవ్వేను ననుజూసి
లే నవ్వుల తొలి లాలింతురే
తుది కన్నీట తేలింతురే
లే నవ్వుల తొలి లాలింతురే
తుది కన్నీట తేలింతురే
ఓ..ఓ... నమ్మేదెలా మనసమ్మేదెలా
మనసేనాడో ఆ రాజు సొమ్మాయెనే
ఓ..ఓ... మనసైన చెలీ పిలుపు
మనసైన చెలీ పిలుపు
వినరావేలా ఓ చందమామ...
మనసైన చెలీ పిలుపు




'కొన్ని పాటలు వింటున్నప్పుడు చాలా బాగుంటాయి. కొన్ని పాటలు పదిమందిలో పాడేటంత ఉదాత్తంగా, గౌరవనీయమైన స్థానంలో ఉంటాయి. కొన్ని పాటలు స్వర రచనా పరంగా క్లిష్టంగా ఉన్నా సరే ఆదరించదగ్గ స్థాయిలో ఉంటాయి. ఈ మూడు అర్హతలనూ కలిగి ఉన్నా కేవలం క్లాస్ అనే ఒక వర్గానికి మాత్రం కట్టుబడిపోయి ఎంతో మందికి అందకుండా ఉండిపోయిన మంచి పాటలలో

# విమల

చిత్రంలోని ఓ రెండు పాటలు వస్తాయి. 1960 లో విడుదలయిన ఈ చిత్రానికి మాటలూ-పాటలూ ముద్దుకృష్ణ రాశారు. సంగీతం సుబ్బయ్యనాయుడు అందించారు.

సుబ్బయ్య నాయుడు అనగానే తెలుగువారందరికీ 'మురిపించే మువ్వలు' చిత్రం..'నీ లీల పాడెదదేవా' పాట ..గుర్తొచ్చేస్తాయి. యన్.టి.ఆర్., భానుమతి నటించిన 'అగ్గిరాముడు' చిత్రాన్ని నిర్మించిన పక్షిరాజా సంస్థకు సుబ్బయ్య నాయుడు సంగీతాన్ని అందించే వారు. ఆ పక్షిరాజా సంస్థే నిర్మించిన ఈ చిత్రం ద్వారా అందించిన ఓ రెండు ఉత్తమ గీతాలివి.

అ: కన్నుల్లో నీ బొమ్మచూడు
నా....కన్నుల్లో నీ బొమ్మచూడు
అది కమ్మని పాటలు పాడు ॥కన్నుల్లో॥
ఆ: పున్నమ వెన్నెల వన్నెలలో ॥ పున్నమ॥
కన్నుల కట్టిన రూపముతో
నీవే మనసున తోచగా ॥నీవే॥
నను నేనే మరిచిపోదురా ॥కన్నుల్లో॥
అ: కోయిల పాటల తీరులతో ॥కోయిల॥
సరికోయిల రాగాలల్లుదమా ॥ సరి॥
ఆ: నచ్చిన పూవు గద నేను ॥ నచ్చిన॥
కోరి వచ్చిన తుమ్మెద నీవేరా ॥కన్నుల్లో॥
అ: రాగమాలికల వీణనీవే ॥రాగ॥
అనురాగము లేలే జాణవెలే ॥ అను॥
ఆ: నీవే వలపుల జాబిలిరా ॥నీవే॥
సరి నేనే కులుకుల వెన్నెలరా ॥కన్నుల్లో॥



ఈపాటను మరొక అద్భుత స్వరరచనగా పేర్కొనాలి. ఈ పాటను కూడా ఘంటసాల, జయలక్ష్మి పాడగా ఎన్.టి.ఆర్, సావిత్రిపై చిత్రీకరించారు. ఇది ఒక రాగమాలికా గీతం. సాధారణంగా రాగమాలిక అనగానే ఒక రాగం నుంచి ఇంకో రాగంకి స్వర రచన మారినప్పుడు శ్రోతలు ఒక విధమైన జంప్‌ని ఫీలవడం జరుగుతూ ఉంటుంది. అటువంటి జంప్‌ని ఎక్కడా కనబడనీయకుండా సాఫీగా స్వరపరచబడిన గీతమిది. పల్లవికి పహాడి రాగం బేస్‌గా ఉంటే 'పున్నమ వెన్నెల వన్నెలలో' చరణానికి రాగేశ్రీ రాగాన్ని, 'కోయిల పాటల తీరులతో' చరణానికి తిలంగ్ రాగాన్ని 'రాగమాలికల వీణ నీవె' చరణానికి కాఫీ రాగాన్ని వాడుకున్నారు. ఈ రాగాలను వాడుకోవడంలో కూడా జనరంజకత్వం కోసం రాగేశ్రీ రాగంలో రాని కాకలినిషాదాన్ని-తిలంగ్ రాగంలో లేని రిషభాన్ని ఉపయోగించారు. ఇవికాక ఉపయోగించిన రూపక తాళ ప్రకారంగా చూసుకుంటే కర్ణాటక శాస్త్రీయ సంప్రదాయానికి కావలసిన రీతిలోని ఆరు మాత్రల నడకలో ఉండే రెండు మాత్రల చొప్పున మూడు ఖండాలుగా కాకుండా హిందుస్థానీ పద్ధతిలో ఉపయోగించే మూడు మాత్రల చొప్పున రెండు ఖండాలుగా నడిపించటం ఓ ప్రత్యేకత ప్రయోగంగా పేర్కొనాలి. ఇక పాడిన ఘంటసాల, జయలక్ష్మి-బిందువులో సింధువులా తమ ప్రతిభనంతా ఎంతో క్లుప్తంగా, వినేవాళ్ల గుండెల్లో నిక్షిప్తంగా ఉండేట్లు ప్రదర్శించారు.

అ: కన్నుల బెళుకే కలువలురా ॥కన్నుల॥
కన్నియ తళుకే కనకమురా ॥కన్నుల॥
కలవోలే కనిపించే ॥కల॥
కలలోనె వలపించే ॥కల॥
కనులలో ఆ రూపే కాపురమైపోయే ॥కను॥కన్నుల॥
ఆ: కనరాని అందాలనే
కనులార కనినంతనే ॥కనరాని॥
వనమేమొ ఈ వేళనే ॥వన॥
నందనమనిపించెనే ॥నందన॥
విరులన్ని కనువిప్పెనే ॥విరు॥
చిరునవ్వు చిలికించెనే ॥చిరు॥
ఎనరాని శృంగారమే ॥ఎన॥
హృదయాలు కదిలించెనే ॥హృద॥ కనరాని॥
ఆ: ఇటు చూడు ఇటు చూడవే ॥ఇటు॥
ఇది ఏమి మటుమాయమే ॥ఇటు॥
అ: వనరాణి వగలాడిగా కునుసైగ కావించగా ॥వన॥
వనమేమొ ఈ వేళనే నందనమని పించెరా ॥వన॥
విరికన్నె కనువిప్పగా ॥విరి॥
చిరునవ్వు చిలికించగా ॥చిరు॥
ఎనరాని శృంగారమే హృదయాలు కరిగించెరా ॥ఎనరాని॥వనరాణి॥
అ: కోరి కోరి నీ రూపము కనగా ॥కోరి॥
తీరును ఆకలి దాహములే ॥తీరును॥
చేరి చేరి నీ పాటలు వినగా ॥చేరి॥
చిందును అమృత బిందువులే ॥చిందును॥ ॥కోరి॥
అ: కలలు ఫలించె కాలములో ॥కలలు॥
కలిసిన ప్రేమలు శాశ్వతమే ॥ కలిసిన ॥
ఆ: కలనైనా మెలకువనైనా ॥కల॥
లోకము సుందర నందనమే ॥లోకము॥ కలలు॥








ఈపాటను ఘంటసాల, జయలక్ష్మి గానం చేశారు. ఎన్.టి.ఆర్., సావిత్రి ప్రధాన పాత్రలలో అభినయించిన ఈ పాటలో రేలంగిలా డైలాగులు చెప్పే వేళంగి అనే హస్యనటుడు, సావిత్రికి చెలికత్తెగా నటించిన మరో నటి కూడా కనిపిస్తారు. ఇది ఒక రాగమాలికా గీతం. 'కన్నుల బెళుకే కలువలురా' అనే పల్లవి నుంచి 'కనులలో ఆ రూపే కాపురమై పోయే' అనే చరణం వరకు బేహాగ్ రాగంలో స్వరపరిచారు. వినసొంపుగా ఉండే ఈ బేహాగ్ రాగాన్ని మన సంగీత దర్శకులు అంతగా ఉపయోగించుకోలేదనే చెప్పాలి. ఓసారి సింహావలోకనం చేసుకుంటే ఎస్.రాజేశ్వరరావు స్వర పరిచిన 'చెంచులక్ష్మి' చిత్రంలోని 'నీలగగన ఘనశ్యామా' పాట 'భక్తప్రహ్లాద' చిత్రంలోని 'వరమొసగే వనమాలీ' పాట గుర్తుకు వస్తాయి. 'కన్నుల బెళుకే' పాట మొదటి చరణం - 'కనరాని అందాలనే' దగ్గర్నుంచి 'హృదయాలు కదిలించెనే' వరకు, ఆ తర్వాత అదే వరుసలో వచ్చే ఇంకో చరణం -

'వనరాణి వగలాడిగా' దగ్గర్నుంచి 'హృదయాలు కరిగించెరా' వరకు భాగేశ్రీ రాగాన్ని ఉపయోగించారు. ఈ రెండు చరణాల మధ్య వచ్చే 'ఇటు చూడు ఇటు చూడవే..ఇది ఏమి మటుమాయమే' అనే వాక్యాలకు బిలహరి రాగాన్ని వాడుకున్నారు. 'కోరి కోరి నీ రూపము కనగా' అనే చరణాన్ని గౌరీ మనోహరి రాగంలోను 'కలలు ఫలించే కాలములో' చరణాన్ని కళ్యాణి రాగంలోను స్వరపరిచారు. ఔత్సాహిక గాయనీ గాయకులకు ఈ పాట ఓ పరీక్షలాంటింది. మొత్తం పాటను సాధన చేసి ఏకబిగిన పాడగలిగిననాడు 'మేం పాడడానికి పనికొస్తాం'అని వారు ధైర్యంగా చెప్పుకోవచ్చు. సాధారణంగా శాస్త్రీయ సంగీత కచ్చేరీలు చేసే విద్వాంసులు కొన్ని సినిమా పాటలు పాడవలసి వచ్చినప్పుడు తమకు అలవాటైన ధోరణిలో పాడడం, సినిమా పాటల ఒరవడికి అలవాటుపడ్డ శ్రోతలకు ఈ ధోరణి మింగుడుపడని విధంగా వుండడం సహజం. 'రాధా -జయలక్ష్మి'గా శాస్త్రీయ సంగీత ప్రపంచంలో గౌరవప్రదమైన స్థానాన్ని సంపాదించుకున్న గాయనీమణుల్లో ఒకరైన జయలక్ష్మి ఈ 'కన్నుల బెళుకే' పాటలోని 'కనరాని అందాల' చరణాన్ని పాడుతుంటే సాధారణ స్థాయిలో ఉండే శ్రోతలకు కూడా శరీరం రోమాంచితం అయిపోతుంది. ముఖ్యంగా 'హృదయాలు కలిగించెనే' దగ్గర ఆవిడ హృదయాలను కదిలించేస్తుంది. ఆ రససిద్ధికి కారణం - రాగం భాగేశ్రీ కారణమా లేక జయలక్ష్మి పాడిన పద్ధతా అన్నది ఎవరికి వారే సమాధానం చెప్పుకోవలసిన ప్రశ్న. అలాగే చిరునవ్వు చిలికించగా' దగ్గర ఘంటసాల కూడ తనదైన రసస్పర్శతో పులకింప చేస్తారు.

ప్రజల మనసులలో చక్కని అభిరుచిని పెంపొందింపచేసి వారి చైతన్యంలో సంస్కారాన్ని నింపాలనుకునే దృశ్య, శ్రవణ మాధ్యమం ఏదైనా సరే ఇటువంటి పాటల వ్యాప్తి ద్వారా పదే పదే పూనుకుంటే చక్కని సాంస్కృతిక వారసత్వాన్ని తర్వాతి తరాల వారికి అందించిన సార్థకత చేకూరుతుంది.

తన అభినయంతో తెలుగు,
తమిళ, హిందీ, కన్నడ
చిత్రాలలోని ఎన్నెన్నో
మంచి పాటలకు
ప్రాణ ప్రతిష్ట చేయడమే కాక
ఆ అనుభవాలను
అక్షరాలలో అందిస్తున్న
శ్రీమతి జమున గారికి
పుట్టినరోజు (ఆగస్టు 30)
సందర్భంగా
పాఠకులందరి తరఫున
శుభాకాంక్షలతో...

హాసం

